స్త్రీల ఆరోగ్య
సౌభాగ్యములకు



# లోధ్ర




## కేసరి కుటీరం
(ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14

ఏజంట్లు:
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ, సికిందరాబాదు, మధుర, బరహంపురం, బెంగుళూరు

# తగ్గింపు ధరలు



ఆకర్షణీయమైన రంగులలో మిక్కిలి అందమైన నవీన డిజైనులలో చేనేత చీరలు ఒక్కొక్కటి ధర రు 7/50. 2 చీరలు రు. 14 3 చీరలు రు. 20. డీలక్సురకం ఒక చీర రు. 11. 2 చీరలు రు 21 3 చీరలు రు. 30 స్పెషల్ రకం చీరలు 1కి రు. 15. 2 చీరలు రు. 28/-. 3 చీరలు రు. 39/- అన్నిటికిపోస్టేజి ప్యాకింగు ఉచితం. 2 చీరలు కొనువారికి ఒక జత ఇయర్ టాప్స్, 3 చీరలు కొనువారికి ఒక బ్లౌజ్, ఒక జత ఇయర్‌టాప్స్, ఉచితముగా పంపబడును. కొద్ది స్టాకుగలదు. మీ ఆర్డరును వెంటనే పంపండి మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయుండి.

THE ROYAL STORES (APM2)
Post Box No. 1774. Delhi 6.

మీ వ్రాతకు ప్రత్యేకత నిచ్చుటకు

# కృష్ణవేణి

"సూపర్-ట్రయో"




హోల్ సెల్లింగ్ ఏజంట్లు:
నేషనల్ ప్రొడక్ట్స్ సిండికేట్
292, టి. హెచ్. రోడ్, మద్రాసు-21
ఫోన్: 51569



# ప్యారగాన్

## బట్టలు అనేక రకాలలో ఇప్పటికీ సర్వోత్తమం ఎందుచేత?

* శ్రేష్ఠతలో అసమానం-ఇక్కడ గాని లేక విదేశములందుగాని
* అత్యధిక గజములు ఎగుమతి చేయబడినవి మరియు చేయబడును
* అనేక ఉతుకుల తరువాత సహితం కొత్త వాటివలనే వుంటాయి
* మన్నికైనవి మరియు ఖర్చు తక్కువ
* ఇంట్లో సులువుగా ఉతుక్కోవచ్చును.

"టెరిలీన్" సూటింగులు, షర్టింగులు;
రెయాన్, నైలాన్ చీరలు, మరియు షర్టింగులు.




ప్యారగాన్ టెక్స్టైల్ మిల్స్,
బొంబాయి-13.

PTM. 1045 TEL.-EVEREST

# ఉత్తరాలు

## బీటిల్స్

మీరు గత సంచికలలో పరిచయం చేసిన 'బీటిల్స్'— పాటల సందర్భంలో— ఈ క్రింది వివరాలు కూడ జతచేస్తే బావుంటుందేమో!

'బీటిల్స్' పేరుతో పాల్ మెకార్ట్నీ, జాన్ లెన్నన్, జార్జ్ హేరిసన్, 'రింగోస్టార్' అనే నలుగురు 'లివర్‌పూల్' అబ్బాయిలూ ప్రపంచంలోని ఇంచుమించు అన్ని పెద్ద దేశాల 'హిట్ పెరేడ్'లలోనూ ప్రథమ స్థానం సంపాయిస్తున్నారు తమ పాటలతో అమెరికా, బ్రిటన్ హిట్ పెరేడ్‌లలో వీళ్ల గ్రూప్ పాటలే టాప్ ట్యూన్స్!

'షీ వైలవ్' అనే పాట బెల్జియం హిట్ పెరేడ్‌లో బెస్ట్

'She loves you' (45—R 5055) ఫ్రాన్స్ హిట్ పెరేడ్‌లో టాప్ ట్యూన్

'ఫోరెవర్, ఫోరెవర్—' ఆస్ట్రేలియా హిట్ పెరేడ్‌లో పది వారాలపాటు విజయ దుందుభి మ్రోగించి, మొన్నటి (11—4—64) హిట్ పెరేడ్‌లో 'టాప్ ట్యూన్ ఆఫ్ ద వర్ల్డ్' స్థానం పొందింది

'I saw her standing there' అనేది— అదే ప్రోగ్రాంలో సెకండ్ బెస్ట్ ట్యూన్

'I wanna hold Your hand' (45—R 5084) అనే పాట అదే ప్రోగ్రాంలో ఏడవ స్థానం సంపాయించుకొన్నది

సరికొత్త పాటల్లో — ఆయా వారాల్లో 'ది బెస్ట్'గా పరిగణించబడే '8' ట్యూన్లు వారానికొసారి 'ఆస్ట్రేలియా హిట్ పెరేడ్'లో వినవస్తాయ్ దీనిలో, మొదటి రెండు స్థానాలతో కలసి, మొత్తం '3' స్థానాలలో 'బీటిల్స్' పాటలే

స్క్రీన్, టి వి రేడియో ప్రోగ్రాంలకు వీరు స్వంతంగా వ్రాసుకొన్న కొకొల్లల పాటల్లో "Bad to me", "There's a place", "I call your name", "I'll get you" వగైరాలు కొన్ని

"G E P 8880" నెంబరుతో వెలువడ్డ E P లో (The Beatles Hits) "from me to you", "Love me do", "Please Please Me", "Thank you girl" అనే నాలుగు పాటలూ బ్రహ్మాండంగా హిట్టయినవే! అందరిచేత కొద్దికాలంలోనే అమితంగా అభిమానించ బడుతున్నాయ్ 'బీటిల్స్' పాటలు అన్ని దేశాల సంగీత ప్రియుల నోళ్ళలోనూ నలిగిపోతుంది బీటిల్స్ పేరు అందుచేత ఆ పాటల రుచి తెల్సికోడాన్కి మనమూ ప్రయత్నం చేయాలి''

అందేవ్ (రాజమండ్రి)

## కథ

మీరు ప్రతివారం ప్రచురిస్తున్న ఉత్తరాలలో వారానికి ఒక ఉత్తరానికైన జవాబు ఇవ్వరు ఎందుచేత? కనీసం దేనికైన సమాధానం ఇస్తారా? "మరుపురాని ఉగాది" కథలో చివరన "అందుకని " అని ఆపుచేసారు. మా సందేహము తీర్చగోర్తాము.

పెన్మెత్స రామచంద్రవర్మ,
దాట్ల రామలింగరాజు (భీమవరం)

## వ్యాసాలు

శ్రీ ఎస్ వి రామారావుగారి 'మహానగరం లండన్' వ్యాసం చాల బాగుంది.

వై వి సూర్యనారాయణపాత్రో (పాలకొండ)

* * *

ఈనెల 17—4—64 సంచికలో ప్రచురించిన శ్రీ ఎస్ వి రామారావుగారిని గురించి "మనలో మాట" 1960 నుంచి లండన్‌లో ఉంటున్నారు అని వ్రాసినారు సరికాదు ఆయన 1962 సెప్టెంబరు 18 తేదిన లండను వెళ్ళినారు

బి అర్జునరావు (గుడివాడ)

* పొరపాటుకి చింతిస్తున్నాము.

* * *

10—4—64 సంచికలో ప్రచురించిన రామేశ్వరం చాలా బాగున్నది దీనిలో దేవిపట్నము (లేక నవ పాషాణం) గురించి రచయితగారు వ్రాయటం మరచిపోయినారు ఈ నవ పాషాణమును దర్శించనిదే రామేశ్వర యాత్ర పూర్తి కాదని చెప్పెదరు ఇది రామనాథపురంనుండి 9 మైళ్ళ దూరంలో ఉంది రామనాథపురంనుండి బస్సు వసతి కలదు. ఇచ్చటి నవ గ్రహములు ఆదికాలమున శ్రీరాములవారు లంకనుండి వచ్చిన పిదప సముద్రములో ప్రతిష్ఠ చేయించినవి వీటికి పూజ చేయించిన ఎడల పీడలు అన్నీ పోవునని అందురు

కె సత్యవతి (శ్రీరంగం)

## సినిమా

ఈవారం (10—4—64) పత్రిక, సినిమా వార్తలలో 'తెలుగు చిత్రాలకు ప్రభుత్వ బహుమతులు' అన్న శీర్షిక క్రింద సి ధర్మారావుగారు 'సాత్ పాక్ కె బంధ' చిత్రానికి ప్రాంతీయ చిత్రంగా రజిత పతకంను, ప్రశంసా పత్రాన్ని అందుకుంది అని వ్రాశారు కాని అది పొరపాటు అని వ్రాయడానికి చింతిస్తున్నాను బెంగాలీ భాషలో 'ఉత్తర్ ఫల్గుణి' అన్న చిత్రానికి రజిత పతకం లభించింది అంతేకాని 'సాత్‌పాక్ కె బంధ'కి రాలేదు ఆ చిత్రానికి ప్రశంసా పత్రం మాత్రమే లభించింది

కుమారి పద్మ (న్యూఢిల్లీ)

## కార్టూన్

మీ (17—4—64) వారపత్రికలో "కాఫీ హోటలుల్లో "సర్వారాయుళ్లు" చేయు ఆలస్యాన్ని హాస్య పూర్వకంగా తెల్పుతూ ఒక "కార్టూన్" ప్రచురించారు సర్వారాయుడు టీ తెచ్చేటప్పటికి "ఆర్డరిచ్చిన" మహాశయునికి గడ్డము పెరిగి పోయినట్లు చిత్రించారు బాగానే యున్నది కాని ఒక సందేహము—అదే "టైము"కు సర్వారాయునికి "గడ్డము—జుత్తు" ఏల పెరగలేదు? ఇది కార్టూనిస్టు లోపము కాదా???

ఎస్ సూర్యారావు (గుంటూరు)

## జన్మదిన ఫలం

మా వారపత్రికలో వార ఫలాలతో బాటు జన్మదిన ఫలితము గూడ వేస్తూ యున్నారు కాని అది ఏ రాశి వారికి ఏ విధముగా అన్వయించుకోవలెనో తెలియుట లేదు పత్రికా ముఖముగా తెలుప కోరుచున్నాను నా (మీ) అభిమాన ఆంధ్ర పత్రికలో వెలువడుతున్న సీరియల్స్ ఎంతో హృదయంగమంగా యున్నవి సీరియల్స్ రచయితలకు, మీకూ నా కృతజ్ఞతలు

ఉన్నం కోనారెడ్డి (తెగచర్ల) ★

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 27-3-64 సంచికలో 'కథ కానికథలు' వ్రాసిన ఓ. దాశరథీశర్మ (లక్నో), జి. యన్. కె పండా, (కాశీబుగ్గ), సి. వెంకటేశ్వరరావు (కాకినాడ) గారలను పూర్తి చిరునామాలను తెలియచేయ గోరుతున్నాము.

—సం॥



జననం 1933
మృతి 1962
స్వర్గీయ ప్రియ సోదరి
విరియాల
మీనాక్షిదేవి

జీవితాంతము స్వార్థరహిత సుహృద్భావంతోను, అనిర్వచనీయమైన బంధు ప్రీతితోను, ఎల్మయులందరిమనస్సులు చూరగొని 28 వత్సరముల చిరుత ప్రాయముననే అందరిని దుఃఖాంబుధిలోముంచి 28-4-62న హృద్రోగముచే స్వర్గధామమేగిన పుణ్యమూర్తి సర్వేశ్వరుడు ఆమె ఆత్మకు శాశ్వతశాంతి ప్రసాదించుగాక.

వదంతులను వినకండి
వదంతులను ప్రచారం చేయకండి

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 8—5—'64
క్రోధినామ సం॥ నిజ చైత్ర బహుళ ఏకాదశి
సంపుటము 56 సంచిక 36
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ 15 60 ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్ జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ 120 00. అమెరికా రూ. 176 80 ఆస్ట్రేలియా రూ 148 20

విడిప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న.పై.
6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1



## మనలో మాట

ఆస్ట్రేలియన్ ఎబారిజిన్లను గురించి వ్యాసం వ్రాసిన శ్రీ పి డి ప్రసాదరావుగారు ప్రస్తుతం అడిలైడ్ విశ్వవిద్యాలయం (ఆస్ట్రేలియా) లో పరిశోధన చేస్తున్నారు

ఆస్ట్రేలియన్ ఎబారిజిన్లకీ మనకీ చాలా సంబంధాలు ఉన్నాయని చదువుతాము అతి పురాతన కాలంలో 'ప్రొటో ఆస్ట్రలాయిడ్' జాతికి చెందినవారు మధ్యధరాసముద్ర ప్రాంతాల నుంచి భారతదేశం మీదుగా ఆస్ట్రేలియా మొదలయిన దేశాలకి వలస వెళ్లారుట ఇక్కడ స్థిరపడినవారివల్ల అంతకుముందు భారతదేశంలో ఉన్నవారికి ఎన్నో విద్యలు తెలిశాయి ఇవి చాలా ముఖ్య మయినవే! ఉదాహరణకి—మట్టి పాత్రల నిర్మాణం, వరి సాగుబడి, పత్తి దారంతో బట్టల నేత, చెరుకు నుంచి చక్కెర తయారీ, పారల తో తవ్వి సాగుబడి చెయ్యటం వగైరా

ఇవికాక హైందవ మతంలో కొన్ని ముఖ్యమయిన అంశాలు ఆస్ట్రలాయిడ్ సంప్రదాయాలను అనుసరించినవని చరిత్రకారుల అభిప్రాయం.

సంస్కృతంలోని 'తాబువ' (తెలుగులో 'తప్పు', ఫ్రాయిడ్ వాడుకవల్ల ఇంగ్లీషులో 'టాబూ' (Taboo !), 'బాణం', 'రాకా (చంద్రుడు)', 'గంగ' (నది), 'వ్రాతికా' (నక్షత్రమండలం) మొదలయినవి ఆస్ట్రలాయిడ్ భాషలనుంచి వచ్చినవే అని చదువుతాము!

పసుపు, కుంకుమ, తాంబూలం—వాటిని పుణ్యకార్యాలలో ఉపయోగించటం కూడా ఆస్ట్రలాయిడ్ సంప్రదాయమే అంటారు

ఇంతేకాక పురాణాలలో గుడ్డులో నుంచి ప్రపంచం వచ్చిందనే సృష్టి సిద్ధాంతం, వశాచ తారాలలో కొన్ని, జన్మసిద్ధాంతాలు, చంద్రుని దశల ప్రకారం తిథులు లెక్కపెట్టటం వగైరాలన్నీ ఆస్ట్రలాయిడ్ జాతుల నుంచి తర్వాతివారు సంగ్రహించినవే అంటారు చరిత్రలు వ్రాసేవారు

* * *

24 వ పుటలో ప్రారంభమయ్యే 'ముఖాముఖి' శీర్షికలో శ్రీ ఎన్ టి రామారావుతో మా ప్రతినిధి జరిపిన యింటర్వ్యూ వేశాము చలనచిత్ర పరిశ్రమగురించి యీ ఇంటర్వ్యూలో ప్రస్తావించకపోవడానికి కారణం పైవారంనించి శ్రీ ఎన్ టి రామారావుగారు వ్రాసిన వ్యాసాలను వేద్దామనుకోడమే! ఈ విషయాలలో శ్రీ రామారావు అభిప్రాయాలు తెలుసుకోగోరేవారు పై వారంనుంచీ అవి తెలుసుకోవచ్చు

* * *

వచ్చే వారం 'వారఫలం' శీర్షికలో మరొక ప్రత్యేకమైన ఆకర్షణ కూడా వుంటుంది. పోతే జన్మదినఫలం విషయంలో మా పాఠకులలో చాలామందికి కొన్నిసందేహాలు వస్తున్నట్లున్నవి. 'పుట్టినరోజు' ఫలితాలేగాని యివి రాశిఫలాలు కావు ఉదాహరణకి మే 8 వ తేదీన పుట్టినవారందరికీ, ఆ ఫలితాలు ఒక సంవత్సరం పనికొస్తాయి అదే విధంగా మిగతా తేదీలవారిగా ఎవరి పుట్టినరోజునుబట్టి వారి వారు సంవత్సర ఫలాలు చదువుకోవచ్చు ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'మురళీకృష్ణ'లో శారద


అబ్దుల్లా
కడుపుబ్బరం
కోరికలు
ఆకోరిక రేపో మాపో వెలి
గ్రక్కితే మళ్ళీ పల్చ
బడతాడు లెండి


ప్రత్యేక అధికారాలు
ఇనకమ్ టాక్సు ఆఫీసర్
పౌరుడు
భవిష్యత్తులో


భూటాన్


విదేశ పెట్టుబడి దారులు
కుక్కలు ఉన్నాయి
జాగ్రత్త
ఇండియా


కాని యీ కుక్కలు
కరిచే కుక్కలు
కాదు లెండి
ప్రతిపక్షం

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# రాబోయే కొన్ని ఆకర్షణలు!

●

## 15-5-64

## ఫుట్‌పాత్ బ్రతుకులు!

ప్రత్యేక సచిత్ర వ్యాసం!

●

## చలనచిత్ర పరిశ్రమపై

ఎన్. టి. రామారావు

వ్యాసాలు ప్రారంభం!

●

## 22-5-64

## వనితాలోకం

ప్రముఖ రచయిత్రుల వ్యాసాలు ప్రారంభం!

బొమ్మలు: బాపు

●

## 29-5-64

ప్రత్యేక బాలసాహితి శీర్షిక

## ప్రారంభం!



తిరువంజైకలం గుడి



కోడుంగ్గోలూర్ భగవతి విగ్రహం.

# తిరువంజయ్‌కలం

**కేరళలో ఎర్నాకుళం దగ్గరే ఉన్న ఒక చిన్న గ్రామం పేరు తిరువంజయ్‌కలం.**

ఇక్కడ ఆలయం శివుడిది ఇక్కడనుంచే సుందరమూర్తి, అతని మిత్రుడు చేరమాన్ పెరుమాళ్ రాజు తెల్ల ఏనుగు, గుర్రం ఎక్కి కైలాసానికి వెళ్లిపోయారుట .. (9 వ శతాబ్దం)

## శివుని వరం

కైలాసం చేరిన తరువాత రాజుగారిని లోపలకు రానివ్వకపోతే శివభక్తుడు సుందరమూర్తి ఈశ్వరుడిని ప్రార్థించి, సాధించాడుట!

ఇక్కడ ఆలయమే కాక కోట కూడా ఒకటుంది ఇదీ చేరమాన్ పెరుమాళ్ కట్టించిందే అని ప్రతీతి దీని పేర్లు 'కోట్ట ముకు' లేక 'కృష్ణన్ కోట్ట'

కేరళలో దేవాలయాల వాస్తు నిర్మాణం చిత్రంగా ఉంటుంది! బొమ్మలలో చూస్తే పెంకుల వేసిన చూరు త్రికోణాకారాలలో నిర్మాణాల ఎలా ఉంటాయో తెలుస్తుంది ఇక్కడ గుళ్లలో దీపాలు 'పిరమిడ్' ఆకారాలు కలిగి ఉంటాయి చాల ప్రశస్తమయినవి ఇటువంటి రకం దీపాన్ని 'అడుక్కు దీపం' అంటారు.

## మెక్కాయాత్ర

ఇంత పూర్వ సంప్రదాయం ఉన్నప్పటికీ ఇక్కడి వారికి సుందరమూర్తి (నయనార్ గురించి అంతగా తెలియకపోవటం ఆశ్చర్యకమయిన విషయం రాజుగారు మాత్రం ఒకసారి 'మెక్కా' వెళ్లి వచ్చాడని చెప్పుకుంటారు! అసలు నయనార్ రాజుల మధ్య స్నేహం విషయం మలయాళ సాహిత్యంలోనే లేదుట! అయితే, ఇక్క చెక్కడాలనుబట్టి వాటిని చేసినవారు 'పెరిం పురాణం' చదివి ఉంటారని ఊహించ బుద్ధి వేస్తుంది

గుడి చాలావరకు చెక్కతో కట్టి ఉంటుంది విగ్రహాలు లోహంతో చేసినవి. అరవదేశం నుం భక్తులు, ప్రతి సంవత్సరం 'ఆడి' (ఆషాఢ నెలలో 'గురుపూజ' అని చేస్తారు

గోడలమీద మసకగా వర్ణచిత్రాలు కూ కనుపిస్తాయి.

**బొమ్మలు వ్యాసం :**
**ఎస్. రామకృష్ణ.**



ఆంధ్ర రాజధాని నగరంలోని ఆంధ్ర సారస్వతపరిషత్ భవనంలో 26వ తేదీ సాయంత్రం దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి 26వ వర్ధంత్యుత్సవసభ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి అధ్యక్షతన జరిగినది.

రాజధాని కబుర్లు:

# 'జాతీయ సమైక్యత' కోసం నినాదాలు!
# సాంస్కృతిక సమావేశాల సంరంభం!!

జాతీయ సమైక్యత అనే పదం ఈ మధ్యలో తరుచు వింటూ వస్తున్నాం, హైదరాబాదులో కూడా అడపా తడపా, సమైక్యతా భావాన్ని గురించి ఉపన్యాసాలు జరిగినాయి జాతీయ సమైక్యతా భావం ఒకటి ఉండి తీరాలి అనే నినాదం రాక మునుపే అలాంటి భావం, రాజధాని ప్రజల మనస్సుల్లో, ఎప్పటి నుంచో పాతుకుని ఉండి పోయింది ముస్లిములు, హిందువులు ముఖ్యంగా ఒకర్నొకరు అర్థం చేసుకుని, సోదర భావంతో మెలుగుతూ వస్తున్నారు అనేక హిందూ కుటుంబాలతో ముస్లిముల కుటుంబాలు ఎడ తెగని సంబంధాలు పెంపొందించుకున్నాయి మత సంబంధమైన సహనం అలవరచుకున్నారు అందులో హిందువుల్లో చాలా మంది ఉర్దూ మాట్లాడటం చేత, చాలామటుకు స్త్రీలు కూడాను, భాషా బద్ధమైన సన్నిహిత తత్వానికి కట్టుబడి పోయారు, ముస్లిముల పండగల పట్ల, హిందువులకు ఆసక్తి అభిరుచి కూడా ఎక్కువే ఆ పండగల్లో వారిని అభినందించటం పరిపాటి, ఒకర్నొకరు గాఢాలింగనం చేసుకుని సంతోషాన్ని వ్యక్త పరుస్తూ ఉంటారు ఇలాంటి ఆచారాన్నే హిందువులు కూడా, తమ పండగల్లో సరదాకు అలవాటు చేసుకున్నారు కూడా! ఇంకా క్రిస్టియన్లు, సిక్కులు, పార్సీలు కూడా బాగానే ఉన్నారు వారివారి ఆచార వ్యవహారా లనువ్యక్తిత్వాలను నిలబెట్టుకుంటూ, అందరితో కలిసి మెలిసి ఉంటున్నారు మామూలుగా వారివారి పండగలకు స్నేహితుల్ని ఆహ్వానించి కాలక్షేపం చెయ్యటం మామూలే ఈ సారి పంజాబీ సభ వారు, కేవలం సిక్కులే కాదు, హిందువులు కూడా ఉన్నారు, పెద్ద యెత్తున ఉత్సవాన్ని జరుపుకున్నారు

ఈ ఉత్సవమే 'బైశాఖిమేళా' బైశాఖ్ అంటే వైశాఖ మాసం. ఇది చైత్రం తర్వాత వచ్చే రెండో మాసం అయినప్పటికి, పంజాబులో, అందులోనూ ముఖ్యంగా సిక్కులు, వైశాఖాన్నే, నూతన సంవత్సరంగా పరిగణించి, ఉత్సవాలు చేసుకుంటూ ఉంటారు ఇది అనుశ్రుతంగా వస్తున్న ఆచారం తర్వాత తర్వాత, ఈ మాసానికి అనేక విధాల ప్రాముఖ్యత వచ్చింది గురునానక్ ముఖ్యంగా ఈ నెలను అభిమానించటం, 'బారామహ' (పవిత్ర గ్రంథం) లో, ఈ నెలను గురించి ప్రస్తావిస్తూ, చెట్లు చిగిరించినాయి, పుష్పములు వికసించినాయి, ప్రియురాలు, తన ప్రియుని కోసం, ప్రేమ పూరితమైన నేత్రాలతో ఎదురు చూస్తూ ఉంటుంది ఈ విరహ హృదయానికి, దగ్గరగా నువ్వు చేరి, అనంతమైన ఆహ్లాదాన్ని చేకూర్చు అని ప్రియుణ్ని సంబోధిస్తుంది అప్పుడు గురువు ఉపదేశిస్తాడు, 'నీ నాధుడు ఎక్కడో దూరంగా లేడు, నీలోనే దాగి ఉన్నాడు హృదయ పూర్వకంగా ఆహ్వానించు ఆయన నీ దగ్గరకు వస్తాడు బైశాఖ్ ఎంతైనా అందంగాను, ఆనందంగానూ ఉంటుంది' అని. అదీగాక 'బైశాఖ్' ఖాల్సా జన్మదినం కూడా, సిక్కుల చిట్ట చివ్వరి గురువు గురుగోవింద్

## రాజధాని కబుర్లు

సింగ్, ఇదే రోజున, 263 సంవత్సరాల క్రితం, ఆనంద్‌పూర్‌కు సిక్కుల నందర్నీ, గడ్డాలు మీసాలతో, రమ్మనమని ఆదేశించాడు దాదాపు లక్ష మంది ఆయన ఆజ్ఞను పాటించారు వారికి ఐక్యతా భావాన్ని ఉపదేశించారు అందువలనే ఈ నాడు, అందరూ కలిసి, సోదర భావాన్ని వ్యక్తం చేసుకుంటూ ఉంటారు. ఈ రోజునే, అనేక వేల మంది అపారమైన త్యాగాలు చేసి మాతృదేశ గౌరవాన్ని నిలబెట్టారు

అనేక విధాలుగా ప్రసిద్ధి కెక్కిన, ఈ బైసాఖీ రోజున చేసుకున్న ఉత్సవములో అనేక ఆహ్లాదకరమైన దృశ్యాలు కనబడ్డాయి. అందర్నీ ఆకర్షించింది భాంగ్రా (భంగారా) నృత్యం. ఇది పంజాబీయుల జానపద నృత్యం దీంట్లో సిద్ధహస్తులైన నటీనటులు చాలా మంది వున్నారు ప్రత్యేకంగా పంజాబీయులు ఆడ, మగ అనే భేదం లేకుండా చనువుగానూ, గౌరవగానూ మాట్లాడటం, కులాసాగా కబుర్లు చెప్పటం అలవాటు మన ఆంధ్ర దేశంలో అడుగుపెట్టేటప్పటికి, అనవసరమైన బిడియం, కాస్తంత సిగ్గును అభినయించటం అలవాటు చేసుకున్నప్పటికి, ఈ ఉత్సవంలో మాత్రం అవి అట్టే కనిపించలేదు పద్మశ్రీ పృథ్వీ రాజ్ కపూర్ ఈ ఉత్సవాలకు రావటం మరొక ప్రత్యేకత ఆజాను బాహుడు, నిండు విగ్రహం, గంభీరమైన ముఖవర్చస్సు, నటనా కౌశల్యం, వాక్పటిమ, ఆయనలో జీర్ణించుకు పోయినాయి. రంగ స్థలంలో నాలుగైదు దశాబ్దాలుగా, తన అఖండ ప్రజ్ఞను ప్రదర్శిస్తూ, రాణించిన ప్రఖ్యాత నటులు పృథ్వీరాజ్ జీవితం ఎంతో మంది నటీ నటులకు ఆదర్శప్రాయం

రాజదాని నగర వాసులకు ఇంకొక అపూర్వ సావకాశం లభించింది— ప్రఖ్యాత సినీతార, వైజయంతీ మాలను, విశ్వకవి రవీంద్రుడు రచించిన ప్రఖ్యాత నృత్య నాటికలో, చండాలిక రూపంలో చూడ గలగటం రెండు రోజుల పాటు ఈ నాటికను ప్రదర్శించినప్పటికీ, ప్రవేశ రుసుములు ఆకాశాన్నంటటం వలన చాలా మంది కళాకారులు, సంఘ సేవకులు, ఈ ప్రదర్శనాన్ని చూసి ఆనందించలేక పోయారు. కనీసం, వైజయంతీమాల దర్శనమన్నా చేసుకోవాలని, అనేక మంది, రవీంద్ర భారతి చుట్టూ చేరుకున్నారు వేలం వెర్రి బాగానే కనిపించింది కాని, ఈ మధ్య అక్కినేని వారికి సన్మానం చేసిన రోజున విచ్చేసిన ప్రేక్షకులు కొంత మంది వెలుబుచ్చిన అభిప్రాయాలు మాత్రం వినపడలేదు. ఏమైనప్పటికి సినిమా నటీ నటుల్ని చూడాలనే తాపత్రయం, ఆకాంక్ష, ప్రజల్లో మితిమీరి పోవటం, తమ ఆవేదనను, బాహాటంగా ఇష్టం వచ్చినట్లు వెలిబుచ్చటం జరుగుతూనే ఉంది 'అమ్మయ్య జన్మసార్థకం అయింది' అని వాళ్ళు బిగ్గరగా అన్నప్పటికి, వాళ్ళల్లో చెలరేగిన ఉద్రిక్తత, ఆవేశం, తెలియ జేస్తాయి గాని, నిజంగా వాళ్లూ అనుకోరు జన్మసార్థకం అయిందని ! సార్థకం విషయంలో చలించని విశ్వాసం లేని నాబోటి వాళ్ళకు, గూఢార్థంల్లోకి పోవాలంటే, మనస్సు ఇష్టపడదు కూడా !

ఇవిగాక, కొత్త సంస్థల ఉద్ఘాటనలు, పాత వాటి సాలానా జల్సాలు, విందులు, వీనుల విందుగా సంగీత కచేరీలు, పదిమంది రచయితలు కలుసుకుని కాలక్షేపం చెయ్యటాలు కూడా జరిగిపోయినాయి. ఇందులో ఆంధ్ర విశ్వ సాహితీ తాలూకు సమావేశంలో, గురజాడ అప్పారావుగారి పుత్రులు, గురజాడ రామదాసుగారు తమ తండ్రి గారిని గురించి చెప్పటం ఒక ప్రత్యేకతగా భావించాలి ఆ రోజుల్లో వీధి అరుగుమీద కూర్చుని, అప్పారావుగారు ఎలాంటి విప్లవ భావాల్ని లేవదీశారో, ఆనంద గజపతి మహారాజాగారు వారికి ప్రతి విషయం లోనూ తోడ్పాటుగా ఉండి, వారి సాహిత్య కృషికి, సంఘ సంస్కరణలకు ఏ విధంగా చేయూతనిచ్చింది, వివరాలు, సన్నిహితంగా ఉన్న వ్యక్తి చెప్పటంలో విశిష్టత లేక పోలేదు ఈ సందర్భం లోనే, ప్రొఫెసర్ గోకక్‌గారు, ఉత్తమ కథానికా లక్షణాల్ని గురించి చేసిన ప్రస్తావన కూడా గమనార్హం మరుగుపడ్డ మానవత్వాన్ని, హృద్యంగా, మనస్సును ఆకట్టేటట్లు, రచయిత, ఒక దృశ్యాన్ని సంఘటననో రూపొందించాలి ఈ చిత్రణ, ఒక్క మెరుపులాగ, త్రుటిలో మనస్సును కదిలించెయ్యాలి. పాఠకుడు, ఆ భావాన్ని ఆకళింపు చేసుకుని, పదేపదే, ఆలోచనల్లో నిమగ్నుడయి పోతాడు. ఆ క్షణంలో వచ్చిన కుదుపు తాత్కాలికమయినప్పటికి, మానవ హృదయం మీద దాని ప్రభావం, అనేక రకాలుగా పడుతుంది. అలాంటి భావం ప్రస్ఫుటం చేయగల కథనిచ్చే ఉత్తమ కథానిక అనబడుతుందని అన్నారు

వేరే చోట మాట్లాడుతూ శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు అడ్వకేట్ జనరల్, రచయిత, కవి అందరికంటే గొప్పవాడని, రచయిత పొందిన అనుభూతుల ఉత్తమ స్థాయిని, తాత్కాలికంగా ఉన్నతోద్యోగములు చేపట్టిన వ్యక్తులు, చేరలేరని, ఉద్యోగాలతో పాటు, వ్యక్తుల హోదాలు, పేర్లు కొన్నాళ్లకు మాసిపోతాయని, అందువలనే, తాను, రచయితలకు, కవులకు ఇస్తున్న అత్యున్నతమైన స్థానాన్ని ఇతరులకు ఇవ్వలేక పోతున్నానని అన్నారు. ఈ కారణంగానే, తాను ఈ నాడు, పెద్ద హోదా గల ఉద్యోగం చేస్తున్నానని గర్వపడటం లేదని అన్నారు. బి. ఎల్. ఎస్. ★

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### అల్పాహారం

ఆవు పెయ్యలు
తినవు రొయ్యలు
గేద్దూడ
దూడ్పేడ
కావాలంటుందా ?
కోవాతింటుందా ?
తేనెటీగలు
తినవు తేగలు
పిల్లికూన
జంటిచేస
బాగా ఉంటుంది
తాగాలంటుంది.

### హాచ్ప్ ! ......

చచ్చిన చావులాంటి రొంప జలుబు
వచ్చిన వాళ్ళ ముక్కు పలగస బలుబు.

### ఈస్తూ వేస్తూ కలిస్తే వేస్తు

ఆడాళ్లూ మగాళ్లూ ఉత్తర దక్షిణ ధ్రువాలు
అయినా పెళ్ళాడ్డానికి వీళ్లు చాలా అవసరాలు
ఒప్పుకొంటాను ఈ పరస్పర విరుద్ధాల నివాహింపు
ఊరేగింపులో ఒకేసారి ఎందుకుసాన్నాయీ బ్యాండుల మిళాయింపు?



# అసురసంధ్య.



## సింగరాజు రామచంద్రమూర్తి

## 3

నిర్మానుష్యంగా ఉన్న వీధివెంట గబగబ అడుగులేసుకుంటూ ఇల్లు చేరుకున్నాడు రాజారావు. ఆవరణలోకి అడుగు పెడుతూ టైము చూసుకున్నాడు. తొమ్మిది గంటలు దాటింది.

"పాపం వీళ్ళని భోజనానికి ఆలస్యం చేశాను ఏమనుకుంటున్నారో ఏమో !" అనుకుంటూ గుమ్మం దగ్గరకు వచ్చిన అతనికి సుభద్రమ్మ గారు ఎదురయింది

"వచ్చావా నాయనా ! నీ కోసం ఇందాకటి నుంచి ఎదురు చూస్తున్నాను" అంది ఆవిడ— మీద నుంచి పెద్ద బరువు తీసినట్లుగా

సిగ్గుపడిపోయాడు రాజారావు.

"లేదత్తయ్యా, అలా రామదాసు తాత – అదే ఆ ముసిలాయనతో వెళ్ళాను. రావడం చాలా ఆలస్యం అయిపోయింది పాపం నీకిబ్బంది కలగ చేశాను."

"సరేలే !! ఆ సంగతి ఇప్పుడసలు ఆలోచించిందెవరుట ? ప్రొద్దుక్రుంకేసరికి అందరూ కొంపలకి చేరుకుంటారు ఈ పల్లెటూళ్ళలో అటువంటిది నువ్వు తొమ్మిదేసినా రాకపోవడం, అందునా ఇక్కడికి కొత్త వాడివి కావడం అన్నిటికన్నా మించి " ఆమె గొంతు రుద్ధమయిపోయింది

కాని ఆమె చెప్ప బోయేదేమిటో రాజారావు వూహించుకున్నాడు

హాల్లోకి రాగానే అంతవరకు ఆత్రంగా గుమ్మ కేసి చూస్తున్న వరలక్ష్మి ఛంగున లోపలికి వెళ్ళిపోవడం అతని కంట బడింది

నవ్వుకున్నాడు

భోజనం చేస్తూ తను చూసిన విషయాలు, విన్న మాటలు చెబుతుండం అతనికి అలవాటు అయినా తనీ రోజున చూసినది హత్యా ప్రదేశం కావడాన ఆ ప్రసిసక్తి తేవడానికి అతనికి ఒక పట్టాన ధైర్యం చాలింది కాదు.

అతను చెప్పక పోవడం వలన ఆవిడే అడిగింది:

"ఎక్కడికి వెళ్ళావు ఇంత ఆలస్యమయింది ?" అని

కొంచెం సేపు తటపటాయించి అన్నాడు రాజారావు "మావయ్యని— మావయ్య హత్య చేయబడిన చోటుకి" అని

కాసేపు ఎవ్వరూ మాట్లాడలేదు

గుమ్మంకి అవలగా నిలబడి వరలక్ష్మి అడిగింది "ఎందుకుట ?" అని

"ఎందుకు అని అడుగుతే సూటిగా సమాధానం చెప్పలేను గాని అది ఏమయినా సాయపడుతుందేమోనని ! రామదాసు తాతని తీసుక వెళ్ళమంటే చూపించాడు

"ఆ ప్రదేశం అంతా చాలా నిర్మానుష్యంగా గాను, భయం కలిగించేదిగాను ఉందత్తయ్యా! చుట్టూ తుమ్మ చెట్లు, కింద మోకాలు లోతున పచ్చగడ్డి, పిచ్చి మొక్కలు...... కాసేపు అక్కడ

నిలబడతా వానన్నలా తెలియని దిగులు, బాధ కలుగుతాయనుకో! నేనిక అక్కడ ఉండలేక పోయాను.''

సుభద్రమ్మగారు నిశ్శబ్దంగా కళ్ళు ఒత్తు కుంది.

''అయినా మావయ్యకి పిచ్చిగాని ఈ రోజుల్లో వైద్యానికి అంత కష్టపడాలా— వేలికి అందింది. వాళ్ళ ముఖాన కొట్టి ఇదే మందు అంటే వెళ్ళి పోతున్నారు. ఆ ఇచ్చిన మనిషి మీద నమ్మకం ఉంటే ఠక్కున నయమయి పోతున్నాయి కూడా. లేకపోతే 'వైద్యుడు' అని బోర్డు పెట్టిన ప్రతి వాడికి కుటుంబాలు ఎలా గడిచి పోతున్నాయని....''

అతనింకా ఏదో అనబోతుంటే వరలక్ష్మి ''మరీ అంత తేలిగ్గా మాట్లాడబోకు బావా, ఎవరో కొందరు ఉన్నారని అందరినీ అలా అంటే ఎలా— మా నాన్నగారిలాగా దానిమీద పరిశోధన చేసేవాళ్ళు బోలెడు మంది'' అంది కొంచెం నిష్ఠూరంగా.

రాజారావు ఖంగారు పడ్డాడు.

''నా ఉద్దేశ్యం అది కాదు వరం !'' అన్నాడు నవ్వటానికి ప్రయత్నిస్తూ.

కాని వినేందుకు వరలక్ష్మి అక్కడలేదు !

''అయినా మన ఖర్మగాని నాయనా. ఆయన

# అసురసంధ్య

అంతక్రితం అలా ఎన్నిసార్లు వెళ్ళారు కారు. అక్కడికీ నేనూ నీలానే చెబుతూండే దాన్ని — ''ఎందుకు అంతగా శ్రమ పడతారు, మీ శరీరం కూడా మంచిది కాదు. పోని ఆ వెళ్ళే దేమిటో పగటిపూట వెళ్ళరాదా— అర్ధరాత్రి అపరాత్రి పోకపోతే'' అని. ఆయన నవ్వేశేవారు—''ఈ వూళ్ళో పుట్టి పెరిగిన వాడిని, ప్రతి అంగుళం నేలా నాకు పరిచయ మయినదేనే పిచ్చిదానా'' అని... ఇందాక నువ్వు రావడం ఆలస్యం అయితే నా మనస్సు ఎన్ని విధాలయిపోయిందో తెలుసా ? పిచ్చిపిచ్చి ఆలోచనలు కూడా వచ్చాయి. ఎంతగా ఆపుగుందా మన్నా ఆగలేదు. దెబ్బతిని ఉండటాన్న మనస్సు ఎప్పుడూ కీడునే శంకిస్తుంది.... అవ్వాళ కూడా ఇంకా వస్తారు. ఇంకా వస్తారు అని చూస్తూ కూర్చున్నా. వరలక్ష్మి భయపడినా నేనే ఇంకా దానికి ధైర్యం చెప్పాను. ''మీ నాన్నని నా పదహారవ ఏట నుంచి ఎరుగున్నదాపూన్ని, ఆయన కీలా రావడం అలవాటే'' అని. ఖబురు విన్నాక కూడా తప్పేమో అనిపించింది చూసేదాకా......''

రాజారావు ఈ మాటలను వినిపించుకునే స్థితిలో లేడు. వరలక్ష్మి అలా వెళ్ళి పోవడం అతన్ని కలవర పెట్టింది. గబగబ భోజనం ముగించు కుని గదిలోకి వెళ్ళాడు. కొద్ది సేపటికి పక్క పాడి తీసుకొచ్చింద వరలక్ష్మి.

''కోపం వచ్చిందా వరం నా మాటకి'' అనడి గాడు నేరస్థుడిలా.

''ఏ మాటకి బావా ?''

''అదే— వైద్యం చేసే వారంతా.... అని నేను అన్న దానికి.''

ఫక్కున నవ్వేసింది వరలక్ష్మి. ''ఓ అదా. కోపం దేనికి ? నీకు మాత్రం తెలియదూ నాన్న గారంటే నీ కెంత గౌరవం ఉందో ?''

''భయపడి పోయాను సుమీ నీకు కోపం వచ్చిం దని.... ఇవ్వాళ ఆలస్యంగా వచ్చి అత్తయ్యని ఖంగారు పెట్టేశాను.''

''అవును బాబూ, భలే భయపడి పోయాం'' అంది బుంగ మూతి పెట్టి వరలక్ష్మి.

'' 'పోయాం' అంటున్నారు తమరుకూడా..!''

''పో! బావా !''

ఇద్దరూ ఫక్కున నవ్వేశారు. నవ్వుతున్న వరలక్ష్మిని చూసి ముగ్ధుడయి పోయాడు రాజారావు. అంతలోనే సీరియస్‌గా—

''పల్లెటూళ్ళను గురించి నాకున్న కొన్ని సదభిప్రాయాలు పటాపంచలయి పోయాయి వరం ! ఇక్కడి జనాభా యావత్తూ అమాయకు లని, వాళ్ళ పనులు, వాళ్ళ గోలే కాకుండా పొరుగు వారి సౌభాగ్యానికి కూడా పాటు పడతారని, వాళ్ళ కేమయినా కాల్లో ముల్లు గుచ్చుకుంటే అది తమకి జరిగినట్లుగానే బాధ పడిపోతారని అనుకునే వాడిని. ఇప్పుడు నేను కొద్దిగా పొరబడ్డానని తెలిసి వస్తోంది. పొరుగువారిని గురించి పల్లెటూళ్ళలో పట్టించుకున్నంతగా ఇంకెక్కడా పట్టించుకోరు. అయితే అది వారి మంచి గురించి కాదు— వారిలో ఏదయినా తప్పుంటే దాన్ని భూతద్దంలోంచి చూస్తారు. చూపిస్తారు. కొత్త వాళ్ళెవరయినా...''

''ఇంతకీ ఇప్పుడేమయిందంటావు బావా ?''

''నాకీ వూరి వాతావరణం నచ్చడం లేదు వరం. ఎవరిని చూసినా మరోడి మీద కథలు చెప్పేవాడే ! ఎవరు మంచో, ఎవరు చెడో తెలిసి చావదు.''

పకపక నవ్వింది వరలక్ష్మి. తెల్లబోయాడు రాజారావు. . .

''ఇదా నీ బాధ. వాళ్ళని గురించి అంతగా పట్టించుకో కూడదు బావా ! మనం అడిగితే చెబుతారా అడక్కుండానే చెబుతారా ? చిన్న ప్పటి నుంచి బస్తీలో పెరిగిన వాడివి పాపం— ఇక్కడి వారితో ఎలా మెసులుకోవాలో తెలియదు నీకింతే !.... హాయిగా కలలు కంటూ పడుకో— వస్తాను''

అతను మాట్లాడలేదు.

''కోపమా ?''

''ఎందుకటా ?''

''ఏదయినా పుస్తకం కావాలా ?''

''కలలు కనమన్నావుగా— నాతో మాట్లా డేవి కలలే !''

''పోనీ నేను కలలో కనబడతాగా — గుడ్



''ఇంట్లో అమ్మగారేం పని చెప్తారా? అంటారు మీరు...ఇదుగో అమ్మగారు

మెత్తగా నవ్వి పడుకున్నాడు రాజారావు.

తెల్లవార్లు అతనికి తుమ్మెదలూ, పాలరాళ్ళూ కొలనులో ఈదే చేపపిల్లలూ, సంపెంగ పూవులూ, శంఖాలూ అగపడ్డాయి. వాటి మీదుగా అతను హాల్లో చూసిన ఫొటో మీదికి పోయిందతని మనస్సు తల్లి కనబడింది. ఆమె వంక చూసేందుకు ప్రయత్నించాడు. . . .

తలుపు కొట్టిన చప్పుడుకి ఉలిక్కిపడి లేచాడు రాజారావు. గభాలున తలుపుతీసి అవతల నిలబడిన తల్లీ కూతుళ్ళని చూశాడు.

“ ‘అమ్మా’ అని అరిచావు నాయనా, నీకు కలలు ఎక్కువగా వస్తాయిలా ఉంది” అంది సుభద్రమ్మగారు.

కళ్ళు నులుముకుని చూశాడు. అప్పుడే వాళ్ళ స్నానాలు కూడా అయినట్లున్నాయి

“కాఫీ తయారయింది ముఖం కడుక్కో” అని వెళ్ళిపోయింది సుభద్రమ్మగారు.

వరలక్ష్మి నవ్వుతూ “రాత్రి గట్టిగా నిద్ర పట్టేసింది బావా— కలలోకి రాలేక పోయాను సారీ” అంది.

కాఫీ తాగుతూ ఆలోచనలో పడిన రాజారావు చూసి “అలా ఉన్నావేం నాయనా ?” అనడిగింది సుభద్రమ్మగారు.

“ఏంలేదత్తయ్యా” అన్నాడు.

అన్నాడేగాని ఆమెకి చెబుదామనుకున్న మాటల్ని ఎలా చెప్పాలా అని ఆలోచిస్తూనే ఉన్నాడు.

“బావకి మన వూరు ఏమీ నచ్చలేదటమ్మా” అంది వరలక్ష్మి నవ్వుతూ.

“అవునత్తయ్యా, ఆ విషయం చెబుదామనే నా ప్రయత్నం. . . . నాకీ లోకంలో నా అనేవారెవరయినా ఉన్నారా అంటే మీరే! మావయ్యవున్నన్నాళ్ళూ ఈ వూళ్ళో ఆయన ఉండవలసిన అవసరం ఉంది— సంపాదన ఉంది కాబట్టి, వూళ్ళో వాళ్ళు ఆయన సాయం అపేక్షించేవారు కాబట్టి, వైద్యుడయిన వాడికి వాళ్ళకి సేవ చెయ్యడం విద్యుక్తధర్మం కాబట్టి!

“ఇప్పుడు ఆ బంధం పోయింది. మీకీ వూళ్ళో ఇలు పొలం ఉన్నాయి. ఆ పొలం మీది ఆదాయం తోటే కుటుంబం నడవాలి. మీరు ఇద్దరూ ఆడవాళ్ళు. పొలంలో ఆడవాళ్ళు పనిచేసే కుటుంబం కాదు మనది. కాబట్టి అది ఎవరికయినా కట్టుబడికిచ్చి వాడిచ్చేదాంతో కాలం వెళ్ళబుచ్చడం తప్ప మీరూ చేయగలిగింది లేదు.

“నేనూ ఏదో గౌరవంగా ఉండే ఉద్యోగం చేసుకుంటూ సుఖంగానే కాలం గడుపుతున్నాను. మీరెవరో తెలియని రోజుల్లో, మీతోటి పరిచయం ఆత్మీయతగా మారని రోజుల్లో అయితే నా ఉద్యోగం, నా జీవితమే నాకు పరమావధిగా కనిపించాయి. కాని ఇప్పుడు పరిస్థితి వేరు. నేను ఇంటికి ఆలస్యంగా వస్తే బాధపడేవాళ్ళు నాకున్నారు. అయినా వాళ్ళని అడవి లాంటి వూళ్ళో వదిలి వచ్చానే అన్న బాధ నాకూ ఉండిపోతుంది.

“కాబట్టి అత్తయ్యా! నాదొక్క కోరిక— లేదు ప్రార్థన. మీరు కూడా నాతోపాటు వచ్చేయండి. మీకు నా ప్రాణం ఉన్నంత వరకు ఏ లోపం రానీయను. మీకు మగదక్షత లేదు. నాకూ మీకన్న అయినవాళ్ళు లేరు. మనం అంతా వేరే వేరే ఉండి ఒకరి కోసరం ఒకరం దిగులు పడేకన్నా కలో గంజో కలిపి తింటూ ఒకే చూరుకింద ఉంటే మనశ్శాంతి ఉంటుంది. ఏమంటావత్తయ్యా ?” అని సుభద్రమ్మగారి వంక చూశాడు ఏమంటుందా అన్నట్లు. ఆవిడ కాసేపు ఏమీ మాట్లాడలేదు. చివరికి.

“నువన్న మాట బాగానే ఉంది నాయనా, ఆడది ఎప్పుడూ మగవాడినీడన సుఖంగా కాలం వెళ్ళబుచ్చవలసిందే! కాని ఉన్న వూరు, మనక్షేమాన్ని కోరే వాళ్ళ మధ్య నుంచి బయటికి పోవడం ఎలా ?”

“అక్కడే నువ్వు పొరబడ్డావత్తయ్యా— ఇక్కడి వాళ్ళు నువ్వనుకుంటున్నంత మంచివాళ్ళు కారు. అందులో కొందరు ‘మంచి’ అన్న మాటకే అర్హులు కారు. నేను వచ్చినప్పటి నుంచీ చూస్తున్నాను

49 వ పేజీ చూడండి




డాక్టరుగా ఎంతోమందికి టి. బి. నయం చేశాడు మూర్తి. మంచివాడని, కుర్రాడయినా హస్తవాసి మంచిదని అందరికి అతనంటే అదో విధమైన గౌరవం — అతనంటే మంచి వైద్యుడిగా నమ్మకం.............. ముభావమైన మనిషి. కోపం ఎరగని డాక్టరు. మరొకరి బాధను అర్థం చేసుకో డానికి ప్రయత్నం చేసే మనిషి — అయితే అతని పనేమిటో అతనేమిటో — అంతే. ' ఒక్క సంవత్సరంలో ఎంతమార్పు — చలాకీగా కబుర్లు చెబుతూ నవ్వుతూ, నవ్విస్తూ, కనిపించే మూర్తి ఇలా అయిపోయాడేమిటి ! ' అన్పిస్తుంది. అతనిని తెలిసిన వాళ్ళకి ....... అతనిలో ఈ మార్పుకు కారణం తెలిసిన వాళ్ళు అతని మీద సానుభూతి చూపించడం తప్ప మరేం చెయ్యగలరు ...........

" డాక్టరు మూర్తీ " ..... పిలిచారు డాక్టరు శేషగిరి. మూర్తి రావడంతోనే " చూడు మూర్తీ... ఈమెను నువ్వు కూడా పరీక్ష చేసి ఎక్సరే తియ్యి... " అతనితో అని ' మీరు ఆయనతో వెళ్ళండి ' అని ఆమెను — కూడా వచ్చిన ఆమె తండ్రినీ అతనితో పంపించాడు డాక్టరు శేషగిరి....

ఆమెను పరీక్ష చెయ్యడం ఇంచుమించు పూర్తయింది. మధ్య మధ్యలో అతని ప్రశ్నలు — ఆమె జవాబులూ —

ఎక్సరే తియ్యడానికి ముందర వివరాలు తీసుకుంటూ " మీ పేరు ?"

" శారద "

ఆ పేరు వినగానే మూర్తిలో ఏదో చలనం — ఏదో అనుమానం — అంతవరకూ ఆమె ముఖమైనా సరిగ్గా చూడని మూర్తి ఆమె వైపు చూశాడు. అవే కళ్ళు — అదే రూపం — ఎంత పోలిక ! — తన శారదే !! — అనుమానం లేదు — అతని కళ్ళల్లో అదో విధమైన ఆనందం — అంతలోనే వోబాధ — ఆ ఆనందం బాధా అతనిలోనే దాచుకున్నాడు మూర్తి.

* * *

" డాక్టర్ టి. బి. యేనా ! ?" బాధగా, అమాయకంగా ప్రశ్నించింది శారద.

మూర్తి తన నోటితో టి. బి. అని చెప్పలేక పోయాడు.

" టి. బి. అని ఎవరు చెప్పారు మీకు ! ?"

" లేకపోతే నన్ను ఈ శానిటోరియంలో ఎందుకు చేరుస్తారు. నిజం దాయవలసిన అవుసరం లేదు డాక్టర్. చెప్పండి."

" చిన్న అనుమానం — అంతకుమించి మరేం లేదు."

ఆమె మొహంలో మార్పు — ఆందోళన — మూర్తి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

* * *

ఆ రోజు రాత్రి అస్పత్రిలో పేషెంట్స్‌ను చూస్తున్నాడు.... ..... ..... ..... రాత్రి పదకొండు గంటలు దాటినా శారద స్పెషల్ రూమ్‌లో ఇంకా లైటు వెలుగుతూనే వుండడం మూర్తికి ఆశ్చర్యం కలిగించింది.

మెల్లిగా ఆమె గది వైపు వెళ్ళాడు. ఆమె మంచం మీద కూర్చుని ఏవో ఆలోచిస్తోంది — చేతిలో ఏవో రెండు కాగితాలు — ఆమె కళ్ళల్లో ఆరీ ఆరని కన్నీళ్ళు —

మూర్తిని చూడగానే కన్నీళ్ళు తుడిచేసుకుంది. ఆ విషయం డాక్టరుకు తెలియకూడదనే వుద్దేశ్యంతో.

" మీరింకా నిద్ర పోలేదా — టైమ్ ఎంతయ్యిందో తెలుసా ! ?"

మూర్తి ప్రశ్నకు శారద జవాబేం చెప్పలేదు.

రెండు క్షణాలు నిశ్శబ్దం.

" డాక్టర్ .................. "

"వూఁ"

" ఒక్కమాట అడుగుతాను నిజం చెప్పండి — నేనింకా ఎన్నిరోజులు బ్రతుకుతాను డాక్టర్ ? " సూటిగా అడిగింది శారద.

మూర్తి ఆమె దగ్గరనుంచి అటువంటి ప్రశ్న వస్తుందనివూహించలేక పోయాడు. — ఆమె మొహం వైపు తీక్షణంగా చూశాడు.

ఆమె ముఖంలో చెప్పలేని భయం — తను ఇంక బ్రతకదేమో అన్న అనుమానం....... ఆమెకు ఎక్కువ హాని చేస్తుందేమో అన్పించింది మూర్తికి. తన శారదే ఎదురుగా వున్నట్టనిపించింది. తన శారదే అలా అడిగి వుంటే తను సహించగలిగేవాడా .... సరిగ్గా అలాగే అన్పించింది ఆ క్షణంలో కూడా.

" చూడండి శారదా ...... టి. బి. ని జబ్బు కింద చూడవలసిన రోజులు ఎప్పుడో పోయాయి. — మామూలు జ్వరం కంటే సులభంగా నయమవుతోంది. — చదువుకున్నవారు ...... మీరే ఇలా అధైర్య పడితే ఎలాగ చెప్పండి ..... మా మాట నమ్మండి. మీకు వచ్చినది టి. బి. కాదని అబద్ధం చెప్పను. అయితే అది అతి ప్రారంభ దశలో వుంది. ముందు జాగ్రత్త కోసం ఇక్కడే జేర్పించమని మీ నాన్నగారికి సలహా ఇచ్చాం. అంతకు మించి మరేం లేదు......... మీకుఇప్పుడు కావలసినవది విశ్రాంతి — భయం అనవసరం ..........."

" మరో విషయం శారదా — మా మాటల మీద మీకే మాత్రం నమ్మకం వున్నా ఈ విషయము కేప్టెన్‌గారికి వ్రాయకండి. ఇది డాక్టరుగా ఇస్తున్న సలహా కాదు. స్నేహితుడిగా ఇస్తున్న సలహా. మీరే ఆలోచించండి — — ఎక్కడో దూర దేశంలో వున్న ఆయన పని వత్తిడి వల్లనో, సెలవు దొరకకో రాలేకపోతే ఆయన ఎంత బాధ పడతారు—

మరో విషయం. సరిగ్గా ఇవాల్టినుంచి రెండు

నెలల్లో మిమ్మల్ని ఆరోగ్యంతో ఆస్పత్రినుంచి డిస్చార్జి చేసే పూచీ నాది."

శారద అతని వైపు చూసింది. అతని మాటల్లోనూ, మొహంలోనూ, అతను చెబుతున్న ప్రతి మాటా నిజమే నన్నట్లు కన్పించింది శారదకు. మీదేం మాట్లాడ లేదు. చేతులో వున్న రెండు నీలిరంగు కాగితాలూ మరుక్షణంలో ముక్కముక్కలై పోయాయి.

"'థాంక్యూ —" అంటూ మూర్తి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

*  *  *

" అమ్మాయి విషయం అల్లుడికి వ్రాయ మంటారా ! ?"

ఆయన ప్రశ్నకు " వద్దండీ. ఇదేం అంత భయపడవలసిన విషయం కాని, ఆయన్ని కంగారు పెట్టవలసిన విషయం కాని కాదు, ఆమెతో కూడా అదే విషయం చెప్పాను. మీరూ మరోసారి చెప్పండి." డాక్టరు మూర్తి జవాబు.

డాక్టరు మూర్తి మాటల్లో పూర్తిగా గురి కుదిరింది శారదకు. అది మొదలు ఆమెలో చాలా మార్పు వచ్చింది. తనకేం జబ్బు లేనట్లుగానే వుండేది. డాక్టరు మూర్తికి ఆ విషయం చెప్పలేనంత సంతోషాన్నిచ్చింది. హాస్పిటల్‌లో కాలు పెట్టగానే శారద రూములోకి వెళ్ళకుండా మరో రూమ్‌కి వెళ్ళే వాడు కాదు. — ఆమెకు గుడ్‌నైట్ చెప్పందే ఇంటికి వెళ్ళేవాడు కాదు.

శారద తను టి. బి. పేషంటుని — తను వుంటూ న్నది శానిటోరియం అని మర్చిపోయేలా చేసేవాడు మూర్తి.

డాక్టరు శేషగిరి మూర్తితో వచ్చిన మార్పుకు ఎంతో ఆశ్చర్యపడ్డ మాట వాస్తవం. డాక్టరయి వుండి ఆప్తులు దూరమైతే మూర్తంత దిగులు పడిన వారిని మరెవ్వరినీ చూడలేదు ఆయన. శారద వైద్యం — మూర్తికి చాలా మేలు చేస్తోందేమో అన్పించింది ఆయనకి. సుమారు సంవత్సరం క్రితం మాయమయ్యిన మూర్తి మొహం మీది చిరునవ్వు, మళ్ళీ కన్పిస్తోంది.........

*  *  *

" ప్రియమైన అన్నయ్యకు,

నీ దగ్గరనుంచి పుత్తరం వచ్చి ఎన్నో రోజు లయ్యింది. మిలటరీలో జేరిన కొత్త రోజుల్లో వారానికో పుత్తరమైనా వ్రాసేవాడివి. దూరంగా హిమాలయాల్లో దేశ క్షేమం కోసం గస్తీ తిరిగే నీకు ఇప్పుడు ఆ తీరికా లేదేమో ! ? నెలకు ఓ పుత్తరం కూడా కరువై పోయింది. ఆపేక్షలూ, మమతలూ, అభిమానాలను పెంచుకోడం, — బహుశా మనలో వున్న బలహీనతేమో ! అనేవాడివి నువ్వు. — ఒకవేళ అవే లేకపోతే జీవితంలో ఆనందానికి తావులేదని అనుకుంటాను........

ఇలా సాగిపోతోంది శారద చదువుతూన్న ' అన్నయ్య ' కథ.

అప్పుడే అటు వచ్చిన మూర్తితో అంది. " డాక్టర్ — ఈ కథ చూశారా ! ?"

డాక్టరు మూర్తి ఆమె చదువుతూన్న కథ వైపు చూశాడు. ఆమె ప్రశ్నకు జవాబేం చెప్పలేదు.

" డాక్టర్ — ఈ కథ వ్రాసిన ఆయన ఎప్పుడు ఒక అన్నా, ఒక చెల్లెల్ని గురించే వ్రాస్తూ వుంటాడు బహుశా ఆయనకు అంత మంచి చెల్లెలు వుండేదేమోనని నాకూ అన్పిస్తూ వుంటుంది ఆ రచయిత అంత మంచి అన్నయ్య వుంటే బావుండునని ........"

*  *  *

' నాకూ ఈ రచయిత లాటి అన్నయ్య వుంటే ఎంత బావుండేదో ' అన్న శారద మాటలకు మూర్తి అనుకున్నాడు. 'నిజంగా ఆమెకు ఓ అన్నయ్య వుంటే ఆతను శారదకు టి. బి. వచ్చి నందుకు ఎంత బాధ పడేవాడో ఆమెకేం తెలుసు,

పది రోజులలో తనకే అంత దగ్గరగా వచ్చింది. అన్నయ్య అయివుంటే అతనితో మరెంత చనువుగా వుండేదో — ఏవో జ్ఞాపకాలు మూర్తికి.

*  *  *

రోజులు గడుస్తున్నాయి. శారదకు బాగా నయమయ్యింది. మరో వారం రోజుల్లో డిస్చార్జి చేస్తారనగా కేప్టెన్ కృష్ణ ఆ ్రారు వచ్చాడు. శారదకు టి. బి. వచ్చినట్లు తనకు వ్రాయకపోయి నందుకు బాధ పడినా ఆమెకు పూర్తిగా నయమయ్యిందని తెలిసి చాలా సంతోషించాడు. ఆ వారం రోజుల్లో డాక్టరు మూర్తికి అతనితో పరిచయం ఎక్కువే అయ్యింది.

ఆ రోజున శారదను డిస్చార్జి చేస్తారు. ప్రొద్దుటే కృష్ణ హాస్పటల్‌కు వచ్చాడు. శారదతో కలిసి డాక్టర్ మూర్తి రూమ్‌కి వెళ్ళారు. డాక్టరు మూర్తి ఆ సమయంలో అక్కడ కనిపించకపోవడం కొంచెం ఆశ్చర్యంగానే కన్పించింది శారదకు.

" సిస్టర్. డాక్టర్ రాలేదా ఇంకానూ."

" వచ్చారండీ — ఎక్కడికో వెళ్ళారు...... ఒకవేళ ఆయన రావడం ఆలశ్యమయితే ఈ విషయం మీతో చెప్పమన్నారు."

సిస్టర్ అన్నమాటలు శారదకు ఎంతో బాధ కలిగించాయి. అప్పుడిలా, చనువుగా మాట్లాడుతూ, తీరా తనకు పూర్తిగా నయమయ్యి తను వెళ్లిపోతున్న రోజున తన గదివైపైనా రాలేదు. . . 'అతను ఎందుకు రావాలి— అతను కేవలం ఒక డాక్టరు. డాక్టరుగా తన జబ్బు నయం చేశాడు— తరువాత అతనెవరో — తనెవరో, అన్పించింది. వెంటనే డాక్టర్ మూర్తి అటువంటి వాడు కాదు. అతను రాకపోవడానికి కారణం ఏదో ఉండి ఉంటుంది. . . . హృదయపూర్వకంగా డాక్టరుకి కృతజ్ఞతలు చెప్పకుండా ఆమెకు వెళ్ల బుద్ధి కాలేదు.

"డాక్టరు గారు వచ్చేదాకా' ఉందామండీ" అన్న శారద మాటలకు ఆమోద సూచకంగా అక్కడే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు కేప్టెన్ కృష్ణ. శారద మరో కుర్చీలో కూర్చుని డాక్టర్ మూర్తి బల్లమీద వస్తువులన్నీ చూస్తోంది. ఓ కాగితం మీద 'నా డైరీలో కొన్ని పేజీలు' 'రమేష్' అని వ్రాసి ఉంది. 'రమేష్'— అదే పేరు. తను చదివిన అన్నయ్య కథ జ్ఞాపకం వచ్చింది. శారదకు. 'రమేష్' పేరుతో కథలు వ్రాసేది డాక్టర్ మూర్తే నన్నమాట— ఏదో ఆశ్చర్యం. . . ఏదో ఆనందం.

మరేం ఆలోచించకుండా ఆ కాగితాలు తీసి చదవడం మొదలు పెట్టింది.— సగం సగం వ్రాసి ఉన్న కథ అది.— ఆ కథ పూర్తిగా ఏమిటో తెలియక పోయినా కొన్ని తారీఖులూ ఆ రోజుల్లో తన డైరీలో అంశాలు తీసి ఉన్నట్లు ఉంది.

జనవరి, 1 : కాలచక్రంలో మరో సంవత్సరం గడిచి పోయింది. కొత్త సంవత్సరాన్ని ఉత్సాహంతో ఆహ్వానిస్తున్నారు అందరూ. . . అంతే ఈ రోజు నాకు జీవితంలో ఎప్పటికీ ఆ ఆనందాన్ని ఇవ్వ లేదేమో! ?

సరిగ్గా ఒక్క సంవత్సరం నడచి పోయింది శారద పోయి.

ఇదే సంవత్సరాది రోజున అన్నయ్యా అంటూ నా చేతుల్లోనే కళ్ళు మూసింది శారద. . . పంతొమ్మిది సంవత్సరాలు 'అన్నయ్యా' అంటూ కూడా తిరిగిన శారదను ఒక్క సంవత్సరంలో మర్చిపోవడం అసంభవం.

ఆత్మీయతలూ, అభిమానాలు, ఆపేక్షలూ పెంచుకోవడం— అవి గాలివానకు చెట్లలా కూలి పోతుంటే— బాధ పడటం మానవుల్లో ఉన్న బలహీనతేమో ! ?—

ఫిబ్రవరి, 20 : శారద పుట్టిన రోజు ఈ రోజు బ్రతికి ఉంటే 20 సంవత్సరాలు. . . . శారదకు పుట్టిన రోజుకి టెలిగ్రాం ఇచ్చాను రెండు సంవత్సరాల క్రితం—అదే ఆమె ఆఖరిపుట్టినరోజు.

మార్చి, 15 : శారద కలలో కన్పించింది. ఏవో చెబుతోంది. విశ్వ విద్యాలయంలో తనకు నాలాటి అన్నయ్య ఉన్నందుకు ఆమె స్నేహితురాలకు అసూయటు.

ఏప్రిల్, 20 : ఈ రోజు శారద రూమ్‌కు 'రాధ' నన్ను చూడటానికి వచ్చింది. తన కెంతో ఆత్మీయురాలట.

*  *  *

అక్టోబరు, 13 : ఈ రోజు ఆస్పత్రికి ఎవరో ఒకమ్మాయి వచ్చింది. పేరు 'శారద'. పేరులోనే

హాతుని ఆ ప్తమిత్రుడ్నంటూ సాక్ష్యం ఇవ్వటానికి వచ్చిన వ్యక్తిని బోనులో ఎక్కించారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ క్రాస్ పరీక్ష కుపక్రమించాడు.

ప. ప్రా : ఏమయ్యా హాతుడు ఒంటరిగా ఉన్నప్పుడు తనలో తాను మాట్లాడు కునేవాడట నిజమేనా ?

సాక్షి : నాకు తెలీదండీ !

ప. ప్రా : మరి హాతుని ఆప్త మిత్రుడనని అబద్ధం చెప్పావేం ?

సాక్షి : (కోపంతో) నేను ఉన్నప్పుడు అతను ఒంటరిగా తనలో తాను ఎప్పుడూ మాట్లాడుకోలేదు.

మాధవ్ (తెనాలి)

కాదు— రూపం కూడా అదే రూపం. మొహంలో అమాయకత. గొంతులో ఆత్మీయత— శారదే. సరిగ్గా సుమారు రెండు సంవత్సరాల క్రితం పోయిన చెల్లెలే ఎదురుగా వచ్చి నిల్చున్నట్లయ్యింది. పాపం టి. బి. అయితే చాలా ప్రారంభ దశలోనే ఉంది. తప్పకుండా నయమవుతుంది.

అక్టోబరు, 20 : ఎంత చనువుగా మాట్లాడుతుంది శారద. ఎదురుగా నా చెల్లెలు 'శారదే' మాట్లాడుతున్నట్టు ఉంటుంది. 'అన్నయ్యా' అని ఆమె నన్ను పిలవక పోయినా 'ఓసేయ్ శారదా' అని పిలిచేస్తానేమో అనే అనుమానం—

డాక్టరుగా ఉన్న నాకు ఇటువంటి భావాలు రావడం చాలా మందికి ఆశ్చర్యంగా ఉండొచ్చు.— డాక్టరు మాత్రం మనిషికాడా. అతనికి మాత్రం అపేక్షలుండవా ! ?

నవంబరు, 3 : నేను వ్రాసిన 'అన్నయ్య' కథ అచ్చయ్యింది.

శారద పోయిన తరువాత నేను వ్రాసిన మొదటి కథ ఇదే.—

పేషెంటు శారద నేను ఆమె గదికి వెళ్లేటప్పటికి అదే కథ చదువుతోంది.

ఆ రచయిత అంటే ఆమెకు ఇష్టమట. అలాటి అన్నయ్య ఉంటే తను ఎంతో సంతోషించేదట— ఆమెతో ఆ రచయితను నేనే అని చెప్పుకుని 'నువ్వు సరిగా నా చెల్లెలాగానే ఉన్నావు' అని చెప్పేస్తే— ఏమో! ? ఏమవుతుందో.

డిశంబరు, 1 : శారదకు బాగా నయమయ్యింది. ఈ నెలాఖరులోగానే ఆమెకు డిస్చార్జ్ చెయ్యొచ్చు.

డిశంబరు, 10 : నాలో మార్పు కన్పిస్తోందట. నేను మునుపటి కంటే సంతోషంగానూ ఆరోగ్యంగానూ కనిపిస్తున్నానట. డాక్టర్ శేషగిరి సిస్టర్‌తో అంటున్నాడు— ఆయనకేం తెలుసు కారణం. పోయిన నా చెల్లెలు తిరిగి దొరికినంత ఆనందాన్నిచ్చింది పేషంట్‌గా వచ్చిన ఈ శారద. ఆమెకు జబ్బు నయం చెయ్యడంలో నాకేదో తృప్తి —ఆనందం!

డిశంబరు, 20 : శారదను మరో వారం పది రోజులలో ఇంటికి పంపించెయ్యొచ్చు.— ఆమెకు నా మీద ఎటువంటి భావాలున్నాయో తెలియదు కాని—ఈశారదకు,పోయిననాశారదకు ఎంతదగ్గర....

పేషెంట్‌గా వచ్చిన ఈ శారద నాతో అంత చనువుగా ఎందుకుండాలి... ఆమెతో మాట్లాడటం నాకెంతో సంతోషంగా ఉండేది. మరో వారం రోజుల్లో ఈమె వెళ్లిపోతుంది.

ఆమెతో చెబుదామనిపిస్తుంది.... 'నిన్ను చూసినప్పుడల్లా, నాకు నా చెల్లెలు శారదే ఎదురుగా ఉన్నట్లనిపించేది.— 'అని కాని ఎలా చెప్పడం— ఆమె ఫక్కున నవ్వుకుంటుందేమో నా వెనకాతల.

డిశంబరు, 23 : ఈ రోజు కెప్టెన్ కృష్ణ వచ్చారు..... శారద నా మాట విందన్నమాట. ఆయనకు తనకు టి. బి. వచ్చిన విషయం వ్రాయనే లేదు. తీరా ఆయన వచ్చిన సమయానికి ఆమెకు పూర్తిగా నయమయ్యింది— ఆయన చాలా మంచి వాడిలా ఉన్నాడు.

డిశంబరు, 27 : శారదను 31వ తేదీన ఇంటికి పంపించేస్తామని చెప్పారుట డాక్టర్ శేషగిరి.—




ఆమె వెళ్లిపోతూందంటే ఎందుకు నాకు ఈ బాధ—

డిశంబరు, 30: ఈరోజు కెప్టెన్‌కృష్ణతో అన్నాను.

“మీరూ, శారదా నేను జనవరి ఒకటో తారీఖున ఇచ్చే డిన్నరుకి రావాలని.— ఎందుకో ఈ శారదకు డిన్నర్ ఇద్దామనిపించింది. అందుకోసం డిన్నర్ ఎరేంజ్ చేద్దామనుకున్నాను. తీరా ఆయన 31వ తారీఖునే టిక్కెట్లు బుక్ చేసుకున్నారుట. 'సారీ' అనేశారు. జనవరి ఒకటో తారీఖున కనీసం ఈ సంవత్సరమ్మైనా మరోలా మొదలౌతుందనుకున్నాను. అయితే జనవరి ఒకటో తారీఖు ఎప్పటికీ ఇలాగే ఉండి పోతుందేమో— అయినా వాళ్లు నా కోసం ప్రయాణం ఎందుకు ఆపుకోవాలి ! ? నాకు ఈ శారద అంటే చెల్లెలు లాంటి అభిమానం ఏర్పడింది. ఆమెకు నా మీద అటువంటి అభిప్రాయం ఏర్పడాలని ఏముంది ? ! ఆమె దృష్టిలో డబ్బు తీసుకు జబ్బు నయం చేసే ఓ డాక్టరునే ఏమో ! ?—

ఏమయినా ఆమె వెళ్లి పోతుందంటే బాధగానే ఉంది. రేపు ఆమె వెళ్లిపోయే సమయానికి ఆమెకు కన్పించక పోవడం మంచిదేమో ? ?—

* * *

అసంపూర్తిగా ఆగిపోయిన ఆ కథ చదవడం పూర్తి చేసిన శారద కళ్లు చెమ్మగిల్లాయి. ఓ దీర్ఘమైన నిట్టూర్పు—

“డాక్టరు మూర్తిగారు మనిద్దర్నీ రేపు డిన్నర్‌కి రమ్మని పిలిచారా !” అడిగింది శారద.

“అవును. మన ప్రయాణం ఇవేళే కదా, అందువల్ల రాలేనని చెప్పాను— ఏం ! ?”

‘ఈ పేజీలు చదవండి మీకే తెలుస్తుంది.’ అంటూ ఆ కాగితాలు కృష్ణకు అందించింది శారద.

కృష్ణ ఆ పేజీలు తిరగెయ్యడం పూర్తి చేసి— ఏదో తప్పు చేసిన వాడిలా బాధ పడ్డాడు—

“ఈయన కూడా మన కోవకు చెందినవాడే నన్నమాట.— నీకు అన్నల్లేరు. అయినా లేని అన్నలకోసం కలల్లో కూడా కలవరిస్తూ ఉంటావు. మూర్తికి ఎంతో ప్రేమతో చూసుకున్న ఒక్క చెల్లెలూ దూర మయ్యింది.— ఇప్పు డర్థ మయ్యింది శారదా మూర్తి ఇంత వరకూ రాక పోవడానికి కారణం....అతని చిన్న కోరికనునేను వప్పుకోలేదు....

“కేవలం నీకు పూర్తిగా నయమయ్యిందనే సంతోషంతోనూ— మనతో ఉన్న పరిచయం వల్లా అతను డిన్నర్‌కి పిలిచాడనుకున్నాను కాని దాని వెనుక ఇంత కథ ఉందని తెలియదు శారదా నాకు— అతనికి నీ మీద అంత ఆపేక్ష, వాత్సల్యం ఉంటే — నిన్ను చూసి తన పోయిన చెల్లెలు తిరిగి దొరికినంత సంతోషిస్తూంటే ఆ ఆనందం అతనికి కాకుండా నేనెందుకు చెయ్యాలి.— లేని అన్నయ్యను వూహించుకొనే నీకు, నిన్ను చెల్లెలుగా వూహించుకునే ఓ అన్నయ్య దొరికాడు—

“మన ప్రయాణం వాయిదావేస్తున్నాను శారదా— నేను రిజర్వేషన్ కేన్సల్ చేస్తాను. మూర్తితో ఈ విషయం చెప్పు.”

కృష్ణ మాటలు వింటూ లోపలికి వచ్చిన మూర్తి మొహంలో అద్భుతమైన ఆనందం, కళ్లల్లో తృప్తి— రాలీ రాలని ఆనంద బాష్పాలు చూస్తూ నిల్చుండి పోయింది శారద— అతనిలో తన అన్నయ్యను చూసుకుంటూ. 

వనితాలోకం

# గోడలకి...

## 'విశాఖ'

ఆరోజున మావారు ఎలాగైనా వారి స్నేహితుని క్రొత్తయింటికి వెళ్ళి తీరాలని పట్టు బట్టితే బయలుదేరాను. అసలు ఆయన స్నేహితుని గృహప్రవేశానికి వెళ్ళడానికి కుదరక వెళ్ళలేదు. ఇప్పుడైనా వెళ్ళకపోతే బాగుండదని, ముందే చెప్పకుండానైనా ఫర్వాలేదని బయలు దేరాము. మేం వెళ్ళేసరికి బాగా చీకటి పడిపోయింది. అందమైన తోట, సుందర భవంతి, ముందర పోర్టికో వెనుక వసారా. దాన్నంటి వుంది పెద్ద అతిథుల గది. అక్కడ ఎవరో వున్నందువలన తలవంచుకుని నేను నేరుగా లోపలికి వెళ్ళిపోయాను. మావారి స్నేహితుని తల్లీ, భార్యా చాలా ఆప్యాయంగా పలకరించి చల్లటి పానీయం అదీ ఇచ్చి మర్యాద చేశారు. ఇల్లంతా చూడ్డానికి తీసుకు వెళ్ళారు. అత్యంత అధునాతన పద్ధతులలో కట్టబడి ఉంది. వంటయింట్లో సామగ్రిని చూసేసరికి వీళ్ళు స్విచ్చినొక్కితే పదార్థాలు నోట్లో పడతాయిలా వుందన్నట్లుంది. చాలా నచ్చింది. మొజాయికె ఫ్లోరింగు, కుకింగ్ రేంజి ప్రెషరు కుక్కరులు వగైరా వగైరా. బాత్ రూములో వాషింగు మెషిన్, ఆ బాత్ టబ్స్ అన్నీ చూసి దిగ్భ్రమ చెందాను. కానీ అంత డిస్టెంపర్ చేసిన గోడలు ప్రశాంతి నివ్వడానికి బదులు కళ్ళని చెదర గొట్టుతున్నాయి. దానికి కారణాలు అనేకం. అన్ని గదుల్లోనూ బాగా ముదర రంగుల్లో డిస్టెంపర్ చేశారు. గోడలకున్న మేకులు అనేకం. వాటికి వ్రేలాడుతున్న పటాలూ, విప్పేసిన షర్టులూ వగైరాలు చూస్తే చాలా చికా కనిపించింది.

అతిథులు వెళ్ళి పోయారని తెలియగానే వాళ్ళ అతిథుల ప్రత్యేక గది అయిన ఆ డ్రాయింగు రూములోకి తీసుకెళ్ళారు. అందులో ఆ కాశ్మీరు కార్పెట్లు సోఫాలూ అన్నీ బాగా వున్నాయి. తల యెత్తాను. అంతే. గోడకున్న సింగపూర్ గడియారం తాలూకు అందాన్నంతా దూరంగా తరిమేస్తూ వ్రేలాడుతున్నాయి ఛాయా చిత్రాలు. లెక్కపెడితే వందా ముప్ఫయి ఫోటోలు చిన్నసైజు వైతేనేం పెద్దవైతేనేం ఒక ఫ్రేములోనున్న నాలుగయిదు ఫోటోలు అయితేనేం వున్నాయి. ఇదేమి అతిశయోక్తి కాదు. నేను వాటికేసి తదేకంగా చూస్తున్నానని గ్రహించి ఆతని తల్లి ఇంక వివరించడం మొదలు పెట్టారు.

"ఇది మా పెద్దవాడు మూడోనెలప్పుడు తీసినది. అదిగో అది పుట్టు వెంట్రుకలు తీసెయ్యడానికి ముందర తీసినది. అది వాడి మూడో ఏట తీసినది......" అని ఏకరువు పెట్ట సాగారు. పరకాయించి చూస్తే ఆవిడ సంతానం అందరివీ మూడు నెలనుంచి పిల్లాజెల్లలతో సహా తీసుకున్న వాటి వరకూ అన్ని దశలలోనివి వున్నాయి. ఆతను నా వాలకాన్ని కనిపెట్టి "అమ్మా కొంచెం మంచినీళ్ళు తెమ్మని పనివాడితో చెప్పు" అని లోపలికి పంపి నాతో చెప్పారు.

"అసలు ఇవి కాకుండా మా మేడమీద స్పేరు గదిలో ఇంకా చాలా ఫోటోలున్నాయి. అద్దాలు అవీ విరిగాయన్న మిషతో నేను పెట్టనివ్వలేదు. మా అమ్మకీ మా ఆవిడకీ ఈ ఫోటోలు పిచ్చి ఎక్కువ." అన్నారు.

ఫోటోలు పిచ్చి వుంటే రకరకాల పోజులలో ఫోటోలు తీసుకుని ప్రత్యేకంగా ఫోటోల ఆల్బంలో పెట్టుకోవాలి. అంతేగాని ఇలా గోడలకి గోడే తెలియకుండా వ్రేలాడదీస్తారేంటి? ఒకటి రెండు ఒక గదిలో వుంటే బాగానే వుంటుంది. పాతకాలపు ఇళ్ళు పాతకాలపు పద్ధతులైతే పోనీ అనుకోవచ్చు. గోడలకి డిస్టెంపరు చేయించి అత్యాధునిక పద్ధతిలో ఇల్లు కట్టుకుని అదీ డ్రాయింగు హాలులో పెద్ద కర్ర బద్దీ నాలుగు ప్రక్కలా కొట్టించి దానికి ఫోటోలు వ్రేలాడదీసే వారిని ఏమనాలో తెలియడం లేదు.

గోడలకి కొందరిళ్ళలో ఈ ఫోటోలతోబాటు క్యాలండర్లు వ్రేలాడుతూ వుంటాయి. కొత్త సంవత్సరం వస్తూందనగానే ఈ క్యాలండర్ల వేటకి బయలు దేరుతారు కొందరు. అన్ని రకాలైన క్యాలండర్లూ సేకరించి వాటిని గోడలకలంకరించందే మనస్సు నిలువదు వీళ్ళకు. ప్రతి వాళ్ళనీ అడిగి ప్రాధేయపడుతారు. క్యాలండర్లు ఏ కొట్టు వాళ్ళు వేసే ఆనవాయితీవుందనగానే వాళ్ళ దగ్గరకి వెళ్ళి "ఏమోయ్! ఈ యేడాదేం క్యాలండర్లు వేయడం లేదా? వేస్తే ఇలా యియ్యి." అని అడిగి,



"ఔనండీ! అత్తగారూ! వారిక్కడే వున్నారు. వారు చెప్పమన్నదే నేను చెబుతున్నాను."

అనేక ఉపాయాలతో సేకరించుతారు. వాటిని ఇంట్లో గోడన్నదాన్ని కన్పడనీయకుండా తగిలిస్తారు.

ఇంకా కొందరిళ్ళలో తాళ్ళూ, విప్పేసిన షర్టులూ అవీ వ్రేలాడుతాయి. ఇలాగ గోడలకి మేకులు ఎక్కువగా దిగగొట్టినందు వలన ఇంటిగల వాళ్ళకి అప్రియులవడమే కాకుండా, గోడల అందాన్ని చెడగొట్టిన వారమవుతాము. అటుపైన ఇలాంటివి వ్రేలాడదీసినందువలన వాటి వెనుక మానవునికి శత్రువులైన మత్కుణాలు చేరే అవకాశం ఉంది. నల్లుల గూర్చి వ్రాయాల్సిందేముంది కనుక. ఇంక మున్పాలు కొట్టేటప్పుడు ఆ ఇళ్లాలు తిప్పలు దేముడికే ఎరుక. వాటి నన్నింటినీ భద్రంగా తీసిపెట్టి మళ్ళా మున్నం ఆరేక వాటిని యథాస్థానంలో వ్రేలాడదీయాలి.

అటుపైన దుమ్ము చేరకుండా వాటిని పదేపదే తుడుస్తుండాలి. అంతకంటె వాటిని తగిలించకుండా ఏ అల్బములోనో పెట్టుకుంటే తీరిపోతుందిగా, ఏదో ముక్తసరిగా ఒకటో రెండో ఫోటోలు, క్యాలెండర్లయితే పర్వాలేదు. కానీ ఇలాగ చాలా చాలా తగిలిస్తేనే ఇబ్బంది.

అసలు డ్రాయింగు రూములో వారివారి అభిరుచుల ననుసరించి కొన్ని ఫోటోలు, సుందర దృశ్యాలవే కానీండి, మనుష్యులవే కానీండి, మహాత్ములవే కానీండి, అదీ, అలంకరణార్థం ఏవైనా వస్తువులు ఉంటేనూ బాగుంటుంది. మరీ గది బోసిగా అన్పించకుండా పెట్టాలే గానీ అదో ప్రదర్శన శాలలాగా తయారు చేస్తే బాగుండదు. మిగతా గదులలో కూడా గోడలకి ప్రత్యేక శ్రద్ధ చూపిస్తూ ఆకర్షణీయంగా, అభిరుచి కలిగేలా అలంకరించాలి.

ఇంటిని చూసి ఇల్లాలిని చూడు అన్నారు. అందువలననే ఈ గోడలకి ప్రత్యేక శ్రద్ధ చూపాలి. గోడలపై సాధ్యమైనంత తక్కువ సామాన్లు తగిలించి, ఆ తగిలించిన వాటిని కూడా శుభ్రంగా తుడిచిపెట్టితే నేత్రానందంగానూ ఉంటుంది, మనుష్యులకి హాని కలిగించే కీటకాలూ ఆట్టే చేరవు. ★

## రొయ్యలతో రకరకాల వంటలు

**రొయ్యల కూర**: నలుబది తులముల రొయ్య పప్పును (పచ్చిది) కడిగి శుభ్రముచేసి కొద్దిగా పసుపు పొడితోను చాలినంత ఉప్పుతోను కలిపియుంచవలెను.

ఒక తులము అల్లమును, ఒక తులము వెల్లుల్లి, రేకలను, అరతులము జీలకర్రను, రెండు తులముల ధనియాలను, అరతులము కొబ్బరికోరును, ఒక తులమున్నర కొత్తిమేరను మెత్తగా ముద్దవలె నూరి యుంచవలెను.

వాటితోనే రెండు తులముల ఎండు మిరపకాయలను కూడా నూరి యుంచవలెను. తరువాత పది తులముల నూనెను ఒక పాత్రలో పోసి పొయ్యి మీద పెట్టి మరిగించ వలెను. అది మరిగిన తరువాత దానిలో ఆరు తులముల నీరుల్లిపాయముక్కలను, రెండున్నర తులముల పచ్చిమిరపకాయముక్కలను, అర తులము కరివేపాకునువేసి వాసనవచ్చువరకు వేపవలెను.

అవి వేగిన పిమ్మట వాటిలో రొయ్యల ముద్దను చేర్చి వేప వలెను. అవి అన్నియు వేగిన పిమ్మట దానిలో ఒక అర సోలెడు నీరు పోసి ఉడికించ వలెను. నీరు ఇగిరిన పిమ్మట దానిని క్రిందికి దింపి భుజించ వలెను. ఇది మిక్కిలి రుచిగా వుండును. కాని శ్లేష్మ శరీరులు దీనిని భుజించరాదు.

**రొయ్యల వేపు**: అర్ధశేరు మాంసపు కూరకి సిద్ధము చేసిన విధముగా మషాలా దినుసులను దీనికి కూడా సిద్ధము చేయవలెను.

తరువాత నలుబది తులముల రొయ్య పప్పును (పైనున్న డొలకలను పలుచగా వచ్చిన మాంసమును) ఒక పాత్రలో వేసి కొద్దిగా పసుపు గుండను, ముప్పావు తులము ఉప్పును వేసి బాగుగా కలుప వలెను. కొద్దిగా నూనెను దానిలో పోసి కలియబెట్టి పొయ్యిమీద పెట్టి ఉడికించవలెను.

కొంతసేపటికి దానిలోని నీరంతయును ఇగిరి పోవును. అప్పుడు దానిని క్రిందికి దింపవలెను. తరువాత ఒక కళాయిలో పదిహేను తులముల నూనెను పోసి మరిగించి దానిలో రొయ్యలను వేసి ఎర్రగా వేపవలెను. అవి వేగిన పిమ్మట సిద్ధముగా నుంచిన మషాలా ముద్దను, కారపు ముద్దను దానిలో వేసి, వాసన వచ్చు వరకు వేయించి క్రిందికి దింపుకొనవలెను.

ఇష్టమున్న యెడల వాటిని దింపుటకు ముందుగా కొద్దిగా చింతపండు గుజ్జును వాటిమీద చల్లి కలియబెట్టి రెండు నిమిషములు పొయ్యిమీద వుంచి క్రిందికి దింపి భుజించ వచ్చును.

ఈ రొయ్యలు మిక్కిలి బలము నిచ్చును.

**రొయ్యల కలుపు కూర**: కొబ్బరి బాగుగా తగ్గించి మషాలా దినుసులన్నియు పై విధముగానే నూరి యుంచవలెను. తాలింపు కూడా పై పద్ధతిలో వలెనే వేసి రొయ్యలలో కావలసిన నీరు పోసి అది ఉడుకుచున్నప్పుడు యిష్టమున్న కాయకూరల ముక్కలను దానిలో వేసి ఉడికించుకొన వలెను.

రొయ్యలలో బీరకాయను, అరటికాయను, చిక్కుడుకాయను, దోసకాయను, వంకాయను, పొట్లకాయనువేసి ఇగురుగాను, పులుసుగాను వండుదురు.

దోసకాయతో వాటిని చేర్చినప్పుడు పులుసు వేయుట మంచిది. కోడిగ్రుడ్లతో కలిపి రొయ్యలను వేపుకొని తినవచ్చును.

కాని కోడిగ్రుడ్లు రొయ్యలు పొట్లకాయతో కలుపగూడదు. మిగిలిన కాయకూరలతో కలుపవచ్చును.

పచ్చి సెనగ పప్పుతో కూడా రొయ్యలను కలిపి ఇగురు కూరగా చేసుకొన వచ్చును.

**రొయ్యల గారెలు** ఒలిచిన రొయ్యల పప్పు ఏనుబది తులములు కడిగి యుంచ వలెను. (ఈ వంటకు సముద్రపు రొయ్యల పప్పు మంచిది) తరువాత రెండు తులముల అల్లము, ఒక తులము జీలకర్ర, మూడు తులముల వెల్లుల్లిరేకలు రెండు తులముల నీరుల్లిపాయలు, ఆరు తులముల వేచిన సెనగపప్పు, ఎనిమిది తులముల పచ్చి మిరపకాయలను ఒక రోటిలో వేసి బహు మెత్తగా రుబ్బవలెను. పిమ్మట ఒలిచి యుంచిన రొయ్యల ముద్దను కూడా దానిలో వేసి తగినంత ఉప్పును, కొద్దిగా పసుపునుకలిపి మెత్తగా రుబ్బవలెను. తరువాత ఒక కళాయి పొయ్యి మీద పెట్టి ముప్పది తులముల నేతిని గాని, నూనెనుగాని, పోసి మరిగించి దానిలో పైన చెప్పిన రొయ్యపప్పు ముద్దను చిన్నచిన్న గారెలుగా వేసి వేయించి చట్రమునతో పైకి తీసి భుజించవలెను.

**రొయ్యల బోండా**: ఆరు కోడిగ్రుడ్లను కొట్టి ఆసొనను ఒక గాజు గిన్నెలో వేసి ఫుల్లతో నురుగు వచ్చువరకు గిలకొట్టి యుంచుకొన వలెను.

తరువాత పెద్ద రొయ్యలను ఒలిచిన పప్పులో పూర్వము చెప్పిన విధముగా మషాలా దినుసులను నూరి కలిపి ఒక పాత్రలో వేయవలెను.

దానిలో కొద్దిగా పసుపును, నూనెను వేసి పొయ్యిమీదపెట్టి ఉడికించు వలెను.

కొంత సేపటికి దానిలోని నీరు ఇగిరిపోయి రొయ్యలు గట్టి పడును. అప్పుడు వాటిని క్రిందికి దింపి చల్లార్చవలెను. తరువాత ఒక కళాయిలో ఇరువది తులముల నెయ్యినిగాని, నూనెనుగాని, పోసి మరిగించ వలెను. అప్పుడు రొయ్యలను సిద్ధముగా నుంచిన కోడిగ్రుడ్ల సొనలో ముంచి దానిని తోపుగా వాటికి పట్టించి మరుగుచున్న నూనెలో వేసి వేయించి పైకి తీసి భుజించ వలెను.

-లతా కృష్ణారావు. ★




‘మన అభివృద్ధిని దృష్టిలోపెట్టుకొని ఆలోచిస్తే ... దినదినాభివృద్ధి పొందుతున్న ఈ కాలపు ఫోటో క్యాలెండర్లు ఈ సంవత్సరముతో మూసేయక తప్పదు...’

బహుశా మీరు చెప్పలేరు...
కాని ఆమె అందములో
కొంచము లోపము వుంది!

కొంచము నిదానించి చూడండి
ఇప్పుడు ఆ లోపములు
కనిపించుట లేదు!

మీరు ఎల్లాగ చెప్పగలరు. ఈమె తన ముఖము మీది మచ్చలను, మొటిమలను లాక్టో-కేలమైనుతో మరుగు పరుచుకొంది. లాక్టో-కేలమైను ఒక అత్యుత్తమమైన 'పౌడర్ బేస్'. దీనిని ఉపయోగించుటవలన ముఖచర్మ మందలి దోషములు మరుగు పడును. మీ చర్మము మృదువుగాను మరియు కాంతివంతముగాను వుండును.

# లాక్టో-కేలమైను ముఖములోని మచ్చలను మొటిమలను కప్పిపుచ్చును!

లాక్టో-కేలమైనులో శీఘ్రముగా పనిచేసే ఉత్తమమైన కేలమైను వుంది. అది ముఖ చర్మమునకు చాలా లాభదాయకమైనది. దీనిని ఉపయోగించుటచే చర్మము మృదువుగాను మరియు కాంతివంతముగాను వుండును. దీనివలన మీ సౌందర్యమధిక మగును. లాక్టో-కేలమైను ముఖము మీది మచ్చలను, మొటిమలను కప్పి పుచ్చి వాటిని తొలగించుటకు సహాయపడును.

లాక్టో-కేలమైను ముఖము మీద మొటిమలు మరియు ఎండ తీవ్రత వలన కలిగిన మచ్చలను తొలగించి వేడిగాలినుండి చర్మమును రక్షించును. చంటి పిల్లల రేగిన చర్మమును కూడా మృదువుగా నుంచును.

సౌందర్యసాధకమైన లాక్టో-కేలమైను శ్రేణికి చెందిన లోషన్ క్రీమ్ మరియు టాల్కమ్ పౌడర్ కూడా దొరుకుచున్నవి.



లాక్టో-కేలమైను — మీ సౌందర్యసాధనము!

క్రూక్స్ ఇంటర్‌ఫ్రాన్ లిమిటెడ్, బొంబాయి 18.



# వృశ్చిక మాంత్రికుడు

*

ఆర్.వి.జి

పశుపతి బాబాయి మనోవ్యధకు గురైనాడు. అందుకు చిహ్నంగా ఆయన గడ్డం గీచుకోడం మానేశాడు. భోంచేస్తూనే తనకేమీ సహించడం లేదంటున్నాడు. ఒంటరిగా మంచం మీద కూర్చుని శూన్యంలోకి చూస్తూ కాలం గడుపుతున్నాడు. శూన్యంలోకి చూచేందుకు వీలుగా మంచాన్ని కిటికీకి ఎదురుగా వేసుకొని తలక్రింద రెండు దిండ్లు కూడా వుంచుకున్నాడు. ఆయన ఏదో అసహనంతో బాధ పడుతున్నట్లు నలుగురికీ తెలిపేటందుకెన్నో తంటాలు పడతున్నాడు. అయితే నేను మాత్రం " ఎందుకీ మనోవ్యధ బాబాయ్ " అని అడగలేదు. అలా అడిగి, ఆ తర్వాత బాబాయి వాక్ప్రవాహాన్ని అడ్డగించగల శక్తిగానీ, ఆయన హిరణ్యాక్షవరాలను తీర్చగల సామర్థ్యము గానీ నాకు లేవు.

అయితే బాబాయి వాలకం చూసి నిజంగా దిగులుపడ్డ తల్లి మాత్రం నాకు చెవిలోని జోరీగే అయింది. ఆమె అభీష్టం ప్రకారం బాబాయి ఏ కారణం చేత యింత దిగులు పడ్డాడో తెలుసుకో వలసిన బాధ్యత నాపై బడ్డది.

" బాబాయ్ — నీ కెందుకీ మనోవ్యధ ? తిన తిండి, కట గుడ్డా లేని వాడికిమల్లే ఇదేమిటి — గడ్డం పెంచావ్, దుస్తులు మార్చడం లేదు, మెతుకు నోట్లో బెట్టడం మానేశావ్ ? ( ఆయన ముద్దలే నోట్లో కుక్కుకుంటాడు ) — ఎందుకు నీకీ వ్యధ ? చెప్పు నీకథ — బాబాయ్ — చెప్పవూ" చిన్నపిల్లాడిని బుజ్జగిస్తూన్నట్టుగా అడిగాను నలభై ఏళ్ళ బాలాకుమారుడ్ని.

" నీతో చెప్పుకునేం లాభం ? నువ్వేం ఆర్చే వాడివా, తీర్చేవాడివా ? " నిష్ఠూరంగా మాసిన గడ్డాన్ని అరచేత్తో రాస్తూ అన్నాడు.

అంతటితో నా బాధ్యత తీరిన వాడినై వెళ్ళి పోతూ ఒకసారి వెనక్కి తిరిగి చూచాను. నేను అప్పుడే అలా వెడతానని బాబాయి వూహించ లేదు. ఇంకాస్సేపు నాచేత బ్రతిమాలించుకుని, అభయాలూ వాగ్దానాలూ, పుచ్చుకుని తన కోరిక వెలిపుచ్చాలని అనుకున్నాడేమో, నేను వెళ్ళడం దిగాలుగా చూస్తూ కూర్చున్నాడు.

ఆ తర్వాత బాబాయి జీవితంలో మరో మూడు రోజులు నిస్సారంగానే గడిచాయి. కాఫీ త్రాగుతున్న వాడు వున్నట్టుండి " నీతో అర్జంటుగా మాట్లాడాలి గదిలోకి రా " అన్నాడు. బామ్మ ముఖంలో మళ్ళీ తన కొడుకు మనుష్యుల్లో పడుతున్నంత ఆనందం వెల్లివిరిసి చాటంత ముఖం చేసుకుని " వెళ్ళా — వెళ్ళూ " అని తొందర చేసింది.

తీరా నేను వెళ్ళేసరికి ఆయన శూన్యంలోకి గాక గోడవైపు తిరిగి పడుకున్నాడు. పురిటికి పుట్టింటికి వెళ్ళిన భార్యను చూడాలని బాబాయికి బుద్ధి పుట్టడం గత రెండు మూడు దఫాల్లోనూ జరిగి అమ్మేమను కుంటుందో అని నాచేత అడిగించాడు. అలాంటిదేదో అనుకున్నాను.

" బాబాయ్ " అన్నాను. పలకలేదు. కదలలేదు. కాస్సేపు నిశ్శబ్దం రాజ్యం చేసింది.

" నే నెడుతున్నా " అన్నాను ఇక భరించలేక.

" ఒరేయ్. వుండరా. నీకూ నేనింత అలుసై పోయానట్రా ? " అన్నాడు. బావిలోంచి వచ్చినట్టుంది అతని స్వరం.

అయితే అర్థమైంది. ఎవరో బాబాయిని ఎగతాళి పట్టించి ఏడిపించారు. నేనెన్నోసార్లు చెప్పాను — యీ రోజుల్లో ఎవడి మానాన వాడు గప్ చుప్‌గా వుండి పోవడం కన్న సబబైన కార్యం ఏదీలేదు బాబాయ్ — అని. ఆయన వింటేనా ? వూళ్ళో నీటి పారుదల తగాదాల మొదలు ఆలూ మొగుడూ మధ్య తగూల వరకూ తీర్చేందుకీయనే తయారవుతాడు. ఆ తగాదాలన్నిటినీ ఆయనే పరిష్కారం చేసి ఆ మధ్య వ్యక్తిత్వంలో తాను అనుసరించిన న్యాయ సూత్రాలను నలుగురికీ చాటి తానో గొప్ప న్యాయ నిర్ణేతగానూ, అనుభవజ్ఞుడైన వ్యవహర్తగానూ పేరు గాంచాలని వుబలాటం. కాని ఇంతవరకూ ఆవూళ్ళో ఆయన సలహాను పాటించిన వ్యక్తి లేడు. పోగా, ఇరు పార్టీలనుండి మాట పడేది మాత్రం బాబాయే ! ఆ గ్రామానికి ఆయన ఏ మర్యాద రామన్నో, లేక ఏ సాలమన్ రాజో కావాలనుకుని ముప్పుతెచ్చు కుంటాడు.

అలాంటిదేదో జరిగి వుంటుందను కున్నాను.

" అయితే మళ్ళీ ఎవరి తగాదాల్లో తల దూర్చావ్ బాబాయ్ ?"

" తగాదా లేదూ గాడిద గుడ్డూ లేదు. నా జీవితమే నా పాలిట తగాదా ! యీ తగాదా తీర్చేందుకు ఆ సర్వేశ్వరుడ్ని మించిన న్యాయమూర్తి లేడు —."

సరళంగా మాట్లాడక డొంక తిరుగుడుగా కాస్త వేదాంత ధోరణిలో మాట్లాడటం ఆయన దృష్టిలో లౌక్యం — వివేకమూ ! " బాబాయ్. డొంక తిరుగుడుగా మాట్లాడక నువ్వు చెప్ప దలచుకున్నదేదో సూటిగా చెప్పు. నాకవతల పనుంది."

" ఒరేయ్. మనిషికి పేరు ప్రఖ్యాతులూ, కీర్తి — ప్రతిష్ఠలూ వచ్చి నలుగురి దృష్టిలో అతని విలువ, స్థాయి, గౌరవం పెరగాలంటే ఎలాగరా ? బాబ్బాబూ కొంచెం ఆ విషయాలేవో చెప్పి పుణ్యం కట్టుకోరా." అన్నాడు జాలిగా, దీనవదనంతో.

"పూర్వం శిబి చక్రవర్తి, కర్ణుడిలాగా దాన ధర్మాలు చెయ్యవచ్చు. కందుకూరి వీరేశలింగం పంతులు, రాజా రామ్‌మోహనరాయ్‌ల్లాగా సంఘ సేవ చెయ్యవచ్చు! గాంధిజీ, నెహ్రూల్లాగా దేశ సేవా చెయ్యవచ్చు ..... ఇంకా ఎన్నో వున్నాయి."

"దానధర్మాలు చేసేందుకు మనకు ఎవరైనా ఇస్తే పుచ్చుకో గలమే గాని ఒకరికి ఇవ్వగల శక్తి లేదుగదా! సంఘ సంస్కరణ, దేశసేవ ఇలాంటివి ఇప్పుడు ప్రారంభించి మనసేవ నలుగురిచేత గుర్తించ బడేప్పటికి ఈ జీవితమే పరి సమాప్తి మవుతుంది గదా! ఇంకేమైనా తేలిక మార్గాలూ, సులభోపాయాలూ వుంటే చెప్పరా అబ్బాయ్."

బాబాయికి పట్టుకున్న పిచ్చి నా కర్థమైంది. ఇప్పుడాయనో సరికొత్త అవతారం దాల్చేందుకు సిద్ధమవుతున్నాడు.

"తేలిక మార్గాలంతగా లేవు. రాజకీయుల్లో ప్రవేశించడం మేలు."

"రాజకీయాలన్నావూ — అవి నాలో ఎప్పుడూ ఒక భాగమే! గత రెండు ఎన్నికల్లోనూ నేను ప్రచారం చేసిన వ్యక్తులు ధరావత్తు కోల్పోయారు. వారు మూలబడ్డారు. మనకు ప్రోత్సాహం లేదు. గ్రామ రాజకీయాల్లోకి పిల్లకారు వచ్చి చేరుకుంది. కనీసం పంచాయతీ బోర్డులో మెంబరునన్నా అయ్యే అవ కాశం నాక్కనిపించడం లేదు రా బాబూ — కని పించడం లేదు." మనసులో గూడుకట్టుకున్న ఆవేదన అంతా వెలుపలికి కక్కేస్తున్నట్టుగా అన్నాడు.

"సరే బాబాయ్ — నేను బాగా ఆలోచించి నీకు సులభ మార్గాన పేరొచ్చే వుపాయం చెబుతాను. నువ్వు నిశ్చింతగా వుండు. ముందు మంచం వదిలి శుభ్రంగా తయారుగా" అని బయటి కొచ్చాను. బాబాయి ముఖమండలాన వెయ్యిదీపాలు వెలిగాయి. సంతస వదనంతో నన్ను సాగనంపేందుకు వెంట వచ్చిన బాబాయిని చూచి వాళ్ళ తల్లి నా ప్రభావానికి మెచ్చుకుంది కాబోలు "ఒరేయ్ — వేణూ! నీ కిష్టమైన చిత్రాన్నం వండుతాను నాయనా — ఈ పూట ఇక్కడికే రా భోంచేద్దువు గాని" అన్నది.

"బామ్మా! ఇలా చీటికీ మాటికి లంచం ఆశ పెట్టడం ఆరోగ్యకరమైన లక్షణం గాదు. ప్రభుత్వానికి తెలిస్తే శిక్ష తప్పదు." అంటూ గడప దాటాను. "నా విషయం మరచిపోకురోయ్" అని బాబాయి వెనకనుంచి కేకేశాడు.

బాబాయికి మాటిచ్చానే కాని నేను మాత్రం ఏం చెయ్యను? ఏమని చెప్పను? ఆయనకి ఆసక్తి కలిగించని విషయం ఈ ప్రపంచంలో లేదు. కోర్టు వ్యవహారాలూ, భారీ ఎత్తున వ్యాపారాలూ సాగించి వాటిల్లో తన అదృష్టాన్ని పరీక్షించుకుని వదిలేశాడు. ఆయన పేరూ, పైకమూ పుష్కలంగా లభ్యమయ్యేందుకు ఏమార్గమైనా అనుసరిస్తాడు. అయితే దేన్లోనూ ఓర్పుతో వ్యవహరించడు. కోర్టు వ్యవహారాలు ఒక్కమాసంలోగా తన కనుకూలంగా పరిష్కారమై మంచి ఆస్తిని తన వశం చేసుకోవాలనుకుంటాడు. ప్రారంభించిన వ్యాపారంలో అధికారులు, అనధికారులూ తనకు ప్రసన్నులై ఒక నెలరోజుల వ్యవధిలోనే పెద్ద కోటీశ్వరుడై పోవాలనుకుంటాడు. అలా జరగనినాడు వ్యథా, దిగులూనూ! సులభ మార్గాన లక్షలార్జించేందుకు అనువైన లాటరీల్లో ఆయన తగలేసిన, పోస్తున్న డబ్బుతో ఇద్దరు కుమార్తెలనూ వైభవంతో మరో ఇంటి కోడళ్ళుగా చేసి వుండేవాడు. కాని, ఆ మార్గంలో ఆయనకు పోవడమే గాని వచ్చింది ఇదిగో అని కనీసం ఒక్క నయా పైసా అయినా చూపలేదు.

"ఇదంతా పిచ్చి పశుపతి! కష్టపడి సంపాదించాలిగానీ, అడ్డుదారిన స్వర్గం చేరిన వాళ్ళను ఎవరి నైనా ఎరుగుదువా?" అని ఎవరైనా అంటే ఎప్పుడు ఏఏ లాటరీల్లో రైల్వే పోర్టరు గంగూలీకి, బస్సు క్లీనరు సులేమాన్‌కూ, దోసలమ్మే తాయారమ్మక్కా, బడిపంతులు లక్ష్మీపతికీ లక్షలొచ్చి పడ్డదీ వివరిస్తాడు.

రాజకీయాలు తన అభిమాన విషయమనీ, ఎన్నికల్లో తాను ఎలాంటి వ్యూహాలు పన్ని, ప్రత్యర్థుల గుండెల్లో బాకు పట్టుకుని ఎలా కూర్చున్నదీ వివరించి — అదృష్టం లేదు కాబట్టే ఆ అభ్యర్థులు ధరావత్తుకు కూడా నోచుకో లేదని చప్పరించేస్తాడు.

"ఈనాటి గొప్పవాళ్ళు పూర్వాశ్రమంలో మామూలు వ్యక్తులే! అయితే గాంధిజీ సత్యాగ్రహ సమరం నాటికి వాళ్ళంతా రాజకీయాల్లో దూకేందుకు వారి తలిదండ్రులు అలాంటి వాతావరణాన్ని కల్పించారు. అందువల్ల ఈనాడు వాళ్ళంతా పెద్దవాళ్ళైనారు. పేరు, కీర్తి, గౌరవం దక్కించుకున్నారు. నేనూ గాంధిజీ పిలుపు నందుకుని వెళ్ళాలని వుబలాటపడి రైలుచార్జీకి డబ్బడిగితే మానాన్న చావబాది, చితకతన్ని, కాళ్ళూ చేతులూ కట్టి గదిలో పడేశాడు. లేకుంటే ఈ పరికి ఏ మంత్రినో అయుండేవాడ్ని." ఇలా రోజూ చెప్పిందే చెప్పి పదిమంది ఎదుటా వాపోయి వూరి వాళ్ళకు మంచి కాలక్షేపం కల్పిస్తుండేవాడు బాబాయి.

ఇప్పుడు అలాంటి బాబాయిని ఇరవైనాలుగ్గంటల్లో గొప్పవాడ్ని చేసి, అతడి విలువనూ, స్థాయినీ పెంచేయడం ఎలా సాధ్యమో నా కర్థంగాలేదు.

* * *

దర్భపుల్లలు అమ్మవద్ద ఇచ్చిన పురోహితుడు మర్నాటి సూర్యగ్రహణ విశేషాలు వుటంకిస్తుంటే నాకో విషయం జ్ఞాపకం వచ్చింది.

పాము కాటుకు వైద్యవిద్యలో మహో మహో డిగ్రీలు పొందిన డాక్టర్లకంటే పాముల నరసయ్య ఎన్నోమైళ్ళ దూరంనుంచి టెలిఫోనులోనే నయం చేయడం, మందు మాకులకంటే మిన్నగా ఒక చిన్న మంత్రంతో తేలుకుట్టిన బాధ మాయమవడం, అనేక నొప్పులు, బాలగ్రహదోషాల్లాంటివి మంత్రాలకు లొంబడటం అందరికీ తెలిసిన విషయాలే!

అయితే ఈ మంత్రోపదేశం, సిద్ధిపొందిన గురువు సముద్రతీరాన, గ్రహణ సమయాన చేయాలి. మరి బాబాయి గూడా ఇలాంటి మంత్రగాడైతే పేరు ప్రఖ్యాతులు రావడానికి సందేహం లేదు. పైగా ఇది తేలిక, చవుక గూడాను! వెంటనే మూడు మైళ్ళదూరాన ఆశ్రమంలో వున్న స్వాముల వారిని కలుసుకున్నాను. పాము కాటుకు మంత్రం మా బాబాయికి వుపదేశించమని ప్రాధేయపడ్డాను. వారు అంగీకరించడం బాబాయి అదృష్టమే మరి!

కాని బాబాయిని సముద్రానికి ప్రయాణం చేయడం మాత్రం సులభమైన పనిగా కనిపించలేదు. నాకు చలి బాబోయ్ అన్నాడు. నల్లగా భయంకరంగా మోతబెట్టే సముద్రాన్ని అసలు చూడలే నన్నాడు. "అలలు లాక్కుపోతాయి. మొసళ్ళు మింగేస్తాయి. నేను రాను. రానే రాను" అని మొరాయించాడు.

ఎలాగో బాబాయిని బ్రతిమాలి, భంగపడి, చిన్ని పాపకు చందమామను చూపిస్తూ వేలిబువ్వ పెట్టినట్టు, గౌరవం, కీర్తి, ప్రతిష్ఠ అన్నీ కలిసి కను చూపు దూరంలోనే వున్నాయని ఆశపెట్టి ఒప్పించాను. మాకో బండినీ, స్వాముల వారికి ప్రత్యేకంగా మరో బండినీ ఏర్పాటు చేశాను. బాబాయి చేతులు మునగా షర్టు వేసుకుని, దానిపైన వున్ని స్వెట్టరు తొడుక్కుని, తలకో మఫ్లరు చుట్టి, అప్పుడే హాస్పటల్‌లో డిస్చార్జి అయిన రోగిలాగా కనిపిస్తూంటే వాళ్ళ తల్లేమో కనుకొలకుల్లో నీరు నిండగా, కొడుకు యుద్ధానికే వెడుతున్నట్టుగా, ఇక తిరిగేరానట్టుగా వీడ్కోలిచ్చింది.

గేటు వరకూ నడిచి వచ్చిన బాబాయి, మరోక్క



అడుగు వేస్తే అందిగిందుకునే బాబాయి, అటాయిన వెనక్కి తిరిగి 'అమ్మా' అంటూ పరుగెత్తాడు.

"అమ్మా. లక్ష్మీ, పిల్లలూ జాగ్రత్తమ్మా. ఆ గురవయ్య ఇవ్వాల్సిన ధాన్యం మరచిపోకు. బాబును డాక్టరీ చదివించమని లక్ష్మితో చెప్పు. బుల్లెమ్మాయికీ, చిట్టి తల్లికీ మంచి సంబంధాలు తగాడు" అన్నాడు.

"అలాగే నాయనా. నువ్వు క్షేమంగా వెళ్ళిరా. సముద్రం చాలా లోతు. జాగ్రత్తగా చూచిదిగు. ఒరేయ్ వేణూ, అబ్బాయి జాగ్రత్త." ముసలామె కన్నీళ్ళు తుడుచుకుంటూ పైకి పొంగి వచ్చే దుఃఖాన్ని పెదలతో నొక్కివేసుకుంటూ అంది.

ఈ సన్నివేశాన్ని చూస్తుంటే నాకు చిరాకెత్తుకొస్తుంది. బలవంతాన పెళ్ళాన్ని లొక్కుపోతూన్న దుర్మార్గుడైన భర్తను చూస్తున్నట్టు, నన్ను మింగేసేట్టు చూస్తుంది బామ్మనాకేసి.

"నీ మానాన నువ్వుండిపో బాబాయ్. నువ్వు



వట్టి పిరికివాడివి. నిజు కీర్తి, పేరూ ఏమి కాదు—ఫో" అందామనిపించింది. కాని ఇంత దేసం తర్వాత ఇలా దాటేస్తే బాబాయి ఆత్మహత్య ప్రయత్నాలు బాహాటంగానే చేయగలడు.

రథం కదిలింది.

ప్రయాణం చేసినంతసేపూ బాబాయి బండి వాడ్ని నానా మాటలూ అన్నాడు. గతుకుల్లో పడ్డప్పుడు నడుములు విరిగాయనీ, గూళ్ళు తోలగాయనీ, మాడు బ్రద్దలైందనీ గోలెట్టాడు. "ఇది బండికాదు. నన్ను స్మశానానికి తీసికెళ్తూన్న పాడె" అన్నాడు.

"బాబాయ్— మరీ సౌఖ్యంగా ప్రయాణం చేసేందుకు ఇది ఎడ్లబండి కాని ఎంబాసిడర్ కారు గాదు. ఇంకా గోలెట్టావంటే ఎద్దులు బెదిరి అడుగు ముందుకు వెయ్యవు. అంతేకాదు. బండివాడు కోపగించి తిరుగు ప్రయాణంలో మనల్ని వదలి మరో బాడుగకుదుర్చుకోవచ్చు" అన్నాను రహస్యంగా.

# వృశ్చిక మాంత్రికుడు

దాంతో బాబాయి తిక్క కుదిరింది. ఎంతటి కుదుపునైనా తమాయించుకుని బాధను, కోపాన్ని మాటల్లోకి తర్జుమా చెయ్యకుండా కళ్ళతో నన్ను మ్రింగడం మొదలెట్టాడు.

సముద్ర ఘోష స్పష్టంగా వినిపిస్తూంది. ఎంతో మంది జనం మా బండి కటూ ఇటూ కాలినడకనే వెడుతున్నారు. ఇంకా అరమైలు దూరం ఉందనగానే బాబాయిలో భయం, అందోళన మరీ ఎక్కువయ్యాయి. సముద్రం మోత ఆయనకు రణరంగంలోనికి ఫిరంగుల తలఘున్నల మోతగానూ, అప్పటికే అక్కడ చేరిన ప్రజల కేకలూ, కేరింతలూ ఆయనకు తన్ను మూకల వికటాట్టహాసాలుగానూ వినిపించ సాగాయి.

సముద్రుడు గంభీరంగా నీలిమ వర్ణంతో, ఉవ్వెత్తున కెరటాలు లేచి పడుతూండగా విశ్వవ్యాప్తంగా కనుపిస్తున్నాడు. సూర్య గ్రహణ పర్వసమయాన తమతమ పాపాలను సముద్ర గర్భంలో ప్రక్షాళితం చేసుకుందుకు విచ్చేసిన వేలాది ప్రజలతో తీరం నిండి పోయింది.

ఇసుకలో నడిపించి బాబాయిని ఒడ్డుకు పోయాను. అప్పటికే స్వాములవారు స్నానం చేసి జపం చేసుకుంటున్నారు. బాబాయి శరీరానికున్న కవచం వగైరా తొడుగులను తీయమన్నాను.

ససేమిరా వీల్లేదన్నాడు. "నన్ను దీంట్లో ముంచి, నాకు న్యుమోనియా జ్వరం తెప్పించి, నా లక్ష్మికి వైధవ్యాన్ని తెప్పించేందుకే నువ్వీ పన్నాగం పన్నావు." అన్నాడు.

"బాబాయ్— మరో పది నిమిషాల్లో నీకు మంత్రోపదేశం జరుగుతుంది. ఆ తర్వాత సర్ప వృశ్చికాది జంతువుల విషంతో బాధపడే వారిని నీ వోటివాక్కుతో, నీ కంటి చూపుతో బాధా రహితులను చేసి పంపుతూంటే వారు అనుభవించే ఆనందం నిన్ను ముగ్ధుణ్ణి చేస్తుంది. వారి ఆశీస్సులు నీకు లభ్య మవుతాయి. అంతకంటె మించిన మానవసేవ మరిలేదు. మృత్యు ముఖం నుంచి రక్షింప బడ్డ మానవుడు నీకు తెలిపే కృతజ్ఞత కంటే పదవులూ, బిరుదులూ ఎక్కువ కాదు. చూడు వృద్ధులూ—స్త్రీలూ ఎలా స్నానాలు చేస్తున్నారో ? వారందరి ప్రాణాల మీద తీపి లేకనే అలా సముద్రంలోకి దిగుతున్నారంటావా? ధైర్యం చెయ్యి— వచ్చి స్నానం చెయ్యి ! మంత్రోపదేశం చేసుకుని మానవసేవ చెయ్యి. అదే మానవ సేవ ! అలాంటి సేవ చేసి నీవు అజరామరమైన కీర్తివంతుడివి కావాలంటే నువ్వీ త్యాగం చేయాలి బాబాయ్— తప్పదు."

కౌరవ సేనా వాహినిని గాంచి, బెదరి, తన్నవుకు వెన్ను చూపి కదనరంగం నుంచి పరుగు తీసిన తీసిన ఉత్తర కుమారుడికి అర్జునుడు ధైర్యం చెప్పి యుద్ధోన్ముఖుణ్ణి చేసినంత పనయింది నాకు బాబాయిని స్నానోన్ముఖుణ్ణి చేసేటప్పటికి !

సముద్ర స్నానం కాస్త మెలకువతో, కెరటాలతో ఆడుకుంటూ చేస్తే ఎంతో హాయిగా ఉంటుంది. కెరటం రాగానే బాబాయి దానితోపాటు ఎగరనూలేడు. పోనీ తలను క్రిందికి దించడమూ చేతగాడు. అలాంటప్పుడు అలలోగూడా విసరివేయబడి మళ్ళీ తన క్రింద నున్న ఇసుకతో సహా అలలోపలికి వెళ్ళేప్పుడు బాబాయి చేసే హంగామా, అల్లరీ, తిట్లూ నలుగుర్నీ ఆకర్షించేట్టు చేశాయి. రెండు మూడు నిమిషాల్లో బాబాయి స్నానం అయిందనిపించుకున్నాడు.

బాబాయి పొడి గుడ్డలు కట్టుకుంటా నని మారాంచేశాడు. కాని స్వాములవారు అంగీకరించలేదు. మంత్రోపదేశం జరిగేప్పుడు తడి, మడి అవసరం అన్నాడు. సముద్రానికి అభిముఖంగా కూర్చున్నాడు బాబాయి గడగడ వణకుతూ.

"నాయనా, సర్పమంత్రమా — వృశ్చిక మంత్రమా—ఏది కావాలి ? పాము మంత్రానికి కొన్ని నియమాలు పాటించాలి. భోజనం చేసే సమయంలో 'పాము' అన్న శబ్దం వినరాదు. ఒకవేళ విన్నావో, అంతటితో భోజనం వదలి లేవాల్సిందే ! కొన్ని కాయగూరలు గూడ నిషిద్ధములే! మంచానికి అడ్డంగా పడుకోరాదు. మైలపడ్డ వారిని స్పృశించరాదు. ఎట్టి సమయంలోనూ సర్పానికి హాని కలిగించరాదు. ఈ నియమాలు పాటించకున్న ఈ శ్రమంతా వృధా ! కాని తేలు మంత్రానికి నియమాలేవీ లేవు." అన్నాడు స్వాముల వారు.

"అయితే ఆ తేలు మంత్రమే ఉపదేశించండి స్వామీ" వెంటనే అందుకున్నాడు బాబాయి.

నిజమే. బాబాయి భోజన ప్రియుడు. ఈ విషయాన్ని కనిపెట్టి ఏ కొంటెకాయైనా ఆయన్ని తిండి తిననీయకుండా ఏడ్పించవచ్చు ! ముఖ్యంగా సర్పానికి హానికలిగించకుండా ఉండడం దుర్లభం. స్వయంగా పామును కొట్టి చంపగల ధైర్యం బాబాయికి లేదు. కాని ఎవరితోనైనా చెప్పి చంపించవచ్చు. అప్పుడు నియమోల్లంఘన జరుగుతుంది. అందుకనే బాబాయి తేలు మంత్రం కోరుకున్నాడు. అయినా పరవాలేదు. వేసవి కాలంలో చేతినిండా పని ! అసలు ఆ వూళ్ళో అను

దినమూ కప్పుల్లోంచి తేళ్ళు అనేకం రాలుతుంటాయి. వాటిలో కొన్ని అయినా మనుష్యులను కుట్టకుండా పోవు. వాళ్ళ బాబాయి పాలపడకుండానూ పోరు !

మంత్రోపదేశం జరగ బోతోంది. స్వాముల వారు నన్ను దూరంగా వెళ్ళమన్నారు. బాబాయి నమస్కారం చేశాడు. ముక్కు పట్టుకున్నాడు. ఏవో సైగల్లాంటివి అనేకం చేశాడు. స్వాముల వారు చెవిలో ఏదో చెప్పి బాబాయి చేత పలికించాడు. పదేపదే ఆ మాటలు స్వాములవారు చెప్పగా బాబాయి పలుకుతున్నాడు. కదలని బస్సును నెట్టిన ప్రయాణీకులు బస్సు స్టార్టవంగానే మళ్ళీ ఆగుతుందేమోనన్న అనుమానంతో వెనక కాసేపు నిలిచి నట్టుగా ఆగాడు స్వాములవారు. కాని బాబాయికి నాలుక కాస్త మందం. సంస్కృత పదాలు ఆయన ఉచ్చరించేందుకు కాస్త పరిశ్రమ అవసరం. అందులోనూ తడి బట్టలలో, చలితో గడగడ వణకుతూ మాటలు సరిగా రావడంలేదు గాబోలు స్వాములవారు మధ్యమధ్యలో సాయం చేస్తూ పలికిస్తున్నాడు. ఆ విధంగా నూట ఎనిమిదిసార్లు జపించిన మీదట ఇక అయిపోయిందని లేవ బోయాడు బాబాయి. కాని స్వాములవారు లేవ నివ్వలేదు. గ్రహణ కాలం పూర్తయేవరకూ అలా జపిస్తూ కూర్చోమన్నాడు.

“రోజూ శక్త్యానుసారం ఈ విధంగా జపించు. ఏ వేళనైనా ప్రజలకు సేవచెయ్యి నాయనా. సర్వే జనాస్సుఖినోభవంతు” అన్నాడు స్వాముల వారు.

పట్టరాని ఆగ్రహంతో బాబాయి స్వాముల వారి నేమీ అనలేక అల్లంత దూరాన కూర్చున్న నాకేసి ఉరిమి చూచాడు.

ఇక గత్యంతరం లేక మరో రెండు గంటలకాలం అలా ఇసుకలో కూర్చుని జపంచేశాడు. లేచేప్పుడు స్వాములవారు మంత్రం వెయ్యవలసిన విధానం, వచ్చిన వాళ్ళను నడిపించడం, చేతులు కాళ్ళు విదిలించడం మొదలైన తతంగమంతా బోధించి దీవించాడు. బాబాయి కడపట స్వాములవారికి సాష్టాంగ పడ్డాడు.

సాయంకాలానికి చచ్చీ చెడి ఇంటికి చేరుకునే ప్పటికి బాబాయి రైళ్ళు లేని కాలంలో కాశీ యాత్ర చేసి తిరిగొచ్చిన వాడిలా అయిపోయాడు. బండి ఆగిన చప్పుడు విని వీధి వాకిట్లోనే మమ్మల్ని నిలవేసి పళ్ళెంలో ఎర్రనీళ్ళు తెచ్చి దిష్టి తీసింది బామ్మ. ఆ తర్వాత బాబాయి అమ్మను కుశల ప్రశ్నలు వేసాడు. ఆమె ఆరోగ్యం ఎలా ఉందో కనుక్కున్నాడు. మామగారినుంచి ఉత్తరం వచ్చిందా అని అడిగాడు. గురవయ్య ధాన్యం విషయం ఏమన్నాడో తెలుసుకున్నాడు. ఎంతో కాలం నిద్ర పోయిన రిప్‌వాన్ వింకిల్ గూడా నిద్రలేవగానే అలా ప్రవర్తించి ఉండడేమో !

నాకూ వళ్ళంతా నొప్పులుగా ఉంది. మనసుకు ఇప్పుడు కాస్త విశ్రాంతి దొరికింది. బాబాయికి తేలిగ్గా, ఖర్చులేకుండా పేరు రావడానికి ఒక మనిషి ఎంతైతే చేయగలడో అంతా నా లోపం లేకుండా చేశాను. ఇక మిగిలింది బాబాయి కృషి మాత్రమే! భోంచేసి పడుకోగానే హాయిగా నిద్ర వచ్చేసింది.

బాబాయికి కొంచెమైనా వెసులుబాటు **లేకుండా ఉంది. ఇంటి ముందు వో ఎనామిల్ బోర్డు “డి. పశుపతి— వృశ్చిక మాంత్రికుడు” అని ఉంది. హాల్లో టెలిఫోను, ప్రక్కన పెద్ద సోఫా,** సోఫాలో బాబాయి. మెలిత్రిప్పిన మీసాలు. నుదుట కుంకుమ బొట్టు. వరండాలో క్యూలో జనం ‘అబ్బా, అమ్మా’ అని మూలుగుతున్నారు. భుజం మీది తువ్వాలు కొసను మెలిపెవేస్తూ, వచ్చిన వాళ్ళను ముందుకీ వెనక్కీ నడిపిస్తూ, ‘ఫో’ అని బెదిరిస్తూ, కాళ్ళు చేతులూ విదిలింపిస్తూ పంపేస్తున్నాడు.

తపాలా బంట్రోతు తెచ్చిన కవరును చింపి చూచాడు. ఢిల్లీలో జరగబోయే అఖిల భారత వృశ్చిక మాంత్రికుల మహాసభకు తనని అధ్యక్షత వహించమని కోరుతూ ఆహ్వానం. బాబాయి విలువ పెరిగి పోయింది. కీర్తి వచ్చింది. అనేక సంఘాలు ఆయన్ని సన్మానించాయి. ఆయన చేస్తూన్న నిస్వార్థ సేవను గురించి పత్రికలు పొగిడాయి. విదేశీయులు ఆయన మంత్ర ప్రభావాన్ని గుర్తించి వారివారి దేశాలకు ఆహ్వానించారు.

ఉన్నట్టుండి, ఇంటికప్పు ఎగిరి పోయేట్టు, కోష్టంలో గొడ్లు బెదురుకునేట్టు, చెట్టు మీది పక్షిజాలం అదిరి పడేట్టు ఓ గావు కేక వినిపించింది. కల చెరిగి పోయింది. గదిలోంచి హాల్లోకి పరుగెత్తాను.

బాబాయి నడి మంచం మీద కూర్చుని ఎడమ కాలి బొటన వ్రేలును గట్టిగా పట్టుకుని వణికి పోతున్నాడు. బామ్మ లాంతరు చేత్తో పట్టుకుని మంచం క్రింద అతిజాగ్రత్తగా వెతుకుతూంది. నిలువెల్లా వణికి పోతూన్న బాబాయి మళ్ళీ ఓ గావుకేక పెట్టి చూపుడు వ్రేలుతో గడపవైపు చూపుతూ ముఖాన్ని వెనక్కి తిప్పుకున్నాడు. ఎర్రటి గుడ్లతో, కొండెను పైకి ఎత్తి, సవిలాసంగా మహారాజువారి ఎదుట నాట్యం చెయ్యబోయే రాజనర్తకిలా మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ, వయ్యారంగా, హొయలు ఒలక బోస్తూ వెళ్తోంది వో వృశ్చిక రాజం ! వెంటనే బాబాయి ఏదో తట్టిన వాడిలా అంత బాధలోనూ కోడి— కోడీ— కోడి అని అరవడం ప్రారంభించాడు.

“ఇది కోడి గాదు బాబాయ్— తేలు— సరే— ఇక మంచం దిగి మంత్రం వేసుకో. మొదటి కేసు స్వయం కేసు.” అన్నాను పాదరక్షతో వృశ్చిక వధగావిస్తూ.

బాబాయి మంచం దిగాడు. అయితే మంత్రం మరచిపోయినట్టున్నాడు. సుమారు రెండు గంటల సేపు జపించిన మంత్రం, ఇంత త్వరగా మరచిపోతానని ముందే తెలుసుకొన్నాడు గాబోలు. బాబాయి బండిలో కెక్కుతూనే ఆ మంత్రాన్ని డైరీలో కెక్కించేశాడు.

డైరీ చేతికి తీసుకుని తువ్వాలు కొసను మెలిబెడుతూ, తానటూ ఇటూ తిరుగుతూ, నోట్లోనే మంత్రోచ్చాటన గాలిస్తూ, అప్పుడప్పుడూ ఫో—ఫో అంటూ కసురుకుంటూ, రోగిగానూ, వైద్యుడుగానూ ద్విపాత్రాభినయం చేస్తున్నాడు బాబాయి.

ఎన్నిసార్లు అటూ ఇటూ తిరిగినా, ఎంత సేపు ‘ఫో’ అన్నా ఆ విషం దిగినట్టు లేదు. బాధ ఉపశమించినట్టు లేదు. తేలు బాధకన్నా, తన మంత్రం పారలేదన్న బాధ ఎక్కువై పోయింది. రోజంతా ఒళ్ళు హూనం చేసుకుని, ఉప్పునీళ్ళలో మునిగి, హోరుగాలిలో కూలబడి, చెప్పిన మాటే వెయ్యి **సార్లు చెప్పిన శ్రమంతా మళ్ళీ తన కళ్ళెదుట సాక్షాత్కరించినట్లయింది !**

అయినా ఇది మొదటి కేసు. దీన్లోనే అపజయం పొందినట్టు ప్రజానీకానికి తెలిస్తే మళ్ళీ తన ముఖం ఎవరూ చూడరు. అందుకని బాధ తగ్గి పోయిందన్నాడు బాబాయి పళ్ళు బిగపట్టుకుంటూ.

నాకేమో అనుమానంగానే ఉంది. బామ్మ మాత్రం సంతోషించింది కుమార రత్నం ప్రయోజకత్వానికి. నేను గదిలోకెళ్ళి అలా నడుం వాల్చానో లేదో, బలవంతంగా మూసి పెట్టిన కుళాయి సీటిని పైకి చిమ్మినట్టు, బాబాయి గొంతు పెకిలించుకు వచ్చింది భోరుమని ఏడుపు.' వెంటనే జతగా బామ్మ మరి కాస్త ఎక్కువ శృతిలో లంకించు కుంది.

ఆ శోక స్వర కర్తల నిద్దరినీ చూస్తూంటే అసలు తేలుకుట్టింది బాబాయినా, లేక బామ్మనా, లేక ఇద్దరినీనా అన్నది అర్థంగాదు క్రొత్తవాళ్ళకి.

బాబాయికి పేరు సంపాదించి పెట్టేందుకు హారం వేసుకున్న నేను ఇప్పుడు పెద్ద చిక్కులోనే ఇరుక్కున్నాను.

బాబాయేమో థర్మామీటర్లో పాదరసం లాగా గుండెల్లోకి విషం ఎక్కిపోతూందంటున్నాడు. బామ్మ నన్నో హంతకుణ్ణి చూచినట్టు చూస్తూంది.

మంత్రసాని పనికి వప్పుకున్న తర్వాత దేనికైనా సిద్ధ పడాల్సిందేగదా మరి ! ఏళ్ళనిద్దరినీ ఓదార్చ బోతే కంఠస్వరాలు మరికాస్త హెచ్చుస్థాయిలో జమిలిగా, జంటనాదస్వరాల్లాగా పలుకుతున్నాయి. ఒక క్షణం ఊరుకున్న బాబాయి మరుక్షణంలో ఎడమ పాదాన్ని ఎత్తి పట్టుకుని కుడికాలు మీద హాలులో ఒక మూల నుంచి మరొక మూలకు ఎగిరెగిరి దుముకుతూ తాండవ నృత్యం చేస్తున్నాడు.

నాకేమీ తోచడంలేదు. పాత గ్రామఫోను ప్లేటు అరగదీసి పట్టువేశాను. తగ్గలేదు. నీరుల్లిపాయలు చితగ్గొట్టి కట్టాను. తగ్గలేదు. తీరా నేను తేలుకుట్టిన చోట గాక వేరే చోట మందులు వేశానని నా మీదికి ఉరిమాడు. అప్పటికి ఈ సంగీతకచేరీకి ఇంటి నిండా శ్రోతలు చేరారు.

ఇక నేనేమీ చేయలేను. ఏం చేసినా అది చెడుగానే పరిణమించేట్టున్నది. ఇంకేదైనా కీడు జరిగినా ఆ నింద నా మీదికే వస్తుంది. లాంతరు చేత్తో పుచ్చుకుని ఆ నట్టనడిరాత్రి మూడు మైళ్ళ దూరాన ఆశ్రమంలో ఉన్న స్వాములవారి కోసం పరుగు తీశాను.

మర్నాటి ఉదయానికి బాబాయి వృశ్చిక మంత్రోపదేశోదంతం వూళ్లోవాళ్లకి తెలిసిపోయింది. అప్పట్నుంచీ ఆయనకు వి. యమ్. అన్న పేరు వచ్చింది. అంటే విలేజ్ మున్సిఫ్ మాత్రంకాదు.



# నిండైన విగ్రహం ప్రజాభిమానం దోచుకునే నటనగల

## 'హీరో' ఎన్. టి. ఆర్. తో ముఖాముఖి

వీరాజీ



తన స్క్రిప్పింగ్ హాబీ గురించి యితర అభిమాన గ్రంథాలగురించి సందర్భవశాత్తు మీ ప్రతినిధితో సీరియస్‌గా ముచ్చటిస్తున్న రామారావు.

చాలా సంతోషంగావుంది. 'మనదేశం'తో తెరమీదకెక్కి "మనదేశం"లో యివాళ అందరి అభిమాన తారయై తెర మీద ప్రకాశిస్తున్న అందాల హీరో శ్రీ నందమూరి తారక రామారావుతో జరిపిన 'ఇష్టాగోష్ఠి'ని పాఠకులముందు వుంచుతున్నందుకు నిజంగా చాలా సంతోషంగా వుంది.

తోట'రాముడు' మొదలు సీతా'రాముడి' దాకా శ్రీ ఎన్. టి. ఆర్. శ్రమా, శ్రద్ధా, దీక్షా; దక్షతా పోషిపెంచిన 'పాత్రత' ఇవాళ అతనికి అమూల్యమైన సంపదగా, అరవురూపమైన అందంగా ఆనందమిస్తున్నది.

నిజ జీవితంలో విద్యావంతుడు, వినయశీలి, విరామమెరుగని, విసుగు జెందని, 'స్వార్థంకన్నా మిన్నగా బాధ్యతకే అంకితమైన ఆదర్శ నటుడూ, ఐన శ్రీ తారక రామారావు ఆంధ్రదేశంలో అసంఖ్యాక ప్రేక్షకులకు 'వెండితెర వేలుపు'

### ప్రేక్షకుల ప్రేమ

తెల్లవారుజామున కోడికూతకు ముందస్తుగా లేస్తే అర్థరాత్రికి ఆహ్వానం పలికేవరకూ పని చేసే ఈ 'హీరో' మొహం నిగనిగలాడుతూ, కళకళలాడుతుండటాన్ని చూసి నేను ఆశ్చర్యపోయాను. ఆ ఇంటిముందు కారులు ఆగడం అపురూపం కాదుగాని ఎక్కువగా టూరిస్టు బస్సులు వచ్చి వాలుతూ ఉంటాయి. ఆరోజు పాతికనించి ఏభైదాకావున్న 'బృందా'లు అటు బెంగుళూరునించి ఇటు శ్రీకాకుళందాకా—గల ప్రాంతాలకు చెందిన వారు తమ అందాల నటునిచూసి పోదామని గడియారాలు చూడకుండా సమయా సమయా లనకుండా వచ్చారు.

వాళ్ల 'రాముడు', వాళ్ల 'కృష్ణుడు' వాళ్ల అభిమాన నటుడు అయిన ఈ అర్జునిణ్ని చూడటంతో వాళ్ల మొహాల్లో తృప్తి వెలిగింది!

"నందమూరి" హవుస్‌లో మొట్ట మొదట మనల్ని ఆకర్షించేవి ఇంటిముందు ఆవరణలోని మొక్కలు, దీపస్తంభాలు, వాటిమధ్య పిల్లలాడుకునే చిన్నపార్కు! [పిల్లలూకూడా]

* "తీరిక సమయాలలో మీహాబీ ఏమిటి?"

"అసలు తీరిక ఎక్కడ? ఉదయం మూడున్నర గంటలకి లేవడం వ్యాయామం చెయ్యడం, తైలమర్దనం, చన్నీళ్లస్నానం, దైవధ్యానం, అక్కణ్నించి (సూర్యుడు లేచేసరికి) మేకప్‌కి వెళ్ళిపోడం తిరిగివస్తూనే ఉదయం 8—30 గంటలకే పక్కా శాఖాహారం, పప్పు, పెరుగు, కూరా, అన్నం మొదలైన "మెను"తో భోజన చేయడం సెట్స్‌కి వెళ్ళిపోడం......"

శ్రీ రామారావు వ్యాయామం, ఆసనాలు గట్రా చేసే గదిలో ఇంతెత్తు జాడీలు రెండున్నాయి. ఒకదానిలో కచోరాలు, బావంచాలు, వట్టివేళ్ళలాంటి 'ఘుమ్మైన' వ్యవహారమంతా వేసిన తైలం ఉంది. రెండోదానిలో అసలు సిసలు పుట్టతేనె ఉంది. ఇది వోసారి, అది వోసారి ఆఘ్రాణించేసరికి 'మస్త్



రామారావు అభిరుచి 'ఏంటిక్స్'మీదనే ఎక్కువగా ఉన్నట్లు తోస్తోంది. ప్రాచీన శిల్పవస్తు సంపదనంత యింటకెచ్చి అలంకరించుకుందామా అన్నట్లు ఎన్నోరకాల శిల్పా, లోహ, గంధపు వస్తువులున్నాయక్కడ.

మూలాన, పెద్ది రామయ్యను, పెద్ద చదువులు చదివించుదామనే ఆలోచన పెట్టుకోలేదాయన. పద్దులు రాయగల్గినంత జ్ఞానం వచ్చిన తరువాత పెద్ది రామయ్యని పూర్తిగా వ్యాపారంలో ఉంచేశాడు. పెద్ది రామయ్యకి పదహారో సంవత్సరం నడుస్తుండగా, సుందరరామయ్య పుట్టడం కొద్ది రోజుల తేడాలో తండ్రి పోవడం రెండూ జరిగి పోయాయి. ఆ తరువాత రెండేళ్ళకి పెద్ది రామయ్య పెళ్ళి జరిగింది— లేక లేక పుట్టిన తమ్ముడవటం మూలాన పెద్ది రామయ్యకి తమ్ముడంటే అపరిమితమైన ప్రేముండేది. భర్తని మెప్పించడానికి అనిగాని మరెందుకైనా గాని సీతమ్మ కూడా సుందరరామయ్యని బాగానే చూసేది.

పల్లెలో ఉంటే, చుట్టూ ఉండే గాలి మూకతో పెడ చెడి పోతాడేమోననే భయంతో, తమ్ముడ్ని తీసుకుని పూర్తిగా పట్నంలోనే కాపురం ఏర్పాటు చేసాడు పెద్దిరామయ్య.

సుందరరామయ్య చిన్నప్పటి చేష్టలు చూస్తుంటే, తమ్ముడు చాలా గొప్ప వాడవుతాడనిపించేది ఆయనకు. ఐదో ఏట సుందర రామయ్యని స్కూల్లో చేర్పించాడు. స్కూలు జీవితం చాలా బాగా సాగి పోయింది. ప్రతి సంవత్సరము మంచి మార్కులతోటి ప్యాసవుతూ వచ్చాడు. పదహారో ఏట స్కూలు ఫైనలు పరీక్ష కూడా మంచి మార్కులతోనే ప్యాసయ్యాడు సుందరరామయ్య. అన్న కాలేజీలో తనను చేర్చే ప్రయత్నాలు చేస్తుండగా తానిక పై చదువులు చదవ దల్చుకోలేదని ఓ శుభ ముహూర్తాన తేల్చి చెప్పేశాడు సుందరరామయ్య. తను ఇన్నాళ్ళనుకున్నవన్నీ కలలుగా మారే సరికి, విచారమేసి, తమ్ముడ్ని కోప్పడి చూసాడు. పెద్ద వాళ్ళ చేత చెప్పించాడు— లాభం లేకపోయింది— ససేమిరా తాను వ్యాపారం తప్పితే మరో పని చేయ దల్చుకోలేదని భీష్మించుకొనే సరికి, పెద్ది రామయ్య కేమీ పాలు పోలేదు. చేసేదేమి లేకపోగా, ఆలోచించి చూస్తే తమ్ముని ఆలోచన కూడా ఒక విధంగా మంచిదిగానే తోచింది. అటు పెదనాన్న వయస్సు మళ్ళిపోయింది. వ్యవసాయం చూసుకోగల వోపిక ఆయనలో లేదు. కౌలుకిచ్చినా పొలం పాడయి పోవటం తప్పితే మరే లాభం ఉండదు. తను హాయిగా వ్యవసాయం చూసుకోవచ్చుననిపించింది పెద్దిరామయ్యకి. రెండేళ్ళు తనతోపాటే ఉంచుకొని మంచి రోజొకటి చూసి సుందర రామయ్య చేతిలో ఇనప్పెట్టె తాళాలు పెట్టి తాను పల్లెకెళ్ళి పోయాడు. ఆ మరుసటి సంవత్సరమే పొరుగు వెంకటప్పయ్య కూతురు సావిత్రితో తన తమ్ముడి పెళ్ళి తతంగం కూడా పూర్తి చేసి బాధ్యత తీరినట్లుగా ఊపిరి పీల్చాడు పెద్ది రామయ్య.

మొండితనమనండి, మరేదయినా అనండి సుందరరామయ్యది విచిత్రమయిన స్వభావం. తాను బహు కొద్ది విషయాలను మాత్రం నమ్మే వాడు. ఒక సారి నమ్మడమంటూ జరిగితే చాలా నిక్కచ్చిగా నమ్మేవాడు. వ్యాపార విషయంలో గాని, తన స్వవిషయంలో గాని, స్వంత తర్కముపయోగించి క్రిందో మీదో పడి, ఏ నిర్ణయానికైనా వచ్చేవాడు కాని సాధ్యమయినంత వరకూ సలహాకు మాత్రం వెళ్ళేవాడు కాదు— తప్పి జారి అలాంటి దేదైనా జరిగితే, నా నష్టకుమాత్రం వచ్చేవాడు.

అసలు సుందరరామయ్యకు మిత్రులంటూనే బహు కొద్దిమందున్నారు. అందులో ఆప్త మిత్రుడనని చెప్పుకోవటానికి నేను తప్పితే మరెవరూ లేరనే చెప్పాలి. మా స్నేహం కూడా చాలా విచిత్రమయింది. ఉంటున్నది పది హేను మైళ్ళ దూరంలోనేనైనా ఏడాదికో రెండేళ్ళకో మేం కలుసుకోవడమంటూ జరిగేది. గమ్మత్తేమిటంటే రెండేళ్ళకు కాదు, పదేళ్ళకు కలిసినా, సుందరరామయ్య మాత్రం, నిన్న మాట్లాడి పోయిన వాడిలా సంభాషిస్తాడు.

వ్యాపారం స్వంతంగా సాగించటం ప్రారంభించినప్పటినుంచి సుందరరామయ్య దుస్తులలో కొంత మార్పు తెచ్చుకున్నాడు. దుస్తులలో కొంత జాతీయత, మొహంలో అదోరకమయిన ఆత్మీయత కన్పడేది. (ఇవి వ్యాపారస్తుల విషయంలో ముఖ్యంగా ఉండాలని సుందరరామయ్యంటుండేవాడు.) ప్రాణికోటిలో మార్పు లేకుండా స్థిరరూపంతోఉండే జీవులు చాలా అరుదు. అసలు లేవేమో కూడా. కాని సుందర రామయ్య విషయం ఇందుకు విరుద్ధంగా ఉండేది. సుమారు దశాబ్దమున్నర క్రితం, అంటే తను వ్యాపారంలో ప్రవేశించినపుడు—తను సరైనదనుకున్న రూపంలోకి పరిణామం చెందాడు సుందర రామయ్య. ఆనాటినుంచి ఈనాటివరకూ కించిత్తయినా మార్పులేదు. ఖద్దరు యుగంపోయి, నైలాను యుగం వచ్చినా సుందర రామయ్య మటుకు, ఆ అరజేతుల ఖద్దరు చొక్కా, ఖద్దరుపంచె, బీడీ జేబుతో ఖద్దరు బన్నీను మాత్ర వేసుకోవటం మానలేదు. 5'4''ఎత్తు, నూటపది పౌనులు బరువు, కాన్పూరు చెప్పులు, హైరోడ్స్ క్రాపు, బంగారు ఫ్రేమ్ కళ్ళజోడు—ఖద్దరు బట్టలతో సుందర రామయ్య రూపం, సుందరంగా, అటు వ్యాపారస్తులకి, ఇటు రాజకీయ నాయకులకి మధ్యస్తంగా ఉంటుంది. అలవాట్ల విషయంలో కూడా, ఇంత కఠోరమైన నియమాలు పెట్టుకున్నాడు సుందర రామయ్య. బావుటా బీడీ దొరక్కపోతే మరోబీడీ ముట్టుకోడు—పెసరట్టు—ఉప్మా లేకపోతే ఆ రోజు అల్పాహారమే మానేసేవాడు.

తన చేతులలోకి తీసుకున్నప్పటినుంచి వ్యాపారం తగ్గుముఖం పెట్టినా, సుందర రామయ్య పలుకుబడి మాత్రం అంచెలంచెలుగా పెరిగిపోయింది. పొగాకు వ్యాపారస్తులు తమ సంఘానికి ప్రెసిడెంటుగా సుందర రామయ్యని రెండుసార్లు ఎన్నుకున్నారు. కమీషను విషయాలలో ప్రభుత్వానికి, వ్యాపారస్తులకి తేడావస్తే, అధికారులతో, మంత్రులతో మంతనాలు సాగించటానికి సుందరరామయ్యే వెళ్ళవలసి వచ్చింది. కొన్ని మాసేసి నెల రోజులు రాజధానిలో మకాంవేసి, విషయాన్ని సాధించుక వచ్చిన దిట్ట సుందర రామయ్య. చెప్పుకోవాలంటే ఇలాంటి మెరిట్ సర్టిఫికేట్లు (సుందరరామయ్య భావన) బోలెడన్ని తన జీవితంలో.

* * *

ఆరోజు స్కూల్లో కొద్దిగా పనుండడంవల్ల తొందరగా బయలుదేరాను. త్రోవలో సుందర రామయ్య గుమాస్తా కనిపించాడు. ఉన్న పళాన నన్ను పిలుచుకరమ్మని పంపించాడట. వస్తానని చెప్పి గుమాస్తానిపంపి, స్కూలుకో సెలవు చీటీ వ్రాసి, బస్సెక్కాను. కొన్ని కొన్ని అల్ప విషయాలను కూడా భూతద్దంలో చూచి భయపడటం సుందర రామయ్యకు పరిపాటే— అలాంటప్పుడు సన్నిహితుడొకడు, దాని నిజ స్వరూప మెలాటిదో తెలియ చెప్పాలి. అలాటి సమయాలలో సుందరరామయ్య నన్ను తప్ప మరొకరి నెన్నుకోడు. కొట్టు చేరుకొనే సరికి సుందరరామయ్య ఎవరితోనో మాట్లాడుతున్నాడు. నన్ను చూసి ఆయన్ని పంపించి వేశాడు— సుందరరామయ్యే ముందు మాట్లాడించాడు.

"శంకరూ, నీ కీ విషయం తెలిసిందా" ఆద్యంతాల గురించి అంత పట్టించుకోకుండా, మధ్యలో ప్రారంభించటం సుందర రామయ్యకు క్రొత్తేమీ కాదు. ఈ విషయం తెలిసిందాంటే నేనేం చెప్పను? ఎవరు మాత్రం ఏం చెప్పగలరు.

"ఏ విషయం"

"అదే మన లక్ష్మీపతిగాడి విషయం"

"వాడేదో గుమాస్తాగిరి వెలిగిస్తున్నాడని విన్నాను. ఏం విషయాలేమయినా సృష్టించాడా?"

"అదికాదురా, వాడు చనిపోయాడట—నిన్న సాయంత్రం వాళ్ళ పెద్దమ్మాయి కనిపించి చెప్పింది, గుండె జబ్బని అనుకుంటున్నారట"

గుండె జబ్బు సాధారణంగా పెద్దవాళ్ళని, అంటే హోదా కలిగిన వాళ్ళను మాత్రమే వరిస్తుందని విన్నానుకాని, ఒక బోడి గుమస్తాకి కూడా గుండె జబ్బు వచ్చిందంటే విచారంతోపాటే ఆశ్చర్యం కూడా వేసింది. సాధారణంగా గుమాస్తాలకి వస్తే, గిస్తే వారి దారిద్ర్యానికితోడు, పీడించి, పీడించి చంపే ఏ క్షయో వస్తుంది.

లక్ష్మీపతి కుటుంబానికి నాకు తెలిసినంత మటుకు మరో ఆధారమేమీలేదు. పోని యేమన్నా కూడేసాడంటే—వాడి జీతం ఎంత—మిగుల్చేంత?

"పాపం, అకాల మరణాలు ఎక్కువయినయిరా" అన్నాను సానుభూతి చూపటంకంటె నేను చేయగల్గిందేమిలేక.

"వాడు గుండె జబ్బుతో పోయాడంటే నేను నమ్మను—వాడిని చూసిన వాడెవడూ కూడానమ్మడు దీనికి మరో కారణముంది" అన్నాడు రామయ్య బీడీ వెలిగిస్తూ.

"ఏమిటది"

"వాడి భార్య మొన్ననే మగ పిల్లవాడిని ప్రసవించిందట. ఇది వాడి ద్వారానే తెలిసింది. పిల్లవాడు తండ్రి గండాన్న పుట్టి ఉంటాడు. కొన్ని కుటుంబాలకి మొగపిల్లలచ్చిరారురా"

"ఇవన్నీ వెధవ నమ్మకాలు" అన్నాను నాకు నమ్మ బుద్ధిగాక.

"నిజం, నిజం......నేను చాల చూసాను..... ఈమధ్యనే రెండు మూడు చూసాను" సుందర రామయ్య నమ్మకను చెడగొడదామనే ప్రయత్నం నేను చేయదల్చుకోలేదు. నా దృష్టిలో ఎవరయినా ఓవిషయాన్ని పూర్తిగా విశ్వసించినపుడు, దానిని తర్కం ద్వారాగాని, మరే నిదర్శనమయిన దృష్టాంతరాలను చూపిగాని, ఆ విశ్వాసాన్ని సడలించటం మంచి పనికాదు. సుందర రామయ్య వత్తిడిమీద ఆ రోజక్కడే గడప దలుచుకున్నాను. మధ్యాహ్నమయ్యే సరికి భోజనానికి హోటలుకి దారి తీసాడు.

"సంసారంలేదా ఇక్కడ" కుటుంబ మేమయిందో తెలుసుకోవాలనే కుతూహలంతో నే నడిగాను.

"లేదు, 4 నెలలయింది, పంపించి వేశాను"

# తండ్రిగండాన్న

"కారణం"

"కారణమంటూ ప్రత్యేకంగా ఏమీలేదనుకో. పల్లెలో పిల్లలకి మంచి పోషణ జరుగుంది. అదీ కాకుండా వూళ్లోనే స్కూలు కూడా ఉందిగా, అక్కడే చదువుకుంటారు. మరో విషయం కూడా దృష్టిలో పెట్టుకొనే ఈ పని చేసాను"

"ఏమిటి"

"తెలుసుగా నీకు, నాకు ఇప్పటికే నలుగు రాడ పిల్ల లున్నారు. ఈ విధంగా సాగిపోతే పిల్లల పెళ్ళిళ్ళు కూడా చేయలేను."

"బాగానే ఉంది కుటుంబ నియంత్రణ మాట" ప్రభుత్వమువారి ప్రచారము బాగా తల కెక్కిం దనుకున్నాను.

ఆ సాయంత్రము సినిమాకు వెళదామని 'ప్రపోజ్' చేసాను. మరేవిధంగా సమయం గడువక. రామయ్యతో కలిసి సినిమా చూడటమే ఒక ఎక్స్‌పీరియన్సు. అలాటి అవకాశము కల్గిన కొందరు సుందర రామయ్యలో ఇంత హ్యూమరుందాని ఆశ్చర్యపోవటం కూడా కద్దు.

థియేటరుకి వెళ్ళాము. ఏదో హిందీ చిత్రం. ప్రారంభమయిన ఘంటకి కథ మంచి రసపట్టులో పడింది. హీరోయిను హాస్పటలులో ప్రసవ వేదన పడుతుంటుంది—ఆ గదిముందే హీరో సిగిరెట్టుమీద సిగిరెట్టు కాలుస్తూ ఆదుర్దాతో అటూ, ఇటూ తిరుగుతుంటాడు. ఇంతలో నర్సు వస్తుంది. కంగ్రాచ్యులేషన్స్ మగపిల్లాడు, అని చెబుతుంది. పెద్ద ప్రెజంటు కొనుక్కొద్దామని హీరో రోడ్డుమీద వెళతాడు—చేతిలో పూలు, మరో పెద్ద పాకెట్టుతో తిరిగి వస్తూంటే లారీ ఢీకొని మరణిస్తాడు — మొత్తానికి బాగానే ఉంది.

"నాన్సెన్స్" అన్నాడు సుందర రామయ్య.

ఇందులో అంత నాన్సెన్సేమిటో నాకు అర్థం గాక, రామయ్యవైపు చూశాను. "చెత్త కథలు, బుర్ర తక్కువ ప్లాట్లు" అంటూ ఏవేవో గొణుక్కుంటున్నాడు. వాడిలో వాడే.

ఇంటర్‌వల్‌లో చెప్పినా వినకుండా, నన్ను తరువాత రమ్మని తాను వెళ్ళిపోయాడు. పిక్చరు బాగానే ఉంది. ఈమధ్య వస్తున్న మన తెలుగు చిత్రాలకన్న మంచిదే. సినిమా అయిన తరువాత ఇంటికి వెళ్ళాను. సుందర రామయ్య కుర్చీలో కూర్చొని ఏదో ఆలోచిస్తున్నాడు. సుందరరామయ్యకి నచ్చని భాగమేదో ఆ చిత్రంలో తెలుసుకోవాలన్న కుతూహలమున్నా, రామయ్య తీరు చూసి అడగటం మానుకున్నాను. మర్నాడు తెల్లవారుజామున మొదటి బస్సులోనే వూరొచ్చేశాను.

ఆ తరువాత చెప్పుకోవలసిన విషయా లేమీలేవు. నే నొచ్చిన నెల రోజులకు సుందరరామయ్యనుంచి ఒక ఉత్తరం వచ్చింది. తను స్వంత పనిమీద వాల్తేరు వెళుతున్నానని, నెలరోజుల వరకు తిరిగి రావటం పడదని, కొట్టు తాళాలు గుమాస్తా తెచ్చి నా కిస్తాడని వ్రాశాడు. ఆ తరువాత మళ్ళా

వెలకు వైజాగునుంచి మరో ఉత్తరం వ్రాశాడు. దానిలో కూడా పెద్ద విశేషాలేమీ లేవు. తను క్షేమంగా ఉన్నానని వ్రాశాడు. వర్షాలు బాగా కురిసినాయట. తనుండే వీధి చివర ఉంటున్న ఇల్లు కూలిపోయి కుటుంబం మొత్తం చనిపోయారట. అదృష్టవశాత్తుగా పదినెలల పిల్లవాడు మాత్రం బ్రతికాడట—ఈ సంఘటన చాలా బాధ కల్గించిందని వ్రాశాడు. విచిత్ర మేమిటంటే ఇన్ని ఉత్తరాలలోని తాను వైజాగు పోయిన కారణమేమిటో మాత్రం వ్రాయలేదు. ఆ తరువాత కొన్ని రోజులకు రామయ్య వచ్చాడంటూ, గుమాస్తా వచ్చి కొట్టు తాళాలు తీసుకుపోయాడు.

రెండు సంవత్సరాలు గడచిపోయాయి. సుందరరామయ్యనుంచి ఉత్తరమేమీ రాలేదు. రామయ్యదంతా అతివృష్టి, అనావృష్టి న్యూస్. వ్రాస్తే బడబడా నెలకి నాల్గు ఉత్తరాలు వ్రాస్తాడు లేకపోతే ఒక్కటీ ఉండదు.

* * *

ఆరోజు స్కూలు ఇన్‌స్పెక్షన్ ఉండటం మూలాన హడావుడిగా ఉంది. నేను ఉదయమే బయలుదేరి స్కూలు కెళ్ళాను. రికార్డులు మొదలయినవి సరిచూడవలసిన పని బోలెడుంది. పోస్టుమాన్ ఇంటివద్ద ఇచ్చిపోయాడంటూ ఒక ఎక్స్‌ప్రెస్ డెలివరీ లెటరొకటి మా నౌకరు ఇచ్చిపోయాడు.

సుందరరామయ్య దస్కూరి కొట్టొచ్చినట్లు కన్పడుంది. కుతూహలంతో చదవటం ప్రారంభించాను.

ప్రియమైన శంకూ!

బహుశా ఈ ఉత్తరము అందేసరికే మరో దుర్వార్త కూడా వినిఉంటావు. పిరికివానిలా, భయపడి అలా చేశాననుకోకు. గత రెండున్నర సంవత్సరాలనుంచి ఒక్క విచిత్రమయిన అనుమానం వేధిస్తుండేది. నీకు తెలుసుగా నేను పుట్టినప్పుడే తండ్రి చనిపోయాడు. అలాగే మా తాత కూడా పోయాడు. నా కనిపించేది—ఇది నా విషయంలో కూడా జరుగుతుందేమోనని— అప్పుడప్పుడూ ఇవి మూఢ నమ్మకాల్లే అని అవి సరిపుచ్చుకుందామని ప్రయత్నించేవాడిని— సాధ్యం కాలేదు. ఆ తరువాత ఒక ఉపాయం తోచింది. వాల్తేరువెళ్ళి ఆపరేషను చేయించుకుందామని— ఈ అనుమానంతో సతమత మయ్యేకన్న అదే మేలనిపించింది. ఆపని కూడా పూర్తి చేశాను. అయితే ఈ విషయం చాలా గుప్తంగా ఉంచాను. సావిత్రికి కూడా తెలియదు. 7 నెలల క్రితమే ఒక భయంకర సత్యం తెలిసింది. సావిత్రి గర్భిణీగా ఉండటం—ఆ విషయం తెలుసుకున్నప్పుడు నా స్థితి ఎలా ఉంటుందో నేను వ్రాసేకంటే నీ వూహించుకోవటమే మేలనుకుంటాను. లోకుల దృష్టిలో ఆ పాపకు సుందరరామయ్యే తండ్రి. నాకు తెలుసు. నా పరువు ప్రతిష్టలో కించిత్తు కూడా లోపముండదని, కాని శంకూ! ఆ పాపకు తండ్రిగా వూహించుకొని ఎన్నాళ్ళు నేను మోసగించుకోమంటావు?

ముగిస్తాను.
శ్రేయోభిలాషి
సుందరరామయ్య.

* * *

హెడ్మాష్టరు గారనుమతి తీసుకొని త్వరగా బయట పడ్డాను. త్వరితంగా బస్సుస్టాండువైపు నడుస్తున్నాను. అంతదూరంలో సుందరరామయ్య గుమాస్తా కనపడ్డాడు.

“సుందరరామయ్యగారు చనిపోయారు బాబూ! తెల్లవారుజామున పెద్దిరామయ్యగారు నిద్ర లేపుదామని వెళ్ళేసరికే చనిపోయి ఉన్నారట”

“సావిత్రమ్మగారు ప్రసవించారు. మగపిల్లాడు పుట్టాడు—అందరూ పిల్లడు మంచి నక్షత్రాన పుట్టలేదని తండ్రి గండాన్న పుట్టాడనుకుంటున్నారండీ” గుమాస్తా మాటలు వింటుంటే ప్రపంచం గిర్రున తిరిగి నట్లనిపించింది. ★

## కొత్త సీరియల్

# కూలిన గోడలు




యమునా తీరంలో సంధ్యా సమయాన వేయి కన్నులతో రాధ ఎదురు చూసిందట. ఎందుకో?

యుగ యుగాల నాటి రాధ మాదిరే—శారదాదేవి ఆ ప్రశాంతమైన సాంధ్య వేళ సువిశాలమైన సముద్రపు టంచున క్షణ మొక యుగంగా నిరీక్షిస్తూ నిలబడింది. సుందరమైన ఆమె వదనంలో ఎంతకీ ఆశారేఖ గోచరించలేదు.

గాలి విసురుకు చెదురుతూన్న చీర కుచ్చెళ్లను మాటిమాటికీ సవరించుకోలేక మెత్తని ఇసుకలో కొంచెం దూరం నడిచి సందడి తగ్గిన చోట కూర్చుని చీర సర్దుకొంది. చేతిలో పుస్తకాన్ని తెరిచి పెట్టుకోవటమే గాని ఆమె మనస్సు చదువుమీద లగ్నం కాలేదు. —క్షణానికోసారి తల త్రిప్పి సముద్రపు ఒడ్డున దారి పొడుగుకూ దృష్టి సారించి నిరాశగా తిరిగి పుస్తకం తిరగవేయ సాగింది. అది కూడా ఎక్కువసేపు చేయలేక పుస్తకం మూసివేసి విసుగ్గా నుదుటి మీద పడిన వెంట్రుకలని వెనక్కి నెట్టుకొంది.

ఆ విసుగుదలలో— ఆ నిరీక్షణలో— ఆమె— శారద— మనోహరంగా కన్పించింది. ఆమె శరీర సోయగాన్ని ఇనుమడింప జేస్తూన్న గులాబీరంగు చీర చెంగు గాలిలో తేలిపోబోతే సున్నితంగా భుజాల మీద సర్దుకొంది. నుదురు చిట్లింపులో ముంగురుల రాపిడికి కుంకుమ చెదిరిన సంగతి ఆమెకు తెలిసి ఉంటే సరిదిద్దుకోవటానికి ఎంతైనా తాపత్రయ పడి ఉండేది.

మరొకసారి చేతివాచీ చూసుకొని తిరిగి విరిగి పడే కెరటాలలోకి చూడసాగింది. అనంతమైన ఆ జలరాశి విసిగిన ఆమె మనస్సును అమితంగా ఆకర్షించింది. కెరటాలను మించిన భావాలు ఆ మనస్సులో అల్లకల్లోలంగా చెలరేగాయి. ప్రకృతిమాత సౌందర్యం అంతులేనిది! అపురూపమైనది! అనంతమైన ఈ నీటిరాశిని ఎవరు ప్రోగు చేశారు? సదా చంచలించే ఈ కెరటాలను ఎవరు సృష్టించారు? నీటి రాశికి నెలరాజుతో చిత్రమైన అనుబంధాన్ని ఎవరు ఏర్పరిచారు?.... మహోన్నతమైన ఈ సౌందర్య మంతా ఎవరు చిత్రించారు?— సమాధానాలు రాని సందేహాలు కలిగినప్పుడైనా మానవుడు భగవంతుడిని విశ్వసించక తప్పదేమో!

శారద వంటి రచయిత్రి క్షణకాలం తన్ను తాను మరిచి భావనా తరంగాలలో మునిగి పోవటం విశేషమేమీ కాదు.

అనంతమైన సముద్రం అణువులైన మానవులను చూస్తూ గర్వంతో అట్టహాసంగా నవ్వింది. ఆకాశాన్ని అంటుకోవటానికి కెరటాలు ఉవ్వెత్తుగా లేచి పోటీ పడ్డాయి.

పాదాలు తడిపి పారిపోతూన్న నురగ రాసుల్ని చూస్తూ శారద నవ్వుకొంది. ఈ కెరటాలు తనతో సరసమాడుతున్నాయి. ఒంటరిగా ఉన్న ఆడపిల్లని చూస్తే సముద్రుడు కూడా తపించి పోతాడు కాబోలు. చిరునవ్వుతో సాగర గర్భంలోకి చూస్తూ ఉండి పోయిన శారద పటుక్కుని దృష్టి మళ్లించింది. ఆతృతతో అలసటతో వేగి పోయిన ఆమె కన్నుల్లో— వదనంలో జ్యోతి వెలిగింది. ఆమె నిరీక్షణ అంతమై పోయింది. సంతోషాన్ని దాచుకోలేని కళ్లు విశాలమైతే విడిర్చిన పెదవుల మీద హాసరేఖలు నాట్యమాడాయి.

అతను— మధుసూదన్— చాల దగ్గరికే వచ్చేశాడు. శారదాదేవి కన్నుల్లో బందీ అయినట్లు వచ్చి ప్రక్కనే కూర్చున్నాడు. అలసి పోయిన వాడిలా రుమాలుతో నుదురు ఒత్తుకుంటూ అన్నాడు—

"ఆలస్యం చేశాను కదూ?"

మాట్లాడలేదు శారద.

"మిమ్మల్ని అడగటం ఏమిటి? ఆలస్యమే అయింది. మా వదినకు జవాబు రాస్తూ కూర్చుంటే టైం మించి పోయింది" మధుసూదన్ నొచ్చుకుంటూన్నట్టు అన్నాడు.

శారద చిన్నగా నవ్వి అంది — "నేను మిమ్మల్ని సంజాయిషీ లేమీ అడగలేదే!"

"కాదులెండి, నన్ను మీరు అపార్థం చేసుకోకుండా ఉండాలని నేనే సంజాయిషీ చెప్పుకొంటున్నాను."

"మీరు చెప్పింది నిజమేనని ఎలా నమ్మటం?" మధుసూదన్ మొహంలోకి చూస్తూ చిలిపిగా ప్రశ్నించింది శారద.

క్షణం ఆగి మధుసూదన్ కూడా స్వగతంలా అనుకున్నాడు— "నిజమే, ఎలా నమ్మటం?"

శారద గర్వంగా బుగ్గకు వేలు ఆనించుకు కూర్చుంది.

మధుసూదన్ దూరంగా చూస్తూ అన్నాడు— "అలా సముద్ర గర్భంలోకి చూస్తూ కూర్చుంటే ఎన్ని గంటలైనా తెలీకుండా గడిచి పోతాయి కదూ? ముఖ్యంగా మీవంటి వారికి—"

"అందరి సంగతీ ఏమో గానీ భగవంతుణ్ణి గురించి ఆలోచిస్తూ నా మట్టుకు నేను అలాగే గడిపాను."

శారద సూటిగా మధుసూదన్ కళ్లలోకి చూసింది.

"దానికేముంది? ఎవరి పిచ్చి వాళ్ల కానందం."

"అంతేనా? వాదన చేయకుండానే ఒప్పుకుంటారా?"

"ఇద్దరు పిచ్చివాళ్లు వాదించుకో కూడదు."

నవ్వింది శారద. మధుసూదన్‌కి భగవంతుని ఉనికిలో విశ్వాసం లేదు— కళ్లకు కన్పించే సైన్సు మాత్రమే అతను నమ్మగలిగేది. ముఖ్యంగా దైవ ప్రార్థనా— విగ్రహారాధనా— ఎన్నటికీ ఆమోదించలేనంటాడు మధుసూదన్.

"శాస్త్రానికి అతీతమైన ప్రకృతి ధర్మాలను మీరెలా విశ్వసిస్తారు?".

"మానవుడికీ— శాస్త్రానికీ అతీతమైన శక్తి ఏదో తప్పకుండా ఉండి ఉంటుందని నేనూ

## ల్ ప్రారంభం

అనుకుంటాను. కాని పిచ్చి పిచ్చిగా ఆ నమ్మకాన్ని అర్థంలేని పనులద్వారా వెల్లడించటమే నాకు నచ్చదు." అంటాడు. అందుకే దేవుడి గురించి ఆలోచిస్తూ గడిపానని శారద మధుసూదన్‌కి నచ్చి చెప్పింది.

"దానికేం గాని మీరు వచ్చి చాలా సేపైందా ?" మధుసూదన్ ప్రశ్నకు శారద కళ్లు విశాలం చేస్తూ అంది—

"మీకోసం గంటపైగా ఎదురు చూస్తూ కూర్చున్నాను."

"అలాగా ? విసుగేసిందా ?"

"వెయ్యదూ ?"

"అయితే కోపం కూడా వస్తుంది. అవునా ?"

"రావచ్చు. కోపం మాత్రం కావి తేవాలా ఏమిటి ?"

"మరైతే తిట్టుకున్నారా ?"

"చాటుగా తిట్టుకోవటం ఏం ఖర్మ ?"

"కాకపోతే మీరు చేయ గలిగిందేముంది ?"

"అంటే ?" నుదురు చిట్లించింది శారద.

"మీరు వచ్చి గంట అయింది. నా కోసం ఎంతో ఎదురు చూశారు. విసిగి పోయారు. చిరాకు వేసింది. కోపం వచ్చింది. ఇంత ఆలశ్యం ఏమిటో నన్ను అడిగేద్దామని ముళ్లమీద కూర్చున్నారు— — అయితే శారదాదేవి ! గంటకు ముందే వచ్చారని మీరు చెప్పినదంతా నమ్మటం ఎలా ?" మధుసూదన్ చిలిపిగా చూడబోతే శారద వోడిపోయి దానిలా కళ్లు దించుకొంది.

"తెలివి తేట లెంత మీ స్వంతమైనా మీ స్నేహ ధర్మాన నాకు కొన్ని అంటుకోవంటారా ?"

శారద తేలికగా నవ్వేసింది— "మిమ్మల్ని మాటలతో జయించగలిగింది ఎప్పుడు ?"

"ముందు ముందు ఆ రోజు కోసం ఎదురు చూడండి"

శారద చనువుగా అంది— "అయితే మీరు నన్ను మన్నించటం మానలేదు."

మధుసూదన్ నిశ్చయంగా అన్నాడు— "అలా మానటం నాకు ఇష్టంలేదు."

శారద కూడా దృఢంగా అంది— "మీ ఇష్టాలతో నాకు పనిలేదు. నాకు నచ్చని విధంగా నేను పిలిపించుకోలేను."

మధుసూదన్ క్షణం శారద మొహంలో చూసి గుచ్చి అడిగినట్టు అన్నాడు— "మధ్య మధ్య అంత చనువుగా పిల్చుకోవాల్సిన అనుబంధ మేమిటి శారదా ?"

శారద చలించి పోయింది. సిగ్గు పరుస్తూన్న అతని చిరునవ్వును తప్పించుకొంటూ— తన భావ కల్లోలం అంతు పట్టనివ్వకుండా— దృష్టి మళ్లించి వేసుకొంది.

"అదేమిటి ? అడిగిన దానికి జవాబే చెప్పకుండా మొహం తిప్పుకొంటే ఏమనుకోవాలి?"

మిడిసిపడే కెరటాలలో చిక్కుపడిన శారద దృష్టి ఎటూ తప్పుకోలేదు.

మధుసూదన్ శారదాదేవిని ఆకర్షించ గలిగేది అందుకే. అతను ఏ విషయమైనా నిర్భయంగా నిర్మొహ మాటంగా మాటాడుతాడు. సాధ్యమైనంత వరకు ఏ సంశయాన్నీ మనస్సులో ఉంచుకోడు.



# కూలిన గోడలు

ఒకనాడు మధుసూదన్ వర్తమాన రచయిత్రి శారదాదేవి రచనలను తీవ్రంగా విమర్శిస్తూ రాసిన ఉత్తరమే వారి స్నేహానికి పునాది అయింది. వివేక పూరితమైన అతని విమర్శలతో ఆమె రచనా పద్ధతులనూ— మనో భావాలనూ కొంత వరకూ మార్చుకోవలసి వచ్చింది. అమూల్యమైన అతని సలహాలతోనే ఉత్తమమైన సాహిత్యం సృష్టించగలననే విశ్వాసం ఏర్పడింది. మధుసూదన్ వ్యక్తిత్వం, అతని స్నేహం విలువైనవిగా తోచాయి శారదకు. అతను— చాలా మంది యువకుల లాగ ఆమె రచనలను అతిగా పొగడటం— ఆమెతో కాలక్షేపానికి తహతహ లాడటం చెయ్యడు. బలీయమైన ఆత్మ విశ్వాసంతో ఏ విషయమైనా నిర్దిష్టంగా నిర్భయంగా మాట్లాడ గలడు. —

ఇక రూపనిర్మాణంలో అతను అందగాడే! అందాన్ని మించిన తీవి— ఆకర్షణా ఏవో అతనిలో లీనమై ఉన్నాయి. సదా చలించే అతని కన్నుల్లోని చురుకుతనం ఎదటి వారిని స్నేహం చేయనిస్తుంది. వివేకపూరితమైన అతని మాటలలో కరుకుదనం విధేయతగా ఉండనిస్తుంది. అతను ఎల్లప్పుడూ ధరించే దుస్తుల తెల్లదనం అతన్ని ప్రేమించనిస్తుంది.

శారదాదేవి— మరే యువకుడి స్నేహాన్ని లక్ష్యపెట్టని శారదకు — మధుసూదన్ ప్రాణ స్నేహితుడు!

"నా ప్రశ్నకు జవాబే చెప్పకుండా ఎందుకలా మౌనంగా కూర్చున్నారు?" మధుసూదన్ హెచ్చరింపులతో శారద దృష్టి మళ్ళించుకొని తల తిప్పి చూసింది. ఆమె హృదయంలో మధుసూదన్ వేసిన ప్రశ్న మరోకసారి ధ్వనించింది— "మన మధ్య అంత చనువుగా పిల్చుకోవాల్సిన అనుబంధ మేమిటి శారదా?"

నిజమే! అతి చనువుగా వ్యవహరించటానికి ఏదో అనుబంధం ఉండితీరాలి. సామాన్యమైన ఈ స్నేహం దానికి సరిపోదు. అయితే..... ఈ స్నేహాన్ని మించిన అంతస్తు— అతి సన్నిహితమైనది— ఏదో తను సృష్టించాలా? కావచ్చు— ఆ అర్హత ఏమిటనే మధుసూదన్ అడుగుతున్నాడు.

"ఏమిటీ మౌన వ్రతం? చనువుగా పిలవమనటమే గాని ఎందుకు పిలవాలో చెప్పకపోతే ఎలా?" మధుసూదన్ మరొకసారి హెచ్చరించటంతో శారద కొంచెం నవ్వుతూ అంది— "నేను అంత దూరం ఆలోచించకుండానే అడిగాను. నిజమే! మన మధ్య అంత చనువుగా పిల్చుకోవాల్సిన అనుబంధ మేముంది?" మధుసూదన్ నవ్వాడు. "ఎంతైనా మీరు రచయిత్రులు కదా? సంభాషణలూ సంఘటనలూ మీ ఇష్టం వచ్చినట్లు మారిపోతాయి" అతని నవ్వు ఆమెను కళ్ళెత్తి చూడ నివ్వకుండా చేసింది.

"ఆడవాళ్ళు చిత్రమైన వాళ్ళు. అందులోనూ మీవంటి వారు...." మాటలు ఆపేసి తమ ముందుగా సాగిపోతూన్న వ్యక్తులలో ఒక యువతిని తదేకంగా చూడసాగాడు మధుసూదన్. అతని చూపుల్లో విస్మయం కుతూహలం కొట్టవచ్చినట్టు కన్పించాయి. వెళ్ళిపోతూన్న ఆ యువతి కూడా క్షణం కాలం మధుసూదన్ కేసి చూసి చూపులతో తడబడి తల తిప్పుకొని సాగిపోయింది. ఆమె పోకడలో ఏదో నిర్లిప్తత — ఉదాసీనత వంటి భావం గోచరించింది. ఆమె కట్టిన చీర తెల్లదనంతో పోటీ పడలేని నురగరాశి మెలమెల్లగా సముద్రంలోకే జారిపోయింది. ఆమె చాలా దూరం నడిచి పోయినా ఒంటి మీద ఎర్రని బొట్టు చింత నిప్పులా మెరుస్తూనే ఉంది.

"ఆమె మీకు తెలుసా?" దృష్టి మళ్ళించుకుంటూన్న మధుసూదన్‌ని ఆశ్చర్యంగా అడిగింది శారద.

"తెలుసు."

"మిమ్మల్ని ఆమె కూడా ఎరుగునా?"

మధుసూదన్ నవ్వి అన్నాడు— "ఎందుకు ఎరగదు? ఆమె నాకు మేనమామ కూతురు సుధారాణి!"

"విస్తుపోయింది శారద — "మేనమామ కూతురు! అంటే. . . . మీకు మరదలే కదూ!"

"ఏం? ఆశ్చర్యంగా ఉందా?"

"కాదూ? మిమ్మల్ని పలకరించ లేదేం?"

"నేనూ పలకరించలేదుగా?"

"అదే అడుగుతున్నాను. మీరు బాగా గుర్తుపట్టి కూడా పిలవలేదేం?"

"గుర్తుపట్టటానికి అసలు మర్చిపోలేదుగా?"

"మరి?..." సంశయంతో ఆగి పోయిన శారద మొహంలోకి సూటిగా చూస్తూ అన్నాడు మధుసూదన్—

"జవాబు వివరంగా చెప్తే మీకో నవల తయారవుతుంది." శారద అర్థంగానట్టు చూసింది. మధుసూదన్ కొంతసేపు మౌనంగా ఉండి అన్నాడు— "మీ సంశయాన్ని తీర్చటం మంచిదే శారదా! నా స్వంత విషయాలన్నీ మీకు తెలుస్తాయి. మా కుటుంబంలోని వ్యక్తులంతా మీకు పరిచయమవుతారు. మీరు స్నేహం చేస్తూన్న నేను కూలంకషంగా అర్థమవుతాను. సుధా నేనూ మాట్లాడుకోక పోవటానికి కారణాలున్నాయి. అవేమిటో మీకు తెలియాలి."

శారద మాట్లాడలేదు. సూటిగా తదేకంగా కంగా మధుసూదన్ మొహంలోకి చూడసాగింది.

"అప్పుడు నాకు ఏడు సంవత్సరాల వయస్సు ఉంటుంది. ఒక రోజు సాయంత్రం. . ." ప్రారంభించాడు మధుసూదన్— "ఒక రోజు సాయంత్రం— నేను పరిగెత్తుకొంటూ బడి నుంచి ముందు వచ్చేశాను ఇంటికి— రాగానే మా అమ్మ నన్ను దగ్గరికి తీసుకుని బుగ్గల మీదనే ముద్దులు పెట్టుకొంటూ అంది— "నీకు పెళ్ళాం పుట్టిందిరా నాన్నా!" పదేపదే ఆ మాట చెప్పింది. నాకేమిటో అర్థం కాలేదు. అంతలో మా అన్నయ్య వచ్చాడు అమ్మ వాడికి కూడా మళ్ళా ఆ మాటే చెప్పింది. . ."

* * *

సుమారు నెలరోజుల తర్వాత. . . .

శారదాదేవి ఒక పుస్తకాల కట్ట మధుసూదన్‌కు అందిస్తూ అంది— "నేను కొత్త నవల రాశాను, చూడండి. కాని నవల అసంపూర్తిగానే ఉండిపోయింది. ముగింపు మీరే చెయ్యాలి."

మధుసూదన్ ఆశ్చర్యంగా అన్నాడు — "అందుకేనా ఇన్నాళ్ళూ మీరంతా బిజీగా కన్పించారు? ఈ విషయం మాట మాత్రమైనా చెప్పలేదేం?

చేతిలో పుస్తకాల కేసి చూస్తూ అన్నాడు—" ముగింపు నేను చెప్పాలా ? అయితే నవల నేనే రాసి పట్టు పేరు పెట్టుకుంటాను."

శారద నవ్వింది— "ఈ నవలకు మీ పేరు పెట్టుకుంటానంటే అసమంజసమేమీ కాదులెండి. అంతకంటే నాకేమి అక్కర్లేదు. తొందరగా చదివి మీ అభిప్రాయాలు చెప్తారుగా ?"

* * *

"మధూ ! నీకు పెళ్లాం పుట్టిందిరా నాన్నా!" సంతోషంతో కల్యాణి బడినుంచి పరిగెత్తుకు వచ్చిన చిన్న కొడుకుని దగ్గరికి తీసుకొని వాడి లేత బుగ్గల మీద ముద్దుల వర్షం కురిపించింది. తల్లి ప్రవర్తన అర్థంగాని మధు అయోమయంగా చూస్తూ నిలబడి పోయాడు. కల్యాణి హృదయం నుంచి తెరలు తెరలుగా పొంగి వస్తూన్న ఆనందాన్ని అణచుకో లేక తిరిగే కొడుకుని హృదయానికి హత్తుకొని రేగిన జుట్టు సరి జేస్తూ— "అలా చూస్తావేంరా ? నీకు పెళ్లాం పుట్టిందట. పెద్ద మామయ్య ఉత్తరం రాశాడు.' అంది. ఏడేళ్ల మధు అప్పటికేదో అర్థమైన వాడిలా సిగ్గుగా అమ్మ కుచ్చెళ్లలో మొహం దాచు కున్నాడు.

మధు వెనకవచ్చిన సూర్యాన్ని— పెద్ద కొడుకుని చూడగానే నవ్వుతూ మరోకసారి అంది కల్యాణి— "చిన్న మామయ్యకు కూతురు పుట్టిందట్రా సూర్యం ! తాతగారి వూరి నుంచి ఉత్తరం వచ్చింది. అదే తమ్ముడి పెళ్లాం."

అప్పటికే తేరుకో గలిగిన మధు తెలిసీ తెలీని వూహతో ఆసక్తిగా అడిగాడు— "మరి అన్నయ్యకి.... ?" కల్యాణి నవ్వింది— "గడుసు వెధవా ! అన్నయ్యకూ ఉంటుందిరా ఎక్కడో ?"

సూర్యం అదేం పట్టించుకునే విధంగా లేడు. చిరాగ్గా అన్నాడు— "వీడు బళ్లో చాలా అల్లరి చేస్తున్నాడమ్మా ! మేష్టారు నీతో చెప్పమన్నారు.

కల్యాణి విస్మయంగా చూసి మధుని అడిగింది—

"మళ్లా బళ్లో అల్లరి చేశావా మధూ ?"

"లేదమ్మా ! నా పలకేమో గోపీగాడు దాచేసు కున్నాడు. అడిగినా ఇవ్వలేదని వాణ్ణి కొట్టి లాక్కున్నాను. అల్లరి చేస్తున్నానని మేష్టారితో చెప్తారమ్మా !" ఎంత న్యాయమో చూడమ్మా ! అన్నట్టు చూశాడు మధు. అన్యాయంగా తన మీద నేరం ఆరోపించారన్న బాధ మధు మాటల్లో స్పష్టంగా ధ్వనించింది.

కల్యాణి అడిగింది— "మరి నీ పలకేమైంది ? గోపీ ఇచ్చేశాడా ?"

"ఇద్దరూ లాక్కుంటుంటే కింద పడి బద్దలైంది. ఆ పగిలిన పలక మేష్టారు వీడికే ఇప్పించే శారు." సూర్యం జవాబు చెప్పాడు.

"మళ్లా పలక పగిలిందా ? అయ్యో రామా ! ఈ సంవత్సరంలో అప్పుడే పదకొండు పలకలు ఇంత చిలిపి తనమైతే ఎలాగురా మధూ నీతో ?"

కల్యాణి కోపంగా చూసింది— మధూ బిక్క మొహం వేసుకున్నాడు. పలక సంగతి పట్టించుకోకుండా అన్నాడు— "నన్ను మాష్టారు కొట్టారమ్మా ?"

"మరి నువ్వు గోపీగాణ్ణెందుకు కొట్టావ్ ?"

"వాడు నా పలకెందుకు తియ్యాలి ?" అరిచాడు మధు.

"అయితే మేష్టారికి చెప్పాలిగానీ నువ్వే కొడతావా ?" కంఠం పెద్దది చేసింది కల్యాణి. మధూకి కోపం వచ్చేసింది— "వాడు మేష్టారికి చెప్పే నా పలక తీశాడా ఏమిటి ? నా పలక ఎవరు దాచేసుకున్నా నేనేం అనకూడదేం పాపం ?" ఇదెక్కడి న్యాయమన్నట్టు చూస్తూన్న కొడుక్కి అర్థమయ్యే విధంగా చెప్పాలన్న ఉద్దేశ్యంతో అనునయంగా అంది కల్యాణి—

"గోపీ చేసింది తప్పే అనుకో, బళ్లో ఎవరు తప్పు చేసినా దండించటానికి మేష్టారు ఉన్నారుగా మరి. ఒక్కచోట కలిసి కట్టుగా చదువుకోవాల్సిన పిల్లలంతా ఏవో కజ్జాలు పెట్టుకొని దెబ్బలాడుకొంటూంటే బావుంటుందేమో నువ్వే చెప్పు."

మధూ మాట్లాడలేదు.

"చివరికి మేష్టారు నీ పలక నీకు ఇప్పించే శారు కదూ ? నువ్వు గోపీ దగ్గర లాక్కోకుండా ముందే మేష్టారికి చెప్పి ఉంటే నీ పలక పగిలేది కూడా కాదు. బళ్లో ఏం జరిగినా పిల్లలంతా మేష్టారికే చెప్పాలి."

అందమైన అమ్మాయి : పెళ్లి చేసికోమని నన్ను ఇంతవరకు ఒక లక్ష సార్లైనా అడిగి వుంటారు.

అబ్బాయి : ఇంతకీ, ఆ అడిగిన వాళ్లెవరు.

అమ్మాయి : ఇంకెవరూ ! మా అమ్మా, నాన్నే.

రవిబాబు (విజయవాడ)

అప్పటికీ మధూ మాట్లాడలేదు. కల్యాణి కొడుకు చేతిని తన చేతుల్లోకి తీసుకొని నిమురుతూ అడిగింది— "మేష్టారు బాగా కొట్టారా నాన్నా ! నొప్పి పెడుతోందా ?"

మధూ తల్లి చేతులు విసిరి కొడుతూ— "నాకేం నొప్పి పెట్టలా, ఆ గోపీగాణ్ణే బాగా కొట్టారు." అన్నాడు కసిగా.

"అయ్యో పాపం ! తెలిసో తెలీకో చేశాడు. మేష్టారు బాగా కొట్టారా ఏమిటి ?"— కల్యాణి నొచ్చుకొంది సానుభూతిగా.

"లేదమ్మా ! భయ పెట్టటానికి చిన్నచిన్న దెబ్బలు వేశారంతే. ఎవర్నీ గట్టిగా కొట్టలేదు." అంటూన్న సూర్యం మీద విరుచుకు పడ్డాడు మధు: "పూం చిన్నచిన్న దెబ్బలేం కాదు. ఘట్టిగానే కొట్టారు. ఎంత నొప్పి పెడుతోందో నీకేం తెలుసునేమిటి పాపం ?"

"ఇప్పుడేకాదుట్రా నొప్పేం లేదన్నావ్ ?" నవ్వింది కల్యాణి— "చిన్నదో పెద్దదో దెబ్బంటూ కొడితే నొప్పి పెట్టదూ సూర్యం ? కాస్త తమ్ముణ్ణి కనిపెట్టుకు ఉండమని నీకు నేను చెప్పలేదూ ?" అంటూ పెద్ద కొడుకుని మందలించింది. సూర్యం నిస్సహాయుడిలా అన్నాడు— "నువ్వు ఇలాగే చెప్తావ్ ! వీడేమో నా మాట ఎప్పుడూ వినడు."

"అన్నయ్య సరిగ్గా చెప్పడమ్మా !" వెంటనే అనేశాడు మధు— "ఎవరేం చేసినా మనం ఏమీ అనకూడదంటాడు. ఎందుకమ్మా మనం అలా వూరుకోవాలి ?"

మధూని దగ్గరికి తీసుకొని గడ్డం పట్టి చిన్నారి కళ్లలోకి చూస్తూ అడిగింది కల్యాణి— "అన్నయ్య నీకన్నా పెద్దవాడు. నీలా తొందర పడడు. అందుకే వాడు చెప్పినట్టు నువ్వు వినాలి. బుద్ధిగా చదువుకొని మీరిద్దరూ మంచిపేరు తెచ్చుకోవాలి. తెలిసిందా ?" మధు సిగ్గు పడ్డ వాడిలా తల్లిని కావించుకున్నాడు.

పేక కట్టలు భోషాణం మీదికి విసిరేసి చావిట్లోంచి నవ్వుతూ వచ్చారు జగన్నాథంగారు— "కొడుకుల కేమిటో నీతులు నూరిపోస్తున్నావ్ ?"

నవ్వింది కల్యాణి— "కట్టుకున్న వారికి చెప్పుకో లేక పోయినా కన్నవాళ్ళకైనా చెప్పలేనంటారా ఏమిటి ?"

"ఎంత మాట ! నీ కొడుకులకేం చెప్పుకుంటావో నీ ఇష్టం. నాదేముంది మధ్య ?"

"మీరు మాత్రం వినసంటారు. అంతేనా ?"

జగన్నాథం గారు నవ్వారు. ఆ నవ్వు కల్యాణికి కాపురానికి వచ్చిన దగ్గర్నుంచీ అనుభవమైనదే. జవాబు ఇవ్వటానికి అవకాశం లేనప్పుడూ ఇష్టం లేనప్పుడూ ఆయన అలా నవ్వి తప్పించుకుంటారు. కచ్చేరీ చావిళ్ళలో పేకాటలూ— రచ్చ బండలమీది ప్రగల్భాలూ— సాటివారితో మాట పట్టింపులూ— వూరి పొలిమేరల్లో కోడి పందేలూ భట్రాజులకూ, బైరాగులకూ దానధర్మాలూ— ఇత్యాది లక్షణాల నన్నిటినీ కొంతవరకైనా అరికట్టాలని తహతహ లాడిన కల్యాణి ఒక నాటికి భర్త లౌక్యంగా నవ్వే నవ్వుకు తలదించటం నేర్చుకొంది. ఆయన సరదాలు ఆయనవి. కాదని కష్ట పెట్టుకొని తను చేయగలిగింది ఏముంది ? కల్యాణి తనను తను వోదార్చుకోక తప్పలేదు. అంత మాత్రాన భర్త పట్ల ఏర్పడిన ప్రేమాభిమానాలు ఏ విధంగానూ సడలి పోలేదు కల్యాణిలో.

చటుక్కున గుర్తువచ్చినట్టు అంది కల్యాణి. "అన్నట్టు చెప్పడం మర్చే పోయాను, మీకు కోడలు పుట్టిందట. మా అన్నయ్య ఉత్తరం రాశాడు."

"నిజంగానా ?" జగన్నాథం గారికి కూడా సంతోషం కలిగింది— "ఇకనేం ? నీ మనస్సు వల్లబడిందిగా ? అత్తా కోడళ్లు కలిస్తే...."

"మీకు ఏ పూటా వస్తే ! అంతేనా ?"

"మాకేం ఖర్మ ? అత్తా కోడళ్లిద్దరూ కీచులాడుకొని ఆ పస్తులేవో మీరే ఉంటారు."

జగన్నాథంగారు చొక్కా విప్పి దండెం మీద వడేసి దొడ్డివేపుకు వెళ్లారు. పిల్లల్ని తీసుకు కల్యాణి వంటింట్లోకి నడిచింది.

పుట్టింటి నుంచి ఉత్తరం వచ్చింది మొదలూ కల్యాణి ఆనందానికి అంతు లేకుండా పోయింది. ఎంత శుభవార్త అందింది ! దాని కోసం తను ఎన్ని సంవత్సరాలుగా ఎదురు చూసింది !

కల్యాణి పెద్ద అన్నగారైన విశ్వనాథానికి పిల్లలూ లేరు. ఇక పుట్టే ఆశకూడా లేదు. భార్య పార్వతికి గర్భకోశంలో ఏదో వ్యాధి ప్రారంభమై ప్రాణాల మీదికి వస్తే సంతానం మీద ఆశ చంపుకొని బిడ్డలు కలగని విధంగా.... ఆపరేషన్ చేయించి భార్యను బ్రతికించుకోవలసి వచ్చింది. కల్యాణి చిన్న అన్న సీతాపతికి నలుగురైదుగురు పిల్లలు పోయిన మీదట మధు ఈడు వాడైన క్రిష్ణుడు బ్రతికి ఉన్నాడు. ఆ తర్వాత ఆడపిల్ల పుట్టక అందరికీ ఆనందం కల్గించింది ప్రస్తుతం.

స్త్రీకి పుట్టింటి అభిమానం సహజమే! కాని కల్యాణిలో ఆ ఆశానురాగాలు అత్యధికం, అన్నలతో తను వియ్యం పొందలేక పోతాననీ, క్రమేపీ పిన్నవాళ్ళ బంధుత్వాలు మర్చిపోతారనీ బాధ పడుతూ ఉంటుంది. చిన్న అన్నయ్యకు గానీ తనకు గానీ ఆడపిల్లలు పుట్టకపోతే కాలం గడిచిన కొద్దీ ఏ విధంగానూ ఈ అభిమానాలూ, అనురాగాలూ నిలవవు. పరాయి పిల్ల లెవరో తన కోడళ్ళవుతారు. అన్నయ్యా అలాగే ఎక్కడి వాళ్ళతోనో చుట్టరికాలు కలుపుకుంటాడు — ఆ వూహ కల్యాణిని మరీ బాధిస్తుంది.

చిన్న వదిన సావిత్రి కడుపుతో ఉందని తెలిసినప్పటి నుంచీ కల్యాణిలో వాడిపోయిన ఆశాలత తిరిగి చిగర్చి సాగింది. ఆ లతకు చిన్న పూవు కూడా పూసింది. కల్యాణికి కోడలు పుట్టింది. ఎంత సంతోష వార్త! ఆనందంతో వెర్రిదై పోయిన కల్యాణి నిండు నెలలతో ఉన్నా చిన్నపిల్లలా ఇల్లంతా కలియ దిరిగింది. ఎంతటెంతట ఈ సంతోషవార్త తన వాళ్ళతో చెప్పివేద్దామా అని ఆరాటంతో వేగిపోయింది. సాయంత్రం బడి నుంచి రావలసిన పిల్లల కోసం మధ్యాహ్నం నుంచే ఎదురు చూస్తూ విసుక్కొంది. సుఖ దుఃఖాలు పట్టించుకోకుండా వూరు మీద బలాదూరు తిరిగే భర్త మీద కోపగించుకొంది. మనసు నిలవని సంతోష వార్తను ఎంతసేపు ఆపి ఉంచుకోగలదు? చెప్పివేద్దామంటే ఎవరు ఉన్నారు?

పరిగెత్తుకు వచ్చిన చిన్న కొడుకుని కౌగలించుకొని— "నీకు పెళ్ళాం పుట్టిందిరా నాన్నా!" అనెయ్యటంతో గాని కల్యాణి హృదయ భారం తగ్గలేదు. తీరా ఆ వార్త కాస్తా భర్తకూ పిల్లలకూ అందజేసి తన సంతోషం అందరికీ పంచిపెట్టాక మరో చింత పట్టుకొంది కల్యాణిని— కోడల్ని చూడాలనే కోరిక చిన్న విత్తనంలా మొలకెత్తి నిముష నిముషానికీ పెరిగి పోయి ఇంతై అంతై మహా వృక్షమై కూర్చుంది. కాని ప్రస్తుత పరిస్థితిలో తను ప్రయాణం చేస్తానంటే భర్త ఎంత మాత్రం ఒప్పుకోడు. వారం రోజుల క్రితం తోటి ఆడవాళ్ళతో దేవుడి ఉత్సవాలకు వెళ్తానని సరదాపడితేనే ఆయన ఒప్పుకోలేదు. మరి. . . ?

జగన్నాథం గారు కొడుకులతో హుషారుగా కబుర్లు చెప్తూ అల్పాహారం ఆరగిస్తూన్న సమయంలో ధైర్యం చేసి అనేసింది కల్యాణి— "మధు పెళ్ళాన్ని చూసుకుంటాడట. వూరు వెళ్దామంటున్నాడు." భయం భయంగా ఆ రెండు మాటలూ అనేసి ఏదో సర్దటంలో నిమగ్నమై పోయింది.

జగన్నాథంగారు నవ్వుతూ మధూ బుజం మీద చేయివేసి అన్నారు— "ఏం నాన్నా? మీ ఆవిడ్ని చూసుకుంటావా?"

# కూలిన గోడలు

"ఛీ! నా కేం వద్దు."

"తప్పు వెధవా! అలా అనకూడదు. నాన్నను బండి కట్టించమను. తాతగారి వూరు వెళ్దాం." మందలిస్తూ కొడుకుని ప్రయాణానికి ప్రోత్సహించింది కల్యాణి సాలోచనగా.

"నిజంగా తాతగారి వూరు వెళ్దామా అమ్మా?" సూర్యానికి కూడా సరదా వేసింది. తాతగారి వూరు వెళ్తే తోటలో ఎన్ని గంటలైనా ఆడుకోవచ్చు. చక్కగా తాతయ్య అమ్మమ్మా ఎన్నో డబ్బులవీ ఇస్తారు. అత్తలూ మామయ్యలూ చక్కగా మాట్లాడుతారు.

"నాన్నని అడగండి" అన్నట్టు కొడుకులకు సైగ జేస్తూన్న కల్యాణి జగన్నాథం గారికి పట్టుబడి పోయింది— "నీకేం మతి పోయిందేమిటి?" తీవ్రంగానే అన్నారాయన— "నిండు నెలలతో ఉండి ఈ స్థితిలో బండి ప్రయాణమా?" కాస్త ఆశ్చర్యంగా కూడా వెల్లడించారు. కల్యాణి నవ్వుతూ దబాయించింది— "నిండు నెలలేం కాదు లెండి నాకన్నా మీకు తెలుసా ఏమిటి?"



ఒకడు : ఏమయ్యా! ఉప్పు అడిగితే పంచదార ఇస్తావేమిటి? నీకేమైనా చెముడొచ్చిందా ఈ మధ్య!

వర్తకుడు : అబ్బే అదేం కాదు లెండి! కంట్రోల్ సమయంలో ప్రజా సౌకర్యార్థం పంచదార పేరు ఉప్పుగా మార్చాం. అంతే!

మాధవ్ (తెనాలి)



"అయితే ఇప్పుడు వెళ్తానంటావు. అవునా?"

"నాకు పాపని చూడాలని ఉంది." నసిగింది.

"మరేం ఫర్వాలేదు. చూసే కాలం చాలా ఉంది."

కల్యాణి మౌనం వహించింది.

"నీకు ఎంత తోస్తే అంతే కదూ? వెనకా ముందూ ఆలోచించకుండా ప్రయాణానికి సిద్ధమై పోయావ్" కల్యాణికి ఉక్రోషం వచ్చేసింది— "సింగినాదం ఆలోచించాలి. మీ పెళ్ళాం ఒక్కతే గానీ మరే ఆడదీ ప్రయాణాలు చెయ్యటం లేదు. పిల్లల్ని కనటంలేదు."

భార్య కోపం చూస్తూ జగన్నాథం గారు నవ్వారు.

"ఇక పురుడు వస్తే ఎలా వెళ్తాను? వదిన మాత్రం చంటిదాన్ని తీసుకుని ఎలా వస్తుంది?" కల్యాణి గొంతు తగ్గించి అనునయంగా అంది— "రెండు రోజుల్లో జాగ్రత్తగా తిరిగి రానా ఏమిటి? ఎలాగూ మా అమ్మని కూడా పురిటికి తీసుకు రావాలిగా?" సంవత్సరాల తరబడి కల్యాణి కోరిక ఎరిగి ఉన్న జగన్నాథం గారికి కల్యాణిని పంపించాలని కూడా లేకపోలేదు. కాని నిండు చూలాలు గతుకుల దారిలో ఎద్దుబండి మీద ప్రయాణం చేయటం ఏమంత సమంజసం?

"నీకు తెలీదులే. నా మాట విను. తర్వాత ఏం జరిగినా మనమే సవరిస్తాం?" జగన్నాథం గారు తమ ఉద్దేశం దృఢం చేసుకొంటూ భార్యకు నచ్చ చెప్ప బోయారు. భర్త ధోరణి కనిపెట్టిన కల్యాణికి బాగా ధైర్యం వచ్చింది.

"నా మాట మీరూ వినాలి మరి. నేనేం తొలిచూలు దాన్నా ఏమిటి? ఆ బరువు భారాలు నాకు తెలీవా? జాగ్రత్తగా వెళ్లి వచ్చేస్తాను. కాకపోతే మీరూ రండి. అందరం చూసి వచ్చేద్దాం."

"సరే చూద్దాంలే." అయిష్టంగానే అన్నారాయన లేస్తూ. "ఇంకా ఎప్పుడు చూసేది? తెల్లారిగట్ల బండి కట్టమని వెంకన్నతో చెప్తాను." అంది కల్యాణి జబర్దస్తీగా. అంత సరదా పడుతూన్న కల్యాణిని వారించటం ఇక ఇష్టంలేక పోయింది జగన్నాథం గారికి.

కల్యాణి చటుక్కున గుర్తు వచ్చి అంది— "పాత ధాన్యం ఉంది కదూ? ఓ బస్తా తీయించండి. వదినకు పథ్యానికి పనికి వస్తుంది."

జగన్నాథంగారు తలుపు మీది తుండుతో చేతులు తుడుచుకుంటూ అన్నారు— "సరి! ఇంకా?"

కల్యాణికి కోపం వచ్చింది— "ఆఁ ఇంకా ఇంకా తీసుకెళ్తాను. ఏం? ఎక్కడెక్కడి వాళ్ళకూ ధారపొయ్యటం లేదూ మీరు? వాళ్ళంతా మీ మీ చుట్టాలా ఏమిటి?"

జగన్నాథం గారు నవ్వారు— "అబ్బ! తిని చెడుదూ? నా సొమ్ము ఎంత మంది తినలేదు గనకా?"

కల్యాణి కస్సుమంది— "అదిగో. ఆ మాటే అనొద్దంటాను. మీ సొమ్ము మా వాళ్ళెప్పుడు తిన్నారు?"

"చేరవేసేది చేరవేస్తూనే సిగ్గులేక నన్ను దబాయిస్తావు దేనికే? అయినా నేనేం అత్తనా? ఆడబిడ్డనా? నిన్ను నిలవదియ్యటానికి?"

"ఆహా! అత్తా ఆడబిడ్డా మాత్రం ఏమిటడుగుతారా? మా వాళ్ళంతా మీ పెట్టుపోతల మీదే బ్రతుకుతున్నారా ఏం ఖర్మ?"

జగన్నాథంగారికి ఓటమిని అంగీకరించక తప్పలేదు— "నీతో నేను దెబ్బలాడలేనే పిల్లా! మీ వాళ్ళు నీకు సారె పెట్టారో లేదో గాని నోరు మాత్రం ఇచ్చారు."

జగన్నాథంగారితో పాటు కల్యాణి కూడా నవ్వేసింది. "అలా వీధిలోకి వెళ్దాం. వస్తావురా సూర్యం?" అనటంతో "నేనూ వస్తాను." అంటూ మధూ కూడా తయారయ్యాడు తండ్రితో. పిల్లల్ని తీసుకుని బయటికి వెళ్ళబోతూ ఆగి భార్యకేసి చూశారాయన— "మాటల మధ్య మొగుణ్ణి మర్చిపోయిందట వెనకటికెవతే. ప్రయాణం సందట్లో మమ్మల్ని కాస్తా మర్చిపోకు సుమా!" అంటూ నవ్వారు.

"అయ్యో రామా! మర్చిపోవాలంటే మాత్రం మీరు మరుపు వస్తారా ఏమిటి? మీకూ మీ కొడుకులకూ భోజనాలు తయారు చెయ్యాలిగా? ఆ పని మీదే లేస్తున్నాను." కల్యాణి వీధి గుమ్మంలో కాస్సేపు నిలబడి పుట్టింటికి తీసుకు వెళ్ళాల్సిన సరుకులు మూటలు కట్టేందుకు హడావిడిగా లోపలికి వెళ్ళిపోయింది. (సశేషం)

మీ కృషియే దేశానికి సౌభాగ్యం

మీ పొదుపే రక్షణనిధికి మదుపు

| మి | మే | వృ | మి |
|---|---|---|---|
| చం | ర కు<br>బు గు | | శు రా |
| క | వారఫలం | | |
| | | | |
| కే | | | |

మ హే ష్

**8-5-1964 శుక్రవారము మొదలు 14-5-1964 గురువారము వరకు**

## మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రజల దృష్టిలో మీకు ఇది యోగవంతమైన సమయమే కాని మీకు మాత్రం అన్ని వ్యవహారాల్లోను చికాకులు, అనిశ్చిత పరిస్థితి కన్పిస్తుంటాయి. వృత్తి వ్యాపారాల్లో ఒత్తిడి, హడావుడి ఉంటాయి కాని ఆదాయం పెరగదు. ఎక్కువ వ్యయప్రయాసలతో కూడుకొన్న వ్యాపారాలు ప్రారంభించడం మంచిదికాదు. వారాంతంలో తక్కువస్థాయి వారివల్ల ధనలాభం కలుగుతుంది. వెంటనే ప్రయోజనంలేని ఖర్చు చేయడంవలన డబ్బుకు కొంత యిబ్బంది రావచ్చును. ఆరోగ్యం గతవారం వలెనే ఉంటుంది. అనారోగ్య సూచనలు ఇంకా ఉన్నాయి. కుటుంబంలోను శుభకార్యాల విషయంలో ఇంకా ఒక నిర్ణయానికి రాలేరు. బంధువుల వ్యవహారాల్లో జోక్యం చేసుకొనడంవల్ల శ్రమా, నిష్ఠూరమూ తప్ప మంచి ఉండదు. విద్యారంగంలో మీ కృషి రాణిస్తుంది.

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2పా.)

ఈ వారం కూడా గతవారం వలెనే ఉంటుంది. విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి అవకాశం లేదు. వృత్తి వ్యాపారాల్లో మీకు సంబంధంలేని చిక్కులు వచ్చి కొంత ఆందోళన కలిగిస్తాయి కాని నష్టం కలుగుటకు అవకాశంలేదు. రాబోయే డబ్బును గాని, సహాయాన్ని గాని, వూహించి వాగ్దానాలు చేయడం మంచిదికాదు. ఉద్యోగంలో కొంత శ్రమ పెరిగినా అనుకూలత కూడా ఉంటుంది. ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడానికి వీల్లేదు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. స్వల్పంగా జరిగిపోయే విషయాలకు కూడా విశేషంగా ఖర్చు చేస్తారు. రాజకీయాల్లో ప్రతిపక్షాల సంచలనం ఎక్కువ. అవుతుంది. కాని దానివల్ల ముమ్ముందు మీకు ప్రయోజనం ఉంటుంది. మీ ఆలోచనలు మీ వ్యవహారాల్లో కంటే యితరులకు సలహా రూపంలో బాగా తోడ్పడతాయి.

## మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర పునర్వసు 1, 2, 3 పా.)

ఈ వారం గత కొద్ది వారాలకంటె బాగా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఇదివరకు ప్రయత్నంచేసి విడిచిపెట్టిన పనులు కూడా ఇప్పుడు నెరవేరుతాయి. కేవలం మీ పనులే కాకుండా, ఇతరుల పనులు కూడా చూడవలసి వచ్చుటచే శ్రమ పెరుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగస్థులకు వెంటనే ప్రయోజనం లేకపోయినా భవిష్యదభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కొంతమంది బంధువుల మూలంగా కుటుంబంలో భేదాభిప్రాయాలు రావడంవలన కొన్ని కార్యక్రమాలు నిలిచిపోవచ్చును. అలంకార వస్తువులను కొంటారు. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో మీ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. పునర్వసూ నక్షత్ర జాతకులకు మిగిలినవారి కంటే బాగా ఉంటుంది.

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

పదిమందిచేతా ఓహో అనిపించుకోవడం జరుగుతుంది. కాని దానివల్ల మీకు ఒరిగేదేమీ ఉండదు. వృత్తి వ్యాపారాలలో పలుకుబడి పెరుగుతుంది కాని ఆర్థికంగా ఎక్కువ ప్రయోజనం ఉండదు. సామాన్యంగా జరిగిపోయే పనులకు కూడా ఎంతో ప్రయాసపడవలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు చేయడం మంచిది కాదు. వృత్తి రీత్యా చేయవలసిన ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ఉద్యోగస్థులకు ఈ వారం గత వారం కంటే బాగా ఉంటుంది. తమ అభిప్రాయాలు అమలుపరచడానికి అవకాశం లభిస్తుంది. కుటుంబ వ్యవహారాలు మామూలుగానే ఉంటాయి. పెద్ద మార్పులు ఏమీ రావు. సంతానానికి సౌఖ్యం, సంతోషం లభిస్తాయి. స్త్రీ మూలంగా కలహ ప్రసంగం రావచ్చును. 12, 13 తేదీల్లో సంతోషం. అధికాదాయం.

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం కొంత కార్యభారం పెరిగినా మొత్తంమీద సంతృప్తికరంగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పనులు చురుకుగా జరిగి తద్వారా కొంత లాభిస్తుంది. వ్యాపారంలో పోటీ పెరగగల సూచనలు ఉన్నాయి. వృత్తిరీత్యా కొత్తవారితో పరిచయం కలుగుతుంది. దానివల్ల ప్రయోజనం ఉంటుంది. ఉద్యోగస్థులకు ఈవారం సామాన్యంగా ఉంటుంది. ఆర్థికంగా జరిగిపోయిన వారాలలో ఉన్న ఒత్తిడి తగ్గిపోతుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది గాని, వార ప్రారంభంలోనే స్వల్ప అనారోగ్య సూచనలు ఉన్నాయి. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో కొత్త సమస్యలు రావచ్చు. సాంఘిక వ్యవహారాల్లో బాధ్యత పెరుగుతుంది. బంధువుల విషయంలో మీరు ఎంత కృషిచేసినా, నిష్ఠూరం వచ్చే పరిస్థితి ఏర్పడుతుంది.

### — ఈ వారము ధరలు —

ధాన్యం ధరలో కొంచెం మాంద్యం ఏర్పడుతుంది. అపరాల ధరలు కొంచెం హెచ్చి తరువాత తగ్గుతాయి. బెల్లం ధర కొంత పెరగవచ్చును. నూనె, నువ్వుల ధరలు పెరుగుతాయి. మిర్చి ధర కొంచెం తగ్గి తరువాత పెరుగుతుంది. బట్టల ధరలు పెరగవచ్చును.

## కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త చిత్త 1, 2 పా.)

ఈ వారం కూడా మీరు అన్ని వ్యవహారాల్లోను చాలా జాగ్రత్తగా ఉండాలి. వృత్తి వ్యాపారాల్లో అనేక రకాలుగా ఒడుదుడుకులు ఏర్పడినా, ఆర్థికంగా నష్టం వచ్చుటకు అవకాశం లేదు. మీరు ఎదుటవారి యెడల ఎంత మంచిగా ప్రవర్తించినా అది చెడుగానే వారికి కన్పిస్తుంది. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రావడంవలన ముఖ్యమైన కార్యక్రమాలు నిలిచిపోవచ్చును. మీరు ఎంత తొందరపడినా నష్టం తప్ప కార్యసాధన జరుగదు. సాటివారు కొంతమంది పని గట్టుకొని వదంతులను ప్రచారం చేస్తుండుటవలన ఉద్యోగస్థులకు మనశ్శాంతి ఉండదు. ఆరోగ్యం కూడా బాగా ఉంటుందని చెప్పడానికి అవకాశం లేదు. కుటుంబ వ్యవహారాల్లో గందరగోళం తప్ప అభివృద్ధి ఉండదు. కోర్టు వ్యవహారాల్లో వ్యతిరేకత తగ్గవచ్చును. 10, 11 తేదీల్లో అశాంతి, ధన వ్యయం.

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

అన్ని వ్యవహారాలూ క్రమంగా చక్కబడుతూ ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో స్నేహితుల తోడ్పాటు లభిస్తుంది. కొన్ని వ్యవహారాల్లో మీకు ఇష్టంలేకపోయినా కార్యసిద్ధి కోసం, మీ ఆలోచనకు వ్యతిరేకంగా నటించవలసి వస్తుంది. వ్యాపారము సంతృప్తికరంగా ఉంటుంది. ఆదాయం స్వల్పముగా పెరగవచ్చును. రావలసిన డబ్బు అంది కూడా ఖర్చు పెరగడంవలన కొంచెం ఒత్తిడి రావచ్చును. వృత్తిలో ఇంతవరకు ఉన్న ఆందోళన తొలగిపోతుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో కొంత వరకు అనుకూలత లభిస్తుంది. ఆరోగ్యంబాగా ఉంటుంది గాని శ్రమ పొందవలసి వస్తుంది. కుటుంబ పరిస్థితి కూడా బాగా ఉంటుంది. బంధువులు తమ పనుల నిమిత్తం మీకు కొంత శ్రమ కలిగిస్తుంటారు. వినోద కార్యక్రమంలో పాల్గొంటారు. ప్రయాణం చేయువలసిరావచ్చును.

## వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం బాగా ఉంటుందని చెప్పవచ్చును. మీరు ఇంతవరకు చేసిన ఆలోచనలకు ఫలితం దక్కే సూచనలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో మీకు గల దూరదృష్టి, చాకచక్యము రుజువు

## మే-9

ఈ సంవత్సరం అన్ని రంగాల్లోను క్రమాభివృద్ధిని సాధిస్తారు ఎప్పుడూ పదిమందితో కలసి ఉండడంవలన మీ స్వంత పనులయందు తగిన శ్రద్ధ చూపడానికి వీలులేని పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తిలో కొంత పోటీ హెచ్చినా ఆదాయం కూడా పెరుగుతుంది సమయానికి డబ్బు అందుతూ ఉండడంవలన అన్ని వ్యవహారాలూ ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. భాగస్వాములతో కలసి కొత్త వ్యాపారాలు చేయడం మంచిదికాదు. స్థిరాస్తి వ్యవహారాల్లో కొన్ని మార్పులు రావచ్చును సంవత్సరం మధ్యలో ఇష్టంలేకపోయినా అనవసర వ్యయం చేయవలసి వస్తుంది ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు ఉష్ణాధిక్యత కలుగుతుంది బంధువులతో భేదాభిప్రాయాలు రావచ్చు విద్యారంగంలో మీ కృషికి ఆటంకాలు వస్తాయి విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కావచ్చును. ప్రేమ వ్యవహారాల్లో స్వల్ప అభివృద్ధి ఉంటుంది

## మే-10

అప్పుడప్పుడు కొన్ని ఒడుదుడుకులు వచ్చినా మొత్తంమీద ఈ సంవత్సరం బాగా ఉంటుందని చెప్పవచ్చును వృత్తి వ్యాపారాల్లో కొత్తవారితో పరిచయం తద్వారా లాభం కలుగుతాయి వ్యాపారం ఉత్సాహవంతంగా ఉంటుంది. కాని సంవత్సరాంతంలో చికాకులు రావచ్చును వృత్తిలో నూతన మార్గాలు లభించి ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు జరగవచ్చును. గృహ నిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది కుటుంబంలో పెద్దలతో కొన్ని భేదాభిప్రాయాలు రావచ్చును శుభమూలంగా ధన వ్యయం జరుగుతుంది రాజకీయాల్లో ప్రతిపక్షాలు బలహీనపడడం వలన మీ అభివృద్ధి మార్గం నిష్కంటకం అవుతుంది విద్యార్థులు కృతార్థులు కాగలరు. సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో అధికాదాయం.

## మే-11

అన్ని వ్యవహారాలూ అనుకూలంగా ఉన్నా మీకు విశ్రాంతి లభించదు ఏపనీ సులువుగా నెరవేరదు కాని ప్రయత్నం చేసిన తర్వాత వ్యర్థం కావడం ఉండదు సంవత్సర ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో కొన్ని మార్పులు రాగల సూచనలు ఉన్నాయి వ్యాపారస్థులకు అధికారులవలన జరుగవలసిన పనులు సులువుగా నెరవేరతాయి ఉద్యోగస్థులకు ఉన్నత స్థానములభించవచ్చును మీరు తీసికొన్న ముఖ్యమైన నిర్ణయాలు సరియైనవని రుజువు కావడంతో మీకు ఆత్మవిశ్వాసం, అధికారుల వలన గౌరవం లభిస్తాయి ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కలుగుతూ ఉంటుంది కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విద్యార్థులు మంచిమార్కులతో కృతార్థులు కాగలరు. కళాకారులకు మంచి సమయం నవంబరు, డిశంబరు నెలల్లో గౌరవం, మిత్ర సమాగమం.

## మే-12

ఈ సంవత్సరం ఘన విజయాలు ఏమీ మీరు సాధించలేకపోయినా నిరుత్సాహపడనక్కరలేదు. సంవత్సర ప్రారంభంలో సామాన్యంగా ఉంటుంది ఏ వ్యవహారములోను చెప్పుకోతగ్గ అనుకూలత ఉండదుకాని సంవత్సరాంతానికి బాగున్నదనే పరిస్థితి ఏర్పడుతుంది వృత్తి వ్యాపారాల్లో కొన్ని మార్పులు మీ ప్రయత్నం లేకుండా జరుగుతాయి వ్యాపారంలో తక్కువ స్థాయివారితో జరిపే వ్యవహారాల్లో లాభం కలుగుతుంది సాహసముతో కూడిన వ్యవహారాలుచేయడం మంచిదికాదు. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేసినా మొత్తంమీద ఆరోగ్యం బాగానే ఉంటుంది కుటుంబంలో శుభ కార్యాలు నెరవేరతాయి రాజకీయాల్లో పలుకుబడి పెరుగుతుంది వ్యయ ప్రయాసలతో కూడిన బాధ్యతలను నిర్వహించవలసి వస్తుంది విద్యార్థులు కృతార్థులు కాగల సూచనలు ఉన్నాయి. ప్రేమ వ్యవహారాల్లో కొన్ని చికాకులు రావచ్చును.

## మే-13

ఈ సంవత్సరం బాగా ఉంటుందని చెప్పవచ్చును. వృత్తి వ్యాపారాల్లో పెద్ద మార్పులు రావు. ఆదాయం స్వల్పంగా పెరగవచ్చును ఇదివరకు మీరు ప్రారంభించిన వ్యవహారాల్లో ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది భాగస్వాములతో జరిగే వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చినా పనులన్నీ జరిగి లాభం వస్తుంది వృత్తిలో చిన్న చిన్న మార్పులు వస్తాయి కొత్తవారితో పరిచయం ఏర్పడుతుంది సంవత్సరాంతంలో ప్రయాసతో కూడిన ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఉద్యోగస్థులకు సంవత్సర ప్రారంభంలో ప్రోత్సాహం లభిస్తుంది ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో వ్యయం పెరుగుతుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రజ్ఞ ప్రదర్శించడానికి అవకాశం లభిస్తుంది విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కాగలరు

## మే-14

ఈ సంవత్సరం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది ప్రతి వ్యవహారంలోను చికాకులు వస్తూ ఉంటాయి మీరు గత సంవత్సరం ప్రారంభించిన వ్యవహారాల్లో ధన నష్టం కూడా రాగల సూచనలు ఉన్నాయి వృత్తి వ్యాపారాల్లో చేయదలచిన మార్పులకు, నూతన వ్యాపారాలకు సంవత్సరాంతంవరకు ఆగడం మంచిది వ్యాపారంలో కొంతమంది పోటీదారులు మీకు వ్యతిరేకంగా ప్రచారం చేయడంవలన మీరు ఒక దారికి తెచ్చిన వ్యవహారాలు కూడా మొదటకు వచ్చే ప్రమాదం ఉంది. ఉద్యోగస్థులు అన్ని నిర్ణయాల్లో చాలా జాగ్రత్తగా ఆలోచించాలి మామూలుగా జరిగిపోయే చిన్న విషయాలకు కూడా తీవ్ర పరిణామాలు రావచ్చును ఆరోగ్యం బాగా ఉన్నా ఏదైనా ప్రమాదం జరుగవచ్చును కుటుంబ వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. విద్యార్థులు కృతార్థులు కాగలరు. 


7.95
7.95
ఆరామ్ 14.95
వేసంగిలో
సునాయాసంగా
నడవడానికి...
బాటా సాండల్సు, చెప్పులు స్టైలులో
ఏసీజనుకాసీజను మారుతూ మీకు
నచ్చేలాగు తేలిగ్గా, సదుపాయంగా
చేయబడుతున్నాయి. ఒకసారి తొడిగి
చూస్తే చేతలోని సదుపాయం, హాయి
తెలుస్తుంది. ఈ జోళ్లరక రకాల
స్టైల్సు మిమ్మల్నిట్టే ఆకర్షిస్తాయి.
మీకు నచ్చిన వాటిని బాగా సరిపో
యిన జోళ్లనే ఎంచుకో గలుగుతారు.
7.95
సితారా 9.95
Bata

# రామచరిత మానస్

తులసీదాసు



తెలుగు: ముంగర శంకరరాజు

## 30

### పరమేశ్వరుని ప్రశస్తి

బ్రహ్మేంద్రాదులు ప్రభువును అభినందించి వెళ్లినపిమ్మట జ్ఞానసంపన్నుడగు సదాశివుడు అల్లన ముకుళిత హస్తుడై శ్రీరాముని సమీపించి ఆనందవిభోరుడై మేను పులకరింప అవధేశునిట్లు నుతించెను —

"ఓ శరచాపధారీ! రఘుకులసోమా! రావణాంతకా! నీవు నీ భక్తులయందు నీ మహిమాన్వితమగు మేఘపటలమును ఉన్మూలించుటకు ప్రచండ పవనుడవు నిన్నుపాసించు సాధకులకున్న శంకలు దహించుటకు నీవు హుతాశనుడవు సగుణమూర్తివి. భ్రమాంధకారమును విచ్ఛిన్నముచేయు ఉదయ భాస్కరుడవు కామక్రోధాది మదగజములను మర్దించు మృగరాజువు ఈ భవసాగరమును మథించి తరించుటకు నీవు మదర గిరి వంటి వాడవు వాంఛా — వాసన రూపమగు వనజశ్రేణి పాలిటిహిమపాతమువలె నొప్పుచు ప్రణతార్తి హరా! నా శిష్యకోటి నీకు శ్రమకలిగించినందుకు నేను చేయెత్తి నమస్కరించుచున్నాను నన్ను మన్నించవలసినది

పరాత్పరా! గిరిజారంగకరా! మేఘశ్యామా రామా! నీవు సీతాలక్ష్మణ సమేతముగా సర్వదా నా హృదయ పీఠమలంకరించి నన్ననుగ్రహింపుము ఓ రామనృపాలా! అనతికాలములోనే అయోధ్యలో నయనానందకరముగా జరుగు నీ పట్టాభిషేక మహోత్సవ సందర్భమున మరొక్కమారు అక్కడకు వేంచేసి పునర్దర్శనము చేసుకొందును—"

శంకరుడట్లు నేక రీతుల కాకుత్స్థమణిని కీర్తించి కైలాసమున కేగెను

### ప్రయాణ సన్నాహము

"కరి వినతీ జబ శంభు సిధాయే,
తబ ప్రభు నికట విభీషణ ఆయే.
నాయి చరనసిర కహ మృదుబానీ,
వినయ సునహు ప్రభు సారంగపానీ"

నిటలాక్షుడట్లు నిష్క్రమించిన పిమ్మట, నిశాచరపతి విభీషణుడు పరమ వినీత భావముతో ప్రభువు చెంగట నిలిచి, పాదపద్మములకు ప్రణామముచేసి మృదు మధురోక్తుల ఇట్లు విన్నవించుకొనెను —

"ఓ శార్ఙ్గకోదండధరా! రఘువీరా! రావణుని సబాంధవముగ సంహరించి, దీనుడు దుర్బలుడగు ఈ దాసుని సంరక్షించితివి యశోధామా! నీ కీర్తిచంద్రికలు ముల్లోకముల వ్యాపించెను ధర్మజ్ఞా! తమపాద స్పర్శచే ఈ దాసుని గృహము పావనముజేసి, మదీయ సేవా పరిచర్యల సుంత విశ్రాంతినొంది, నన్ను ధన్యుని చేయవలసిందిగా వేడుకొనుచున్నాను దేవా! నా దేశకోశములాది సర్వ సంపదలు స్వకీయమైనవిగ భావించి వానిని వానరులకు పంచిపెట్టవలసినది ప్రభూ! నేను మిమ్మనుసరించి సాకేతపురికి వచ్చుటకై అనుమతి కోరుచున్నాను —"

అసురోత్తముని పరమ వినీత త్యాగశీలతకు ప్రభువు పరమానంద భరితుడై ప్రేమతో ఇట్లు ప్రవచించెను —"సోదరా! నీవు నిజమాడితివి నీ యభిమత ప్రకారము ఈ రాజ్య సంపదలన్నియు నాకు చెందినవే కానీ ప్రస్తుతము నా మనస్సు భరతాయత్తమై యున్నది కైకపుత్రుని స్థితి మనస్సుకు వచ్చినప్పుడు నాకు నిమేషమొక కల్పముగా గడచుచున్నది తాపసవేషమున సదా నన్ను స్మరించుచూ కృశగాత్రుడై యున్న భరత సోదరుని గాంచుటకై నా హృదయము కొట్టకొట్టలాడుచున్నది విభీషణా! వ్యవధి గతించినపిమ్మట భరతుడు బ్రతికియుండ చూడగల్గుట అసంభవము కాబట్టి ప్రస్తుతము నేను యథాశీఘ్రము అయోధ్య చేరుకొను ఉపాయము అన్వేషింపుము సఖా! రక్షోనాథా! నీవు నిరంతరము నా స్మరణ చేయుచూ ఒక కల్పాంతము రాజ్యమేలుకొనుము తదుపరి నీవు నా సాన్నిధ్యము పొందగలవు."

లంకాధిపుడా పలుకుల కమితానంద భరితుడై హుటాహుటి లంకకుపోయి సుమనోజ్ఞ పుష్పక విమానమును ధన కనక రత్న మణి దివ్య వస్త్రాద్యలంకార వస్తు సంపదతో నింపుకొని దాశరథి చెంతకు తెచ్చెను శ్రీరాముడా లవమూల్య వస్తురాశిని గాంచి ఒకింత మందహాసముచేసి— "విభీషణా! ఈ వస్తు సంపదను విమానమునుండి వానరానీకముపై వర్షింప జేయుము —" అని సెలవిచ్చెను విభీషణుడాప్రకారము పైనుండి వానర స్కంధావారమెల్లెడల వెదజల్లించెను వానర భల్లూకములు ఉత్సాహితులై యథేచ్ఛగా వానిని సంగ్రహించి సంతుష్టులైరి వానరులు చీనిచీనాంబరములను నానా విధముల ధరించి గంతులువేసిరి మణివజ్రములను వారు నోటితో కొరికి ఫలములు గావని తెలుసుకొని పారవేసిరి వారి వానర చేష్టలను చూచి రామాదులు కడుపుబ్బ నవ్వుకొని ఆనందించిరి. అవధేశుడాపిమ్మట అసంఖ్య వానర భల్లూకములను యథాయోగ్యముగ నానావిధ కానుకలచే సత్కరించి వారియెడల తన ప్రగాఢ ప్రేమానురాగము వ్యక్తముచేయుచూ — "ఓ వనచరోత్తములారా! నాకు మీరొనర్చిన సేవ అసామాన్యమైనది మీ సహాయమువలన నేను రావణుని సంహరించి విభీషణుని లంకాధిపతి చేయగలిగితిని. మీ సత్కృతీ సహాయములు చిరస్మరణీయములు ఇక మీరు మీ నిజ నివాసములు చేరుకొని నన్ను స్మరించుకొనుచు నిర్భయులై సంచరింపుడు —" అని ప్రవచించెను

సీతారామలక్ష్మణులను ఎడబాసి వెళ్ళుటకు వారికి కాళ్ళాడకపోయెను తుదకు వారు బాష్పలోచనములతో ప్రభువుకు ప్రదక్షిణాపూర్వక నమస్కారము లొనర్చి, హర్ష విషాద మనస్కులై బహు ప్రయత్నముతో గృహోన్ముఖులైరి కానీ సుగ్రీవుడు, జాంబవంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు, హనుమంతుడు మున్నగు ముఖ్యానుచరుల హృదయముల స్వామిని విడిచిపోవుటకు అంగీకరించలేదు వారు ప్రేమవశులై ఏమియునదిలేక నిశ్చలముగా తలలు వంచుకుని ఎక్కడి వారక్కడ నిలువబడి యుండిరి దాశరథి వారి విశుద్ధ ప్రేమానురాగమునకు ముగ్ధుడై సాదర వచనముల— "మిత్రులారా! మీరు నాతో విమానమెక్కి అయోధ్యకు రావలసినది —" అని కోరెను తదుపరి సీతారామలక్ష్మణులు విభీషణ సుగ్రీవాది ప్రముఖులతో పుష్పక మారోహించిరి విమానము త్వరితో వియత్తలమందుకొని ఉత్తరాభిముఖముగ పయనము సాగించెను

### తిరుగు ప్రయాణము

మేరు గిరిపై సురుపుతోనున్న మేఘమువలె సీతారాములు పుష్పకముపై శోభించిరి స్వామి సీతాసమేతముగా ప్రత్యావర్తనము చేసిన ఆ శుభ వేళ — అమరులు ఆకాశమునుండి వారిపై పుష్పములు వర్షించిరి చల్లని వాయువులు వీచెను గంగా సముద్రోదకము తేటపడెను సర్వత్ర శుభ సూచకములు గన్పట్టెను దిశభాగములు — తేజస్సుతో దీప్తినొందెను

అట్లు వారు విమానముతో లంకాతీరము వదలి ఉత్తరదిశగా ప్రయాణించునపుడు సాకేతనాథుడు సీతకు '— రాక్షసులతో యుద్ధముచేసిన రంగస్థలము, మేఘనాథుని లక్ష్మణుడు చంపిన చోటు, లంకాసింగరంగాలయ కాస్తతిప్పలుగాగా పడియున్న రాక్షసుల కళేబరములు, రావణ కుంభకర్ణులు నేల

కొరిగిన ప్రదేశము, నిరంతర తరంగా ఖిలమ్మై యొప్పుచున్న సముద్రము, సేతువు, రామలింగేశ్వరుని ప్రతిష్ఠించిన పుణ్యస్థలము, దండకారణ్యము, మునిజన పదములు "— మున్నగు వాటిని చూపించెను వారు దారి మధ్యలో అత్రి అగస్త్యాది మహర్షుల ఆశ్రమవాసములందు విమానము దిగి, మునీశ్వరుల దీవెలందుకుని తిరిగి ప్రయాణము సాగించిరి.

పుణ్య సలిల గంగాయమునలను గాంచినపుడు వైదేహి పరమ శ్రద్ధాభక్తితో వారికి నమస్కరించెను పుష్పకము అచ్చోటనుండి తిన్నగ తీర్థరాజ్ ప్రయాగ — త్రివేణి — సంగమస్థలమతిక్రమించి అయోధ్య సమీపించెను అనతి దూరమున అయోధ్య నగరి సాక్షాత్కరించగనే రామాదులు ప్రహృష్టమానసులై పట్టణమునకు ప్రణమిల్లిరి. పుష్పక సాకేతపురిని సందర్శించుకొని పునః త్రివేణితీరమునకు వచ్చి అక్కడ భూమిపై దిగెను. వారక్కడ త్రివేణి సలిలములందు స్నానమాడి ఒకింత సేదదేరిరి. శ్రీరాముడప్పుడు ఆంజనేయుని చేరబిలచి — మారుతీ! నీ ఒకింత ముందుగ అయోధ్యచేరుకుని భరతాదులకు మా క్షేమగమనాదులు తెలియజేసి రావలసినది — అని చెప్పి భరతుని యొద్దకు పంపెను.

సీతారాములు పునః విమానారూఢులై భరద్వాజుని ఆశ్రమము చేరుకొనిరి. వారచట మునీశ్వరుని ఆతిథ్యముచే బరితృప్తులై వారి ఆశీర్వాదము లందుకుని, అచ్చోటు వీడి భాగీరథీతీరమునకు పయనించిరి భూపుత్రి గంగా భవనానికి పరమ భక్తితో పూజలొనర్చి పుష్పాంజలి ఘటించెను. త్రిపథగ ప్రత్యక్షమ్మై వైదేహిని — సౌభాగ్యవతీభవయని ఆశీర్వదించెను.

సీతారాముల శుభాగమన వార్త తెలుసుకుని నిషాదపతి స్వజనసమేతముగా పరుగెత్తుకుని వచ్చి దేవదేవుని సందర్శించి తన్మయుడై అతని పాదపద్మములపై బడిపోయెను రామమూర్తి నిషాదపతిని రెండుచేతులతో లేవనెత్తి ప్రగాఢ ప్రేమతో హృదయమున చేర్చి, సోదరవచనముల అతని యోగ క్షేమములు విచారించెను. గుహుడు స్వామి తనపై చూపెట్టిన ప్రేమ వాత్సల్యములకు పరవశుడై భక్త్యంజలి ఘటించి "— ఓ సాకేతపతీ! బ్రహ్మమహేశాదులు సేవించు మీ పవిత్ర పాదపద్మములు సేవించుకుని మేము సబాంధవముగ పూర్ణకాములమ్మై సర్వ సుఖములు బొందగలిగితిమి జగన్నాథా! మీకివే మా శతశత నమస్కారములు —" అని పలికెను రామచంద్రమూర్తి నిషాదపతి నిశ్చలభక్తికి ముగ్ధుడై ప్రీతితో గుహుని భరత సోదరునివలె భావించి పలుమార్లు హృదయమునకు హత్తుకొని ఆనంద విభోరుడయ్యెను.

ఎవరు ప్రేమతో సాకేతనాథుని సమర విజయగాథ శ్రద్ధాభక్తితో పఠించదరో, వినెదరో వారికి పరమేశ్వరుడు విజయము వివేకము నిత్యసంపదల నొసంగుచుండును.

సమర విజయ రఘువీరకే
చరిత జేసునహి సుజాన్,
విజయ వివేక విభూతినిత
తిన్నహి దేహి భగవాన్
ఇతి శ్రీరామచరిత మానసే —
సకల కలికలుష విధ్వంసనే
విమల విజ్ఞాన సంపాదనో నామ
షష్ఠః సోపానః సమాప్తః.
(లంకాకాండము సమాప్తము)

## ఉ త్త ర కాం డ

కేకీ కంఠాభనీలం సురవర విలసద్విప్ర
పాదాబ్జ చిహ్నం,
శోభాఢ్యం పీతవస్త్రం సరసిజ నయనం,
సర్వదా సుప్రసన్నం,
పాణౌ నారాచ చాపం కపినికర యుతం
బంధునా సేవ్యమానం,
సౌమిత్ర్యం జానకీశం రఘువీర మనిశం
పుష్పకారూఢ రామం

పదునాలుగేండ్ల వనవాసము పూర్తి అగుటకు ఇంకొక్క దినమే మిగిలియున్నది సాకేతపుర వాసులు — రాజపరివారము — కౌసల్యాది దేవేరులు — రామాదుల పునరాగమన శుభముహూర్తమునకై వేయికండ్లతో వేచియున్నారు నగర వాసులకు యెల్లెడల శుభనిమిత్తములు తోచెను. ఇంతలో రామమూర్తి సీతాలక్ష్మణసమేతముగా శుభాగమనము చేయుచున్నాడను వార్త వ్యాపించగనే ఆబాలగోపాలముతో అయోధ్య ఆనందాబ్ధి మునిగి తేలెను

రామదర్శనోత్కంఠుడై క్షణమొక యుగముగా గడపుచున్న భరతుడవ్వేళ ఇట్లు తర్కించ సాగెను

"వనవాసవ్రత పరిసమాప్తికి ఇంకొక దివసమే శేషమున్నది అగ్రజుడింకనూ రాకుండుటకు హేతువేమి? వ్యవధిమీరక మునుపే అన్నయ్య ఆగమనము అవశ్యనీయమ్మై యున్నది నేను కుటిల స్వభావుడనని భావించి నన్ను చూచుటకు ఉపేక్షించెనా? అందుకే కాబోలు సోదరుడు నన్ను వదలిపెట్టి సౌమిత్రిని వెంట తీసుకుని పోయినది ఆహా! అగ్రజుని అనుగమించిన ఆ లక్ష్మణుడెంత అదృష్టశాలి! పూహుం నా పూహ సరికాదు, ప్రభువు కృపామూర్తి"

అతడు భక్తుల దోసములు సైరించు సదయ హృదయుడు కౌసల్యా తనయుడు తప్పక వచ్చును. నన్ననుగ్రహించును అదిగో నాకు శుభములు తోచుచున్నవి"

భరత డిట్లు డోలాయమానుడై విరహాంబుధిలో మునిగియున్న తరి, అతనిని రక్షించుటకు వచ్చిన నావవలె హనుమంతుడు భూసురుని రూపమున అక్కడికి చేరెను

బైఠే దేఖి కుసాసన జటామకుట—కృసగాత,
రామ రామ రఘుపతి జపత ప్రవత
నయన జలజాత

జటలుదాల్చి దుర్బల శరీరముతో బాష్పపూరిత లోచనుడై దర్భాసనముపై కూర్చుని రామనామ స్మరణ చేయుచున్న కైక పుత్రునిగాంచి ఆంజనేయుడు హర్షితుడై అల్లంత దూరమునుండియే ఎలుగెత్తి—"ఓ భరత నృపాలా! విరహార్తునై రేయింబగలు ఎవరిని స్మరించుచున్నావో, ఏ పుణ్యమూర్తిని దర్శించుటకై ఉవ్విళ్లూరుచున్నావో ఆ రఘువంశోత్తముడగు రామచంద్రుడు నిశాచరులను నిర్జించి, దేవజాతికి శాంతి లభింపజేసి, సీతా లక్ష్మణ సమేతుడై సురక్షితముగ మరలి అయోధ్యకు వచ్చుచున్నాడు—" అని పలికెను.

కపిపుంగవుని అమృతోక్తులు కైక సుతునికి కర్ణపేయముగా నుండెను అత డంత ప్రహృష్టాంతరంగుడై—"ఓ సౌమ్యా! ప్రియ వచనములతో శుభవార్త తెలియజేయుచున్న మీరెవరు! ఎచ్చట నుండి వచ్చుచుంటిరి!" అని పరమాదరముతో ప్రశ్నించెను

ఆగంతకుడు బ్రాహ్మణరూపు పరిత్యజించి, నిజ రూపముతో భరతుని ఎదుట నిలబడెను.



# రామచరిత మానస్

భరతు డంత రామసేవకుని గురించి పులకిత గాత్రుడై ఆనందాశ్రువులు రాలుచుండగ అంజనీ సుతుని ప్రగాఢ ప్రేమతో గాఢాలింగనము చేసి — "కపిపుంగవా! నీ దర్శన స్పర్శచే నా కష్టములు గట్టెక్కి బాధలు తీరెను మారుతీ! ఈ శుభ వార్తకు సాటి రాగల ప్రత్యుపకారము నీకు చేయు కుంటిని హనుమంతా! సీతాపతి యోగ క్షేమ ములు సాంతముగ తెలుపరచి నన్నానందింప జేయ వేడుచున్నాను—" అని పలికెను

ఆంజనేయుడు భరతుని గుణశీలములకు ముగ్ధుడై అతనికి సాంతముగ సీతా రామలక్ష్మణులకు సంబంధించిన సకల సమాచారము విశదముచేసి— "భరతా! నీవు ప్రభువుకు ప్రాణ సమానుడవు స్వామి స్వముఖముతో సదా నీ గుణ గణములు వర్ణించుచుందురు నీవు సత్యముగా ధన్యుడవు" అని పలికి ఆంజనేయుడు సాష్టాంగపడి రామా నుజుని పాదములకు నమస్కరించెను

తదుపరి హనుమంతుడు భరతునియొద్ద సెలవు తీసుకొని నంది గ్రామము వదలి రామునున్న చోటికి వచ్చెను రఘుపతి మారుతివలన భరతా దుల కుశల క్షేమములు తెలుసుకొని సంతుష్టుడై సీతా లక్ష్మణ సమేతముగా విమానమెక్కి బయలు దేరెను

## రామభరతుల సమాగమము

భరతుడు సత్వరమే నందిగ్రామమునుండి నగరికివచ్చి గురువులకు, తల్లులకు రాజపరివారము నకు పురజనులకు ఈ సంతోషవార్త తెలియ జేసెను సీతా రామలక్ష్మణుల శుభాగమన సమా చారము తెలియగనే సాకేతపురి సంతోషముతో సంభ్రమించెను స్వామి మంగళాగమనము పురస్క రించుకొని శీతల సుగంధ పవనములు ప్రసరిం చెను, సరయూనది నిర్మల జల పూరితమై భాసిం చెను రామాగమనవేళ సకల శోభలచే రాణించెను

సువాసినులు సర్వాలంకార శోభితలై స్వర్ణ పాత్రలందు దధి—క్షీర—లాజా— పుష్పాది సుగంధ ద్రవ్యములు తీసుకొని బయలుదేరిరి భరత శత్రు ఘ్నులు, వసిష్ఠ వామ దేవాది గురువర్యులు, సుమం త్రాది మంత్రిముఖ్యులు, కౌసల్యాది దేవేరులు, రాజబంధువులు, భూసురశ్రేష్ఠులు, పరివార పరి జనము, పురంధ్రీమణులు మొదలగువారు మంగళ వాద్యములతో సీతా రాములకు స్వాగతమిచ్చు టకై ఎదురు వెడలిరి రథ గజ తురగ పదాతి దళ ములు, నానావిధ వాహనములు వివిధ వాద్య బృంద ములు వారి ననుసరించి నడచెను ఆ స్వాగతోత్స వము నయనానందకరముగా నుండెను అట్లు పురో గమించు పురవాసులు ఆకాశములో ఎగురుచున్న పుష్పక విమానముజూచి సంతోషము పట్టలేక శరత్కాల చంద్రునిజూచు సాగరునివలె ఉప్పొంగి పోయిరి.

అల్లనల్లన పుష్పకము సాకేతపురిని సమీపిం చెను బహుకాలానంతరము అయోధ్య అగుపడగా రామమూర్తి కన్నులు అశ్రుపూరితమయ్యెను అవధేశు డప్పుడు సుగ్రీవాంగద—విభీషణాదులను జూచి కంపిత స్వరమున "మిత్రులారా! ఆ కాన వచ్చు సుందర నగరమే నా జన్మస్థలమైన అయోధ్య ఈ నగరము నా కత్యంత ప్రియమైనది దీనికి ఉత్తర భాగమున పుణ్య స్రవంతి సరయూ ప్రవహించుచున్నది ఈ నగరవాసులు నా యను రాగమును చూరగొన్నవారు—" అని అయోధ్యను గురించి ప్రేమతో ప్రసంగించెను. ఇంతలో పుష్ప కము మెల్లన భూమిపై వ్రాలెను సీతా రామ లక్ష్మణులు, వానర రాక్షస బృందము విమానము నుండి వెలుపలికి వచ్చిరి తదుపరి పుష్పకము స్వామి ఆజ్ఞ పురస్కరించుకొని కుబేరునియొద్దకు మరలి పోయెను

విరహార్తులగు పురవాసులు ప్రభు దర్శనార్థమై ముందుకు త్రోసుకొనిరి దశరథ నందనుడు శరు చాపములు క్రిందబెట్టి మొదట వసిష్ఠ వామ దేవాది గురువులకు పాదాభి వందన మొనర్చి వారి ఆశీస్సులందుకొనెను భరతుడు అశ్రువులతో అగ్రజుని పాద ప్రక్షాళన చేసెను రామమూర్తి తమ్ముని పైకి లేవనెత్తి హృదయమున కత్తు కొని కన్నీటితో మూర్ధాభిషేకము చేసెను మూర్తీ భవించిన శృంగార ప్రేమలవలె ఆ సోదరద్వయము గాఢాలింగన బద్ధమై బాహ్య ప్రపంచమునే మర చెను నేత్రానందకరమైన ఆయన్నదమ్ముల ప్రియ సమాగమము అపూర్వము, అవర్ణనీయమై సప్పై యుండెను

తదుపరి దాశరథి చిన్న తమ్ముడు శత్రుఘ్నుని కౌగిటజేర్చి అపార సుఖమనుభవించెను లక్ష్మణ శత్రుఘ్నులు ప్రగాఢ ప్రేమతో ఒండొరుల కలుసుకొనిరి పిమ్మట భరత శత్రుఘ్నులు భక్తి ప్రేమతో సీతాదేవి చరణములకు నమస్కరించి రాముడు జగదభి రాముడుగదా! అతడు ప్రజలందరినీ యథా యోగ్యముగ పలుకరించి వారి యోగ క్షేమ ములు విచారించెను గోవులు దూడలకై పరు గెత్తునట్లు ముగ్గురు తల్లులు ముందుకువచ్చి రామ లక్ష్మణులను కౌగిటజేర్చి ప్రేమాశ్రువులు రాల్చిరి కౌసల్యా తనయుడనేక మూర్తులై కైక తల్లిని ప్రేమతో పలుకరించి ఆమె బిడియము పోగొట్టెను మైథిలి ముగ్గురత్తలకు పాదము లంటి నమస్కరింప వారామెను దీవించి అక్కున జేర్చుకొని ఆనందాశ్రువులు రాల్చిరి

మాతృ వర్గము కుమారులకు కోడలికి మంగళ హారతులిచ్చి, దృష్టి దోషము సోకకుండుటకై దిగ దుడిచి, కుల దేవతలకు మ్రొక్కులిడిరి జనని కౌసల్య— నా గారాబు బిడ్డ ఆ భయంకర రాక్షసుల నెట్లు పరిమార్చగలిగెను! అని విస్తుపోయి రెప్ప వాల్చక రాముని చూచుచుండెను

## రాముడు తన మిత్రబృందమును వసిష్ఠాదులకు పరిచయము చేయుట

లంకాధీశుడు విభీషణుడు, వానర పతి సుగ్రీ వుడు, అంగద హనుమంత నల నీలురాది రామాను చరులు బ్రాహ్మణ రూపములతో నుండిరి వారు భరతుని స్నేహ సద్భావము, నగరవాసుల ప్రియ ప్రవర్తన రఘునందనుని యెడల వారికున్న గాఢాను రాగము చూచి సమ్మోహితులై పోయిరి అవధేశు డప్పుడు విభీషణ సుగ్రీవ అంగద హనుమంత ప్రభృ తులను గురు సమ్ముఖమునకు తీసుకొని పోయి వారి పట్ల తన ప్రగాఢ ఆత్మీయత వ్యక్తమగునట్లు వసిష్ఠునితో — "గురుదేవా! వీరు నాకాప్త మిత్రులు ఈ త్యాగ శీలుర స్నేహము లభించుట వలననే నేను దశకంఠుని సంహరించి విజయుడనై, సతీ సోదర సమేతముగా ఇంటికి రాగలిగితిని నా నిమిత్తము తమ సర్వస్వము సమర్పించుకొన్న ఈ బంధువులు నాకు భరతునికంటె ప్రియ పాత్రులు" అని స్నేహసిక్త స్వరముతో ప్రవచించెను శాఖాచర నిశాచర ప్రవరులందరు కేలు మోడ్చి వసిష్ఠ గురు వుకు నమస్కారములు చేసిరి ఆ పైన వారు సద్భక్తితో ప్రభు మాత కౌసల్యాదేవికి సాష్టాంగ పడిరి ఆ తల్లి వారిని తన పుత్రులుగా భావించి పరమ వాత్సల్యముతో ఆశీర్వదించెను

అనంతరము సీతా రామ లక్ష్మణులు స్వజన బంధుజన పురజన పరివృతులై రాజ మర్యాదలతో పురవీధులతిక్రమించి రాజ భవనమునకు గమనము చేసిరి ఆ మంగళకర వేళ పైనుండి సుమన వృష్టి జరిగెను దివ్య దుందుభులు మ్రోగెను, రాజ పథ ములు సర్వాలంకారములతో రాణించెను ధ్వజ కేతన పతాక ప్రభలతో సాకేతనగరి స్వామికి స్వాగతము చెప్పుటయందు సంభ్రమించి పోయెను మేడల పైనుండి పురంధ్రీమణులు సీతారాములపై సేసలు జల్లిరి, ప్రేక్షక జన సందోహముచే పుర వీధులు కిటకిటలాడెను పథములన్నియు పన్నీటితో పంకిలమయ్యెను ఢంకా శంఖ శహనాయి నేబత్తు నగారా మ్రోతలకు భూమ్యాకాశములు ప్రతి ధ్వ నించెను యత్ర తత్ర పురాంగనలు కోసలకుమా రులకు కర్పూర హారతులిచ్చి, నొసట కుంకుమా క్షతలు బెట్టి, లాజలు చల్లి, పాటలు పాడి మంగళ స్వాగతములిచ్చిరి ఉత్సాహోల్లాస సంభరితమైన సాకేత పథములను గమించి వారు ఎట్టకేలకు రాజనగరు చేరుకొనిరి సీతారాముల పునరాగమనముతో రాజాంతః పురవాసుల సుఖములు సంతోషములతో విస్ఫా రితమయ్యెను

రామమూర్తి ప్రప్రథమము కైక గృహమునకు పోయి పాదాక్రాంతుల ఆమె హృదయమునకు స్వా స్థ్యము కలుగజేసి, పిమ్మట నిజసదనము చేరు కొనెను సీతారామ లక్ష్మణులిట్లు సకలామోద కరముగా స్వ గృహము చేరుకొనిరి

కుల గురువు వసిష్ఠుడు బ్రాహ్మణులను పిలవ నంపెను తదుపరి భూసురోత్తములతో సంప్ర దించి గురువు జగన్మంగళకరమగు శ్రీరామ పట్టాభి షేక మహోత్సవమునకై ముహూర్తము నిర్ణ యించి, తన్నిమిత్తమై సకలవిధ ప్రయత్నములు హుటాహుటి చేయవలసినదిగా సుమంత్రాదులను ఆదేశించెను

త్రుటిలో రాజోద్యోగులు గురువు ఆజ్ఞను కార్య రూపమున బెట్టిరి ఉత్సవ కార్యములన్నియు చక చక నిర్వర్తింపబడెను వేలాది సేవకులు తత్పూ ర్తితో నిమగ్నమైరి మంగళ ద్రవ్యములు సేకరించు టకు సేవకులు నియమింపబడిరి నగరమంతయు నానా విధముల శృంగారింపబడెను చతురంగ బల శ్రేణి సమాయత్తము గావింపబడెను పదాతిదళ ములు సర్వ సన్నద్ధమై బారులు దీరెను సుమంత్రు డంత తిరిగి వచ్చి సర్వ కార్యములు నిర్వర్తింప బడి నట్లు వసిష్ఠులకు నివేదించెను

అవధేశుడంతట మిత్రులకు స్నానాదికము

జీవరింపవలసినదిగా సేవకులను పురమాయించెను. విభీషణ సుగ్రీవాంగద హనుమంత ప్రభృతులు స్నానములొనర్చి సుందర వస్త్రాలంకరణ చేసిరి. శ్రీరాముడు స్వహస్తములతో భరతుని జటలు విప్పి ముగ్గురు తమ్ములకు మంగళ స్నానములు చేయించెను. ఆ పిమ్మట రఘూద్వహుడు వనవాస వ్రత సమాప్తికి చిహ్నముగా తన జటామకుటము విసర్జించి సుస్నాతుడయ్యెను. కౌసల్యా కైక సుమిత్రలు స్వయముగ వైదేహికి అభ్యాగన స్నానాదికములు గావించి అమూల్య భూషణాంబరాదులచే అలంకరింప జేసిరి. పిమ్మట మంగళారతి పైధరిసి తోడ్కొని వచ్చి శ్రీరామునికి వామ పార్శ్వమున కూర్చుండబెట్టిరి. తేజోమూర్తులై ఆసనములపై శోభించుచున్న కొడుకు కోడళ్ళ నేత్రోత్సవముగ దర్శించుకొని తల్లులు బ్రహ్మానందముతో — మా జన్మలు నేటికి కదా ఫలించె—నని పరవశతజెందిరి

## శ్రీరామ పట్టాభిషేకము

శ్రీరాముని పట్టాభిషేకము మహోత్సవముతిలకించుటకై వేంచేసిన బ్రహ్మ మహేశాదిదేవాధికులతో, నానా దేశవాసులతో రాజసభాగారము క్రిక్కిరిసియుండెను. సీతారాములు గురు జనులకు దోసిలొగ్గి నమస్కరించి రత్నఖచిత రాజ్యసింహాసనము పై సమాసీనులైరి. వేదవిదులు మంత్రోచ్చారణము చేయుచుండ, దేవతాగణములాది సకలలోకవాసులు ఆశీర్వాదాక్షతలు వేయ, జయధ్వనుల మాటు ప్రోగ కుల గురువు వసిష్ఠుడు రామచంద్రుని నొసట రాజ్యతిలకముంచెను. వైశాఖ బహుళ సప్తమి నాడు దశరథరాముడు పట్టాభిషిక్తుడాయెను.

భరత లక్ష్మణ శత్రుఘ్నులు, విభీషణ సుగ్రీవులు, అంగద హనుమంతులు మున్నగు ప్రముఖులు ఛత్ర చామరములు ధనుర్బాణములు గదాఖడ్గములు ధరించి పట్టాభిరాముని కిరువైపులబారులుదీరి బరాబరులు చెప్పిరి. ఆ శుభవేళ దివ్యులు దుందుభులు మ్రోగించిరి..గంధర్వులు గానముచేసిరి. అప్సర కాంతలు ఆడిరి. మునులు నరులు కిన్నరులుసిద్ధులు సకలలోకవాసులు సాకేతనాధునికి జోహార్లు పలికిరి.

రాముడు నయనాభిరాముడై సీతాపతితో ధర్మాసనమలంకరించి దీప్తిగాంచెను. రఘునాథుని రూప లావణ్యములు కోటి మన్మథుల ధిక్కరించి తేజరిల్లెను. పట్టు పీతాంబరధారియై మకర కుండల కాంతిజను మిక్కిలి శోభిల్ల, రత్నఖచిత మణిమయ కిరీటము ధగధగలాడ, ఆజానుబాహులు కంబుగ్రీవుడు నీలమేఘ శ్యామాంగుడు సరసిజాక్షుడగు శ్రీరాముడు జగన్మోహనాకారుడై ప్రకాశించెను. ఆ జగదభిరాముని నేత్ర పర్వముగ దర్శించుకొని ఆమ్మహనీయుని దివ్య చరిత్ర గానము చేసి సకలలోకవాసులు ధన్యులై తరించిరి. —

వినతామణా! ప్రభువు పట్టాభిరాముడై ప్రకాశించిన ఆ శుభవేళ సామ—యజు—అధర్వణ—ఋగ్వేదములు నాల్గు నరరూపము లెత్తి వచ్చి రాఘవుని దర్శించుకొని స్వామినిట్లు స్తుతించెను—

"జయ విష్ణు మాయావశ సురాసుర
నాగ నర ఖగ జగ హరే,
భవ పంధ భ్రమతా మిత దివస
నిశి కాల కర్మ గుణాన్వితరే,
జో నాథ కరి కరుణా విలోకనా
త్రివిధ దుఃఖతే నిర్వహో,
భవ ఖేద ఛేదన దక్ష హమ కహో.
రక్ష రామ నమామహే, " (సశేషం)



నాట్యం చేయడానికి అలంకారాలు !

# ఆస్ట్రేలియన్ ఆదిమవాసులు

**ఆగస్టు 1963లో ప్రొఫెసర్ ఆబీ నాయకత్వం క్రింద జరిగిన ఒక ఏంత్రపాలాజికల్ (మానవతత్వ శాస్త్ర సంబంధమయిన) ఎక్స్పెడిషన్‌లో నేనూ పాల్గొన్నాను మా బృందం ఆస్ట్రేలియాలోని కింబర్లీ డివిజన్‌కి చెందిన 'కలంబురూ' అనే ఒక ఆదిమజాతి నివాసం (ఎబొరిజినల్ రిజర్వ్) సందర్శించింది.**

ఇక్కడికి వెళ్ళాలంటే సరయిన రోడ్డు కూడా లేదు. రాయల్ ఆస్ట్రేలియన్ ఎయిర్ ఫోర్స్ (విమానదళం) వారి సహాయంతో మేమంతా (మా భారీ సామగ్రితో బాటు !) అక్కడ రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో తాత్కాలికంగా ఏర్పరచిన విమానాశ్రయంలో దిగాము దగ్గరే ఉన్న ఎబొరిజిన్ రిజర్వ్‌ని 60 సంవత్సరాలుగా ఒక (స్పానిష్ బెన్‌డిక్షన్) మిషన్ వారు నడుపుతున్నారు మేము మా గుడారాలు వేసుకుని అక్కడే నెల రోజులపైన ఉండిపోయాము

ఎబొరిజిన్‌లు ఎలా ఉంటారు ? అంత పొడుగ్గా కాదు, ధృఢకాయులనవచ్చు, శరీరం రంగు మరీ నల్లగా ఉండనూ ఉండదు, వెడల్పాటి పెద్ద ముక్కులు, కనుబొమల క్రింద ఎముకలు ఎత్తుగా ఉంటాయి, జుట్టు మెలికలు తిరిగి ఉంటుంది. ఈ రిజర్వ్‌లోనే కాక ఎబొరిజిన్‌లు మధ్య ఆస్ట్రేలియా ఎడారి ప్రదేశాలలో కూడా కనిపిస్తూ ఉంటారు ఇంచుమించు నగ్నంగా, అర్ధనగ్నంగా తిరుగుతూ ఉంటారు వీరి ముఖ్య జీవనోపాధి వేట వీరు వేటకి వాడే సామగ్రిలో ముఖ్యమయినవి - బూమ్‌రేంగ్, ఉమెరా, బల్లెం.

## బూమ్‌రేంగ్

బూమ్‌రేంగ్ చాలా చిత్రమయిన 'ఆయుధం'. దీనిని యూకలిప్టస్ చెట్ల కొయ్యతో తయారు

కరాబురీ డాన్సు.



బొమ్మలు వ్యాసం
పి. డి. ప్రసాదరావు



త్వరిత రాపిడిలో నిప్పు చేస్తున్నాడు

వేస్తారు. ఇంగ్లీషులో V అక్షరం లాగే ఉంటుంది కాని మధ్య కోణం 70, 80 డిగ్రీలు మించి ఉండదు. ఇది విసిరితే ప్రయోగించిన వారి దగ్గరికే తిరిగి వచ్చేస్తుంది ! చిన్న జంతువులని, పిట్టలని వేటాడటానికి బాగా పనికి వస్తుంది

ఎబారిజన్‌లు సాధారణంగా పచ్చి మాంసం తినేస్తూ ఉంటారు లేదా వేడిచేసిన ఇసుక, రాళ్లలో ఉంచిన మాంసాన్ని తింటారు బల్లెంతో చేపలని, మొసళ్లని కూడా వేటాడుతూ ఉంటారు పిల్లలేమో చిన్న పక్షుల్ని, ఒక దినుసు బల్లులని పట్టుకుని తినేస్తారు దొరికితే దుంపలని ఆహార పదార్థాలుగా వాడుతూ ఉంటారు

చిన్న పిల్లలు కొంచెం పెద్ద వారవగానే దేహం మీద చారలు వేస్తారు ఇంకా ఇతర వాడుకలూ ఉన్నాయి.

## కొరాబిల్

తీరిక సమయాలలో. రాత్రిపూటా 'కొరాబిల్' అనే నృత్యంచేసి కాలక్షేపం చేస్తూ ఉంటారు, ఎబారిజన్‌లు వీటిలో మగవారు మాత్రమే పాల్గొనాలి ఆడవారు జట్లుగా ఉండి పోయి, చేతులు ఊపుతూ, వరస పాడుతూ తొడలని చేతులతో చరుస్తూ ఉంటారు మగవారు డాన్సు చేసినంత సేపూ తమ వేట ఆయుధాలయిన బూమ్‌రేంగ్, ఈటెలని, పట్టుకునే ఉంటారు. పెద్ద బూరాలు వూదటం, కాళ్ళతో, కర్రలతో 'తాళం' వెయ్యటం వారి పని 'నింజ్ నింజ్' అనే మరొక రకమయిన డాన్సు ఉంది

ఎబారిజిన్‌లు 'ఆస్ట్రలాయిడ్' అనే ప్రత్యేక జాతికి చెందిన వారని కొందరి అభిప్రాయం అతి పురాతన కాలంలో ఆసియా ఖండం నుంచి విడిలి అయిన వారే వీరని కొందరు చెబుతారు వీరు సముద్ర యానం ద్వారా ఈ ఖండం చేరుకున్నారంటారు.

## డింగో

వీరి కుక్కలని 'ఆస్ట్రేలియన్ డింగో' అంటారు. ఈ కుక్కలతో బాటు 6000 సం పూర్వం ఇక్కడికి వచ్చారని ప్రతీతి.

ప్రభుత్వంవారు, మిషనరీలు వీరికి వివిధ సౌకర్యాలు ఏర్పరుస్తున్నారు. ఆడవారికి తోటపని, వంటపని నేర్పుతారు పురుషులని గొర్ల వృత్తిలో తర్ఫీదు ఇస్తున్నారు ఇవి కాక సాంకేతిక విద్యాభ్యాసం సయితం జరుగుతోంది, విద్యాసంస్థలలో ఎన్నో ప్రత్యేక సదుపాయాలు లభిస్తున్నాయి. మరి రెండు మూడు తరాలలో ఎబారిజిన్‌లు అందరూ తక్కిన ఆస్ట్రేలియన్‌ల వలె అన్ని హక్కులూ కల దేశస్థులు కావాలని ప్రభుత్వం ఆశయం. ★



"నింజ్ నింజ్" అనే డాన్సు.



శిల్ప వృద్ధుడు.

# అసురసంధ్య

13 వ పేజీ తరువాయి

ఇక్కడి వాతావరణం— మనుష్యుల తీరూ. నోటితో మాట్లాడి నొసటితో వెక్కిరించే వాళ్ళు ఎక్కువగా అగపడుతున్నారు నాకు అది మరి నా దృష్టి లోపమేమోనని వారిమీద సదభిప్రాయం కలిగించుకుందామని తీవ్రంగా ప్రయత్నించాను కాని అది సాధ్యం కాలేదు కాదు సాధ్య పడవలసిన అవసరం కూడా లేదని తరువాత తెలుసుకున్నాను.

రోజూ చూసే ముఖాలే కాబట్టి కొందరిని గురించి మీరేమీ పట్టించుకోవడం లేదు. వారిని గురించి చెడుగా చెపితే నమ్మరు. మీకు వాళ్ళు మంచి వాళ్ళు కారేమోనన్న ఆలోచన వస్తే అలా వచ్చినందుకు భయపడి పోతారు . . ఒక్క మాట అడుగుతానత్తయ్యా— ఇతరులకి ఏ అపకారం తలపెట్టని మావయ్య ఈ వూళ్ళో అమానుషంగా చంపబడ్డాడు ఎందుకంటావు ?"

సుభద్రమ్మ సమాధానం చెప్పలేదు

"నాకు తెలుసత్తయ్యా నువ్వు చాలా అమాయకురాలివని నాలుగు వూళ్ళు చూసిన నాకు వయస్సులో చిన్నవాడయినా నీకన్న ఈ విషయాల్లో అనుభవం ఎక్కువ ఉంటుందత్తయ్యా మిమ్మల్ని ఇటువంటి మనుష్యుల మధ్య వదిలి పెడితే నాకు మనశ్శాంతి ఉండదు నేనా వెళ్ళక తప్పదు కాబట్టి ప్రార్థిస్తున్నాను నిన్ను— నా వెంట రండి పువ్వుల్లో పెట్టి పూజిస్తానని అనను గాని నాలో శక్తి ఉన్నంత వరకు మీకు ఏ లోపం రానీయను."

సుభద్రమ్మగారు ఏమీ మాట్లాడలేదు.

"ఏమత్తయ్యా ?"

"నన్ను ఆలోచించుకోనీంబ నాయనా !" అంది ఆవిడ

రాజారావు లేచి గదిలోకి వచ్చేశాడు అతని బుఱలో ఆలోచనలు తెనె టీగల్లా ముసురుకుంటున్నాయి. తను వాళ్ళనలా అర్ధతరంగా వదిలి పోలేడు. వాళ్ళకి ఉన్న ఆశ్రయం ఒక్కటే పోయింది. వాళ్ళలని పోషించడం తన కర్తవ్యం. తన ధర్మం తన కానందం కలిగించేది కూడా ! . ఎలాగయినా అత్తయ్యని ఒప్పించాలి వరలక్ష్మి ద్వారానయినా ప్రయత్నించాలి. తను మాత్రం ఈ బాధ్యత స్వీకరించాలి అప్పుడే తనకి తృప్తి ..

చప్పుడయితే వెనక్కి తిరిగాడు వరలక్ష్మి నిలబడి ఉంది.

ఆమె వంక చూశాడు. ఏవేవో ఆలోచనలతో మబ్బులను జయించేందుకు ప్రయత్నిస్తు చంద్రుడిలా ఉంది ఆమె ముఖము

"కూర్చో వరం !" అన్నాడు రాజారావు తను కూర్చుని.

వరలక్ష్మి మాట్లాడకుండా కూర్చుంది

"నువ్వయినా చెప్పు వరలక్ష్మీ, ఈ పాడు వూరితో మీకింక సంబంధం ఏమిటి ? ఈ ఇంట్లో తిరుగుతుంటే మావయ్య గుర్తుకు రావడం లేదూ ? మీకు ? ప్రొద్దు క్రుంకితే చీకటి పడితే ఈ చీకటి మామయ్యని పొట్టు నెట్టుకుందని అనిపించడం లేదూ ? అలా దారి వెంట తుమ్మచెట్లకేసి చూస్తే మావయ్యని కబళించినా ఇంకా అసంతృప్తితో వికటాట్టహాసం చేస్తున్న మృత్యువు కనిపించడం లేదూ ? వీధిలో కొందరు మనుష్యులని చూసినప్పుడు మావయ్యని నిర్దాక్షిణ్యంగా చంపిన వ్యక్తి వాడేమోనని అనిపించడం లేదూ ?...."

"బావా !" ఆశ్చర్యంగా అతనికేసి చూసింది వరలక్ష్మి.

"అవును వరలక్ష్మీ, నాకలా అనిపిస్తోంది అలా కనిపిస్తోంది. ప్రతిదీ మావయ్యనే గుర్తు చేస్తోంది. ఈ స్మృతులు మిమ్మల్ని వెంటాడటం లేదూ ?"

". . . . . ."

"మాట్లాడవేం వరం, నేనేం పరాయి వాడినా ? మీరు నా వెంట ఎందుకు రారూ ? ఆ మాత్రం అవకాశం నాకెందుకీయరు ?" అతని కంఠం రుద్ధమయిపోయింది ముఖాన్ని చేతుల్తో కప్పేసుకున్నాడు.

వరలక్ష్మి అతనికి దగ్గరగా వచ్చి "ఎందుకు బావా అంత బాధపడతావు ? నువ్వు "స్మృతులు వెన్నాడటం లేదూ ?" అన్నావు కాని అందులోనే అమ్మకి మధురమయినవీ ఉండచ్చుగా ! అమ్మ ఈ ఇంటికి కొన్ని ఏళ్ళ క్రితం కొత్త పెళ్ళి కూతురిలా వచ్చిందన్న మాట మర్చిపోతున్నావు బావా మొప్పు సంసార మాధుర్యాన్ని, నాన్నగారి మంచి మనసుని ఆవిడ తెలుసుకున్నది ఈ ఇంట్లోనే ! మరి ఆవిడకివి మధురమయినవి కావూ ?"

ఒక్కసారి తరెప్పాడు రాజారావు

"క్షమించు వరం, నేను చాలా ఆవేశపరుడ్ని ఏమేమిటో మాట్లాడాను ఎంతసేపూ నా దృక్పథంలోంచే చూశాను కాని ఈ విషయాలు నా మనసులోకి రాలేదు . ఒక హత్య జరిగింది మన కుటుంబం మీద ఎవరికయినా క్రోధం ఉండి ఇది ఇంతటితో ఆపకపోతే ఏమయిపోతారు అనే నేను ఉద్రేకంతో మాట్లాడింది. కాని ఒక్కటి మాత్రం చెబుతున్నాను మిమ్మల్నిక్కడ వదిలి వెళ్ళిపోతే నాకు మనశ్శాంతి ఉండదు."

"పిచ్చి బావా, మాకు మాత్రం నీ కన్న కావలసినవా రెవరున్నారు చెప్పు ? అమ్మ తప్పకుండా ఒప్పుకుంటుంది నేనూ సమయంచూసి నచ్చచెబుతాను నాకూ ఈ ఇంట్లో ఉండడం భయంగా ఉంటోంది నాన్నగారు గుర్తుకొస్తారు ఎంతసేపూను. అలా కుర్చీకేసి చూస్తే ఆయన కూర్చున్నట్లే ఉంటుంది" పమిట చెరుగు ముఖాన కప్పుకుంది వరలక్ష్మి.

రాజారావు ఆమె రెండు భుజాలూ పొదివి పట్టు



# అసుర సంధ్య

కుని "ధైర్యంగా ఉండాలి వరం మా అమ్మ పోయినప్పుడు నాకు సానుభూతి చెప్పేవారు "నాగా కరువయి పోయారు తెలుసా ?. . . .

"చిన్న తనం నుంచి ఈ పల్లెలో ఉండిపోయావు. అసలు బస్తీలో వాళ్ళు వేసుకునే బట్టలు, అల కరణ ఉంటే నువ్వింకా ఎంత అందంగా ఉంటావో తెలుసా వరం ! నాన్న నీకు సంస్కారం, చదువు చెప్పాడు. నేను నిన్ను అందాలరాణిని చేస్తాను" అన్నాడు నవ్వుతూ.

"ఎందుకుట ?" అనడిగింది గోముగా.

"ఎందు కేమిటోయ్ రాణిగారూ— స్వార్థం."

ఫక్కున నవ్వి అతని చేతుల్లోంచి పారిపోయింది వరలక్ష్మి.

రాజారావు బట్టలు వేసుకుని బయటికి నడిచాడు—

వరలక్ష్మికి ఎటువంటి అభ్యంతరం లేదు కాబట్టి అతనికి అత్తయ్య కూడా చివరికి ఒప్పు కుంటున్న నమ్మకం కలిగింది— "అయినా చెప్ప లేం, ఈ పెద్ద వాళకి ఏదయినా తట్టిందంటే ఇంకెవరెన్ని చెప్పినా ఒప్పుకోరు. అదృష్టవశాత్తు ఆమె ఒప్పుకుంటే తనంత అదృష్టవంతు డుండడు. అయిన వాళ్ళని చేరదీసి బాధ్యత స్వీకరించిన తృప్తి ఉంటుంది. ఇలా అదృష్టం బావుంటే వరలక్ష్మి తనదవుతుంది. తన జీవితం "ఓహో!". ఆనందంలో తేలి గుడిదగ్గర అరుగు ముందు దిగాడు రాజారావు.

"ఏమోయ్ రాజా, ఏమిటి కథ— చాలా హుషారుగా ఉన్నావు ?" అనడిగాడు. చదువు తున్న పుస్తకాన్ని అవతలపెట్టి రామదాసు తాత

"నీతో చాలా చెప్పాలని వచ్చాను తాతా !" అంటూ అతని పక్కనే గోడకానుకుని కూర్చు న్నాడు రాజారావు.

చెప్పమన్నట్లు చూశాడు రామదాసు.

"మీరూ చూస్తున్నారుగా. ఇక్కడి పరిస్థితులు. మావయ్య చచ్చి పోయింది ఈ మధ్యనే ఎందుకు, ఎవరు చంపారన్నది తెలియదు మనకి ఇంకా ప్రయ త్నాలలోనే ఉంది. ఇక్కడి కొందరి ప్రవర్తన, నవ్వులూ నాకు వింతగా అగుపడుతున్నాయి. ఇటు వంటి వాతావరణంలో ఉంటున్నాం మనమంతా.

మా వాళ్లకి నేను తప్ప వేరే మగ దక్షత లేదు. నాకు వాళ్ళు తప్పవేరే 'నా' అనేవారు లేరు. అయితే వీళ్ళని అంటి పెట్టుకుని కూర్చోలేను కదా— ఒకయ్య చేతిలో తలపెట్టిన వాడిని. కూర్చుని తింటే కొండలే కరిగి పోతాయంటారు. పైగా ఉద్యోగం మానలేదు వీళ్ళకోసం కాబట్టి నేను వెళ్ళక తప్పదు."

"అవును మరి— మనకి ఉద్యోగం ముఖ్యం కాదూ ?"

"అవునా అండి ! వీళ్ళని దిక్కూ దివాణం లేకుండా ఇక్కడ వదిలి వెళ్ళలేక పోతున్నాను ఎంతగా మీవంటి పెద్దవాళ్ళున్నా—"

"కదూ నాయనా— అయిన వాడివి ! ఇంత ఏం చేద్దామని ?"

"ఇందాక మా అత్తయ్యకి చెప్పాను. ఈ పరిస్థితి అంతా చెప్పి అడిగాను నా వెంట రమ్మనమని బ్రతిమాలుకున్నాను "నా వెంట వచ్చి నాకీ అవకాశం ఇస్తే మనశ్శాంతి కలుగుతుంది నీకు" అని చెప్పాను"

"ఏమన్నారు అత్తయ్యగారు ?"

"ఏమంటుంది పాపం, ఉన్న వూరు మన్న ప్రజ అని— ఈ రెంటికి ఎలా వదిలి రావడం అని బెంబేలు పడిపోతోంది"

"అవును పాపం ఈ నాటి సంబంధమా ఈ 'వూరితో' సానుభూతిగా అన్నాడు తాత

"అవుననుకోండి— అంతగా కావాలంటే నెలకొకసారో ఎప్పుడో వచ్చి అందరిని చూసుకు వెళ్ళవచ్చుగా వీళ్ళిక్కడ ఉండిపోతే నాకు వీళ్ళని గురించి ఎంత దిగులుగా ఉంటుందో ఆలోచించండి !" బాధగా అన్నాడు రాజారావు

"నువ్వు చెప్పినది చాలా బావుంది నాయనా. కొన్నాళ్ళు పాటు వాతావరణం మార్చినట్లు అవుతుంది వాళ్ళకి ఈ దిగులులోంచి ఆట విడుపుగా ఉంటుంది. ఆయన మెసిలిన ప్రాంతాలు మార్చాలి చాలా తెలివి తేటలతో చెప్పావు !"

రాజారావు ముఖం విప్పారింది

"మా వరం— అనే మా వరలక్ష్మి కూడా ఒప్పుగుందండి మా అత్తయ్యక తనూ చెబుతానంది ఆవిడా ఒప్పుకుంటుందనే నా నమ్మకం ఒప్పుకోకపోతే మీలాంటి పెద్దలు కూడా ఒకసారి చెబితే . . . ."

"తప్పకుండా ! అందరికీ ఇప్పుడు ముఖ్యం వీళ్ళకి కొంత వూరట కలిగించడం. ఆ పని నువ్వు చేస్తానంటే అంతకన్నానా ?. . . చాలా బావుంది నీ ఆలోచన"

రాజారావు తృప్తిగా నిట్టూర్చాడు పనంతా సానుకూల పడినంత ఆనందం కలిగిందతనికి అంతలో ఒక విషయం గుర్తుకొచ్చి—

"అవును గానీ తాతా, మునసబుగా రబ్బాయి గురించి కొంచెం చెబుతారూ ?" అనడిగాడు.

"ఏం కావాలి ?"

"అదే మా మావయ్య అతన్ని వద్దంటానికి కారణాలు మీరు సరిగ్గా చెప్పార్ప లేరు"

"దాందేముంది— ఆ అబ్బాయికి ఆస్తి ఉంది అందం ఉంది ఒక్కడే సుపుత్రుడు. చదువు అబ్బింది— డాక్టరీ చదువుతున్నాడు ఇన్ని హంగులుంటే కావలసిందేముంది. కొన్ని అలవాట్లు అయాయని ఆ నోటా ఆ నోటా వినబడి గప్పుమంది. అబ్బాయిగారు పట్నంలో కృష్ణలీలలు మొదలెట్టారుట— సార్థక నాయుడయ్యాడట. నర్సులు, క్లాసుమెట్సు కాకుండా . . సరే— ఆ మాటలు మునసబు గారి చెవిన బడ్డాయి. శలవలకి వచ్చినప్పుడు కొడుకుని అడిగాడు, నేను ఏ పాపం ఎరగనన్నాడు వాడు.

"కాని ఈయనికి కొన్ని బుజువులున్నాయి. కొడుకు ప్రవర్తనని సరిచేయాలంటే పెళ్ళి చేయడమే మార్గమనిపించింది ఆయనకి చిన్నప్పుడు మీ వరలక్ష్మి, కృష్ణమూర్తి కలిసి చదువుకున్నారు ఇక్కడ అంతకు మించి మునసబుగారు, మీ మావయ్య స్నేహితులు కావడాన మొదటి నుంచి ఈ సంబంధం అవుతుందనుకున్నారు వూరి వారంతా

"అయితే ఈ పరిస్థితుల్లో మునసబు అడిగేప్పటికి మీ మావయ్య హేళనగా మాట్లాడాడుట ! — "నీ కొడుకు కీర్తి లోకం కోడై కూస్తోంది, చూస్తూ ఎలా అడిగావు ? నీ కిది సబబేనా ? నీ కొడుకుని బాగు చేయటానికి నా కూతుర్ని బలివ్వాలా ?" అనడిగాడుట.

"దాంతో భంగపడి తిరిగి పోయాడు మునసబు"

"అయితే ఆ కృష్ణమూర్తి వెంటనే వెళ్ళిపోయాడా ?"

"లేదు రెండు మూడుసార్లు మీ మావయ్యని కలుసుకుని మాట్లాడేందుకు ప్రయత్నించాడుట కాని కుదరలేదు మీ వరలక్ష్మితో మాట్లాడబోయాడుట కాని "మా నాన్న ఇష్టం లేనిదే మిమ్మల్ని చూడను కూడా అందిట" ఆ అమ్మాయి"

"ఎప్పుడు వెళ్ళాడు అతను ?"

"అతను వెళ్ళి ఒక వారం పదిరోజులవుతుంది"

"అలాగా !" సాలోచనగా అని లేచి నిలబడ్డాడు రాజారావు

తాత అతని వంకే చూస్తుండి పోయాడు

ఇంటికి రాగానే వరలక్ష్మిని పిలిచి అడిగాడు రాజారావు "మునసబుగారబ్బాయిని నీ కిద్దామనుకుంటున్నారుట కదా !" అని

వరలక్ష్మి "అవును ఆ అబ్బాయిని నా కిద్దామనుకున్నారు"అని "అదేం ప్రశ్న బావా ! తుంక్రిందులుగా అడిగావు" అంటూ నవ్వేసింది

"అదేలే, నిన్ను అతనికి— సరా ! మరెందుకు కాలేదు ? డబ్బు, అందం, చదువు అన్నీ ఉన్నాయిగా ?"

"కాని బుద్ధి లేదని మా వూరి వారందరి అభిప్రాయం అందుకనే నాన్నగారు కూడా చీవాట్లు పెట్టి తిరకొట్టారుట"

"నీ అభిప్రాయం ఏమిటి ?"

"చిన్నప్పుడు మంచివాడే ! నాన్నగారు వద్దన్నాక నన్ను చెరువు దగ్గర ఆడిగాడు "నన్ను గురించి చాలా అపవాదులు ప్రచారంలోకి వచ్చాయి వరలక్ష్మి, నువ్వయినా నిజం అర్థం చేసుకోవూ ?" అని. నేను మాత్రం చెప్పాను "నువ్వు మంచివాడవని నాకు నమ్మకం కలిగినా మా నాన్నగారి నిర్ణయానికి ఎప్పుడూ తల ఒగ్గుతాను కాబట్టి ఆయన్ని ఒప్పించే ప్రయత్నం చేసుకోమని"

కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది

"సాయంత్రం అలా దేవాలయంకేసి వెడదాం వస్తావా వరం ?" అడిగాడు రాజారావు

"అమ్మనడుగు— వెళ్ళమంటే వెడతాం !"

నవ్వాడు రాజారావు వరలక్ష్మికూడా ఫకాలున నవ్వేసింది

ఆలయానికి వెనకగా ఉన్న చిన్న కాలవగట్టున కూర్చుని చుట్టూ పరికించి చూశాడు రాజారావు సూర్యాస్తమయం అవుతూ మరోకవైపు నుంచి చంద్రుడు కాంతిని పుంజుకుంటున్నాడు.




"ఈ బిల్డింగ్ ఎన్ని అంతస్తులో లెక్క పెట్టేసరికి ఇదివరకున్న మెడనొప్పి పోయింది !"

"చూడు వరం సూర్య చంద్రుల సొకిగ్గా అంటే ఇటువంటి సమయమేట ! ఇటూ అటూ కాపలా కాస్తున్నారు. . . . కన్యాకుమారి పోతేనట ఒకవైపు సముద్రంలో సూర్యుడు అదృశ్య మవడం మరొకవైపు సముద్రంలోంచి చంద్రుడు వస్తుండడం అగపడుతుందట. అటువంటి దృశ్యం అపూర్వం కదూ వరం !" అన్నాడు ఆవేశంగా.

"ప్రకృతిలో అంతగా ఉద్రేక పడేందుకు నాకేమీ కనబడదు బావా ! ప్రకృతి సౌందర్యాన్ని చూసి నేను మూర్ఛలు పోలేను. నాకు ఆవేశం చాలా తక్కువ !" అంది నవ్వుతూ వరలక్ష్మి—

"నీక తక్కువయితే అయింది కాని నేను చెప్పింది విను వరలక్ష్మీ కొన్ని మాటలు చెప్పి తీరాలని నేను తీసుకు వచ్చాను నిన్నక్కడికి !

"మాకు ఒక స్నేహితుడుండేవాడు. అతను ఢిల్లీలో యువజనోత్సవాలకి మా కాలేజినుంచి ఒకడుగా వెళ్ళాడు. అప్పుడతని అనుభవాలు విని నేను చాలా ఈర్ష్య పడేవాడిని. అతని పేరు శర్మ. మనిషి సుమారుగా ఉన్నా అతని నవ్వు అతనికి ప్రత్యేకత. చాలా చిత్రంగా నవ్వేవాడు— అతని నవ్వుచూసి అవతలి వాళ్ళు నవ్వకుండా ఉండ లేరు.

"ఇతను వెళ్ళిన బాచ్‌లో ముగ్గురు అమ్మాయి లున్నారుట. అందులో రమణి అనే అమ్మాయి ఇతన్ని పట్టుకుని "శర్మగారూ, ఒక్కసారి నవ్వరూ —ప్లీజ్ !" అని అడిగేదిట. ఇతను నవ్వితే గొల్లున నవ్వేసిందట.

"మరొకమ్మాయి— పేరు ఇందిరర— ఇతను సిగరెట్టు దులుపుకుంటుంటే అరిచేయి పట్టేదిట !

"మొదట కోశాడనుకున్నాను. తరువాత ఈర్ష్య పడేవాడిని— అటువంటి అదృష్టం పట్టనందుకు !

"అయితే వరం, నేను అంతకన్న అదృష్టవంతుడ్ని !"

"ఎందుకో ?" చిత్రంగా కళ్ళు పెద్దవిచేసి అడిగింది వరలక్ష్మి.

"అద్దంలో నిన్ను నువ్వు చూసుకుంటే తెలుస్తుంది ఎందుకో !"

సిగ్గుపడిపోయింది వరలక్ష్మి. "పో బావా !" అంది బుగ్గలు ఎరుపు చేసుకుంటూ !

"కలిసే !" అని కాసేపాగి "అమ్మని అడిగేలే!" అన్నాడు.

ఇద్దరూ గలగల నవ్వేశారు.

"ఫ్రాయిడ్ అని గొప్ప మనస్తత్వ శాస్త్రవేత్త ఉన్నాడు వరం! అతని సిద్ధాంతం ఏమిటో తెలుసా— చిన్నతనం నుంచి చూస్తుండడం వలన ఆడపిల్లకి తండ్రిలాంటి భర్త కావాలని, మగపిల్లాడికి తల్లి లాంటి భార్య కావాలని కోరిక ఉంటుందిట ! ..." అని ఆమెవంక చూస్తూ "నువ్వు అచ్చం మా అమ్మ పోలిక !" అన్నాడు.

వరలక్ష్మి కొద్దిగా తలెత్తి, కళ్ళు ఇంకొంచెం పైకెత్తి చూస్తూ "అత్తయ్య ఎలా ఉంటుంది?" అనడిగింది.

"అచ్చం నీలాగా !"

"మరి మే ఇద్దరం ?" అడిగి మునిపంటితో కింది పెదివి అదిమిపట్టి సమాధానం కోసం అతనివంక చూడసాగింది.

# అసురసంధ్య

"అందానికి నిర్వచనాలు" అన్నాడు ముగ్ధుడయిపోతూ

"ఛో బావా!" అంది బుంగమూతి పెట్టి వర వరలక్ష్మి

"మరీ బిగించావంటే ఆ కాస్త మూతీ మాయమయిపోతుంది జాగ్రత్త. అప్పుడు 'ఒకమ్మాయికి మూతి ఉందని నేనూ, లేదని నా మిత్రుడూ వాదించుకొనుచున్నాము—ఎడిటర్ మహాశయా మీ రెవరితో నేకీభవించెదరు? అనడగాలసి వస్తుంది."

ఫకాలున నవ్వింది వరలక్ష్మి.

"ఎన్ని ముత్యాలో!"

"సంతోషించాం గానీ 'నోరు లేకపోతే ఆ అమ్మడు అలా ముత్యాలు రాల్చకపోగా చిన్నప్పుడే రొమ్మున చచ్చిపోయేది' అని ఆ ఎడిటర్‌గారు .."

"అవేం మాటలు వరం శుభమా అనమంటే చావు కబుర్లు ఎందుకు మధ్య?"

"సర్లే, పాపం పరిహారంగా ఆలయంలోకి వెడదాంరా" అని నడిచింది వరలక్ష్మి

ఇద్దరూ కలిసి ప్రాంగణంలోకి ప్రవేశించి అక్కడున్న బంతిపూలు కాసిని కోసుకుని ఆకులో పొట్లం కట్టుకుని గుడిలోకి ప్రవేశించరు

గంట కొట్టి భగవంతుడికి నమస్కరించబోతున్న రాజారావుకి పైకి గంటవంక చూసి తల వంచుకున్న వరలక్ష్మిని చూసి నవ్వు వచ్చింది

"పొట్టి పిల్లవి—నేను సాయపడతాను ఆగు" అంటూ ఆమె నడుము పుచ్చుకుని పైకెత్తాడు

నమస్కరించడం అయ్యాక ఇద్దరూ స్తంభానికి ఆనుకుని కూర్చున్నారు. రాజారావు సిగరెట్టు వెలిగించాడు. వరలక్ష్మి "తప్పు బావా—దేవాలయం కదూ" అంది.

అతను ఆర్పేస్తూ "దేముడిమీదా, దయ్యాల మీదా నమ్మకం ఉంచుకోవడం మంచిదని గ్రహించాను వరలక్ష్మీ— ఎందుకంటే వాళ్లు ఉంటే మనం బాగుపడతాం లేకపోతే నష్టపోయేది ఉండదు" అన్నాడు.

"అయితే నువ్వు నాస్తికుడివా బావా ఇదివరలో?"

"ఇదివరలో నాకు కావలసినది, నా ప్రేమకి ఏకైక వారసురాలు మా అమ్మ ఆమెని ఎవరేమన్నా సహించేవాడిని కాను అప్పట్లో నిన్ను గురించి అమ్మ చెబుతున్నా నీ రూపం అస్పష్టంగా నా మనస్సులో మెదులుతున్నా—నువ్వు నన్ను ఆదరిస్తావో లేదో అన్న భయం ఉండేది కాని ఇప్పుడు ఆ భయం లేదు నా అదృష్టం బావుంది. భగవంతుడి దయవలన నువ్వు నాదానివయ్యావు"

"అవేం మాటలు బావోయ్, అమ్మ అమ్మ!"

"అవును సుమీ, మాతృవాక్య పరిపాలకురాలివి కదూ—మర్చిపోయాను ఆవిడ్ని లైసెన్సు అడిగాకే!"

ఇద్దరూ నవ్వేశారు.

"సరేగాని బావా, నీ వెంట రమ్మంటున్నావు, ఏ లోపం రానియ్య నంటున్నావు గాని అసలు నీ ఉద్యోగము ఏమిటో చెప్పావుకావు!"

రాజారావు మాట్లాడలేదు.

"చెప్పవా?"

"చెప్పకూడదు వరం!"

"నా కొక్కదానికి!" కళ్లలోకి చూస్తూ అడిగింది వరలక్ష్మి.

"నువ్వు మాత్రం ఎవ్వరికీ చెప్పకూడదు మరి."

"అలాగే"

"ప్రామిస్ చెయ్యి"

"ప్రామిస్"

"నేను సి ఐ డి ని వరం"

ఉలిక్కిపడింది వరలక్ష్మి "నిజంగానా?" అడిగింది ఆశ్చర్యంగా— అతనికి కొంచెం దూరంగా జరుగుతూ.

అతను నవ్వి ఆమెని దగ్గరకు లాక్కున్నాడు. "నిజంగా వరం, మావయ్య హత్యకేసు విని నాకే ఇది వేయించుకుని వచ్చి పనిచేస్తున్నాను ఇక్కడి వాతావరణం గ్రహించాను కాబట్టి మీ రిక్కడ ఉండటం నా కిష్టంలేదు మిమ్మల్ని బస్తీలో దింపి నేను మళ్లీ వచ్చి ఈ కేసు అంతు తేల్చాలి. నాకున్న అనుమానాలు నాకు ఉన్నాయనుకో— బుజువులు కావాలి .. ఏమిటలా ఎడంగా జరుగుతావు మళ్లీ? నేను సి ఐ డి ని అయినా, పోలీసు ఆఫీసరు నయినా నీకు మాత్రం బావనే—కాబోయే వాడినే!" అని ఆమెని ఇంకా దగ్గరకు లాక్కుని చూపుడువేలు గడ్డంకింద పెట్టి ముఖం పైకెత్తాడు.

ఆమె కండ్లు మూసుకుంది పెదవులు అదురుతున్నాయి

వెనకగా దగ్గు బడి గబుక్కున వెనక్కి చూశాడు రాజారావు రామదాసు తాత!

"ఘటికుడివే మనవడా! మేనరికం పోనిచ్చావు కావు శుభం!" అని నవ్వాడు.

వరలక్ష్మి సిగ్గుపడి లేచి పారిపోయింది

"ముసలాడిని నన్ను చూడగానే సిగ్గొచ్చింది పిల్లకి ఊఁ ... ఇంతకీ నీవెంట వచ్చేందుకు అత్తయ్య ఒప్పుకుందా నాయనా?"

"ఒప్పుకుంటుంది తాతా, తప్పకుండా ఒప్పిస్తుంది వరలక్ష్మి!"

"అదృష్టవంతుడివి రాజా, శుభస్య శీఘ్రం— అని అది గూడా జరిపించేయ్."

"మీవంటివాళ్ల చలవ!"

"దానికేం అదెప్పుడూ ఉన్నదే" నవ్వాడు రామదాసు.

రాజారావు కూడా నవ్వుతూ మెట్లు దిగి గబగబ నడవసాగాడు

ఇంటిదాకా పోయాక గుర్తుకొచ్చింది— తను వరలక్ష్మి కోసం ప్రేమగా కోసిన బంతిపూలు మర్చిపోయాడని! గిరుక్కున తిరిగి దేవాలయం కేసి నడిచాడు కాని, తీరా చూస్తే ఆలయం అంతా వెతికినా కనపడలేదు. మనస్సు చివుక్కుమంది. అతనికి. అవి లేనిదే వెళ్లకూడ దనుకున్నాడు. రామదాసు తాత తీశాడేమోనని అతని పాక దగ్గరికి వెళ్లి పిలుద్దామని కిటికీ గుండా లోపలికి చూశాడు.

లోపలి దృశ్యం చూసి కొయ్యబారిపోయాడు.

రామదాత తాత తలమీదున్న విగ్గు, గడ్డం ఒక్కొక్కటి వూడదీసి పక్కన పెట్టుకుంటున్నాడు అన్నీ తీశాక అతన్ని పరిగ్గా చూశాడు రాజారావు.

అతను ముసిలాడు కాదు. యువకుడు. సుమారు ముప్పై ఏళ్లవాడు. (సశేషం)

# సరాగమాల — వి.ఎ.కె. రంగారావు

ఉగాది సమయంలో శుభాకాంక్షలందజేసిన సరాగమాల అభిమానుల కందరకు సంగీతాంజలి

పెన్నేపల్లి గోపాలకృష్ణ రావనే పేరు తోచరిస్తున్న ప్రణయ గుప్తుడు పంపిన సందేశం. "ఆశయాలూ, ఆనందాలూ, సఫలీకృతం కావటానికి తొలి వికాసం ఈ ఉగాది కొత్త అందాలనూ, ఆనందాలనూ ఈ ఉగాది మీ కందిస్తుందని నా ఆశయం" ప్రణయ రాగ రంజితుడూ అభినవ, అభినయ గుప్తుడూ (వలపుదాచిన వాడని పారాంతరం) అయిన గోపికి అంత అందంగా తన ఆశయాలన సరోక్షంగా పొదుపడం నేత నయింది

దాశరథి ఉగాది కెత్తిన అంజలిలో ఒక భాగం

"హరుని నేత్రానలము నుండి అవలదూకి
ప్రియుని నేత్రాంచలమ్ముల దాగికొనిన
ఐదు పూల బాణమ్ముల జోదువాడు
నాడు చొరలేని చోటు విశ్వానలేదు"

వారికి నే నిచ్చిన సమాధాన ప్రశ్న

నేరక యుండిన నాకు
మారుని యేల గుర్తు తెచ్చితి ?
ఊరక యున్న కూనక
పోరిడమంచు గిలి వ యుటు
కటా సుకవి నాక్య మావేశామా
కలకల రేగ కంతుడు కసిక్

*　　*　　*

క్రిందటి నెలలో కోస్తా ఆంధ్రదేశం జిల్లాల్లో తిరిగినపుడు నూహారు రెండు వందల పాఠకులను, సంగీత సరాగమాలాభిమానులను కలుసుకో గలిగాను ఈ కలుసుకోవటం బస్సులలో, హోటల్ గదులలో, కిల్లీ దుకాణాలలో, ప్రత్యేకంగా యేర్పాటు చేయబడ్డ సమావేశాలలో, సినిమా హాలులలో, రెండు మూడు చోట్ల నడి రోడ్లల జరిగింది వంగరో యెన్నో విధాలైన ప్రశ్నలు వేశారు వాటికి నాకు తోచిన జవాబు లిచ్చాను ఇంకొందరికి కూడా తెలుసుకోవాలనే కుతూహలం ఉంటుందనుకొంటున్న ప్రశ్నోత్తరాలను కొన్నిటిని ఇక్కడ ఇస్తున్నాను

ప్రశ్న సంవత్సరం, సంవత్సరంన్నర క్రిందట యెప్పుడూ సుశీల, ఘంటసాల, జానకి, పి. బి శ్రీనివాస్, బి గోపాలం, జమునారాణి పాటలనే యెక్కువ పరిచయం చేసేవారు మాధవపెద్ది, స్వర్ణలత, పిఠాపురం పాటలు ఎక్కడో, మహా ఉంటే, ఒకటో రెండో ఉండేవి అప్పట్లో మీకు వ్రాసిన ఒక పాఠకుడు భావించినట్లు మొదటి వారంటే మీకు అభిమానమనీ, రెండవ వారంటే లేదనీ మేము వూహించక పోయినా, దీనికి కారణం యేదో ఉందనుకున్నాము ఇది బలపడటానికి కారణం మొదటి తరగతి వారు పాడిన ఒక మాదిరి పాటలు పరిచయం చేశారు కాని రెండవ తరగతి వారు పాడిన మంచివెన్నో వదిలి వేశారు దింట్లో మీ ఉద్దేశ మేమిటో తెలియ పరుస్తారా ?

జవాబు మీరు వ్రాసినది నూటికి తొంభై తొమ్మిది పాళ్లు నిజం మిగిలిన ఒక్క పాలు యేమిటంటే, విపరీతంగా ప్రజాదరణ పొంది, అందరి నోట్లో ఆడే పాటల గురించి వ్రాయడం నాకు అంతగా ఇష్టం లేదు. అందుకోసమే "నమో వెంకటేశా !" పాటను నేను పరిచయం చేయలేదు అందరికీ తెలిసిన పాటను యెవరికని, యెందుకని పరిచయం చేయడం ? ఇక తక్కిన తొంభై తొమ్మిది పాళ్ళ నిజానికి నా కారణాలు ఏజంగ నాకు యెవరన్నా, పాఠకులుగా గాని వ్యక్తులుగా గాని, దురభిమానం లేదు ఎవరో ఒక కేలిగలు కొందరితో చెప్పుకు తిరిగినట్లు కొందరంటే ఇష్టం లేకపోవడం అసలు లేదు అయితే మీరు అన్నట్లు మొదటి విభాగానికి చెందిన పాటకుల పాటలే యెక్కువగా యెందుకు పరిచయం చేశానన్నా, రెండవ విభాగానికి చెందిన వారి పాటలు యెందుకు నొక్కి పట్టానన్నా, ఒకటే జవాబు మొదటి తెగకు చెందిన వారు గాయకులుగా తాము చేయకూడని పనులు చేయ లేదు రెండవ తెగవారు చేశారు ఇది నేను వారి వ్యక్తిగత జీవితం గురించి అనటం లేదు వారి బహిరంగ జీవితం గురించి. వారు శివనోపాధికి అనుసరిస్తున్న కళోపాసన గురించి ఇంతకీ వారు చేసిన చేయరాని పని అశ్లీల హాస్యగీతాల్ని, అవివేక పూరితమైన ఆధునిక పురాణాలు రికార్డులుగా ఇవ్వటమే ఇటువంటివి ఇవ్వకూడదంటే ఆ నాడు వారు వినలేదు దానికి బదులుగా నేను చేయగలిగిన దేమిటే, సరాగమాలలో [illegible] ఆ వారాల పాటలు [illegible] చేయటం లేదు వీరు [illegible] గత అయిదారు నెలల నాటి [illegible] పరిచయం చేశాను ఇక ముందూ కూడా చేస్తాను

ప్రశ్న పాత రికార్డుల విడుదలను ఆపి వేయించిన ఘనత మీదనంటున్నారు కదా, ఇంతకు ముందే విడుదలైన అటువంటి రికార్డుల గురించి యేమిటి చేయబోతున్నారు ? మంచి



"కర్ణ"లో ఎన్. టి. రామారావు.

# సరాగమాల

రికార్డుల విడుదలకు (ప్రైవేటువి) యేమిటి చేయబోతున్నారు ?

జవాబు . బూతు రికార్డులను ఆపివేయించిన ఘనత నాది అని నేనెక్కడా అన్నట్లు నాకు గుర్తు లేదు ఒక వేళ అన్నా అందులో కొంత నిజం లేక పోలేదు కాని అందులో నా ఘనత కన్న అటువంటి రికార్డులను చేసిన వారి బలహీనత యెక్కువ ఉన్నది ఎంత బలహీనత లేక పోతే నాకు జడిసి వారి వ్యాపార సరళిని మార్చుకుంటారు ? వారికి ఆ బలహీనతే, లేకుంటే నేనేమి చేయగలను ? త్యాగరాజ కీర్తనలను, ఘంటసాల వెంకటేశ్వర గీతాలను ఆపివేయటానికి నా తరం కాదు గదా? ఎవరి తరమూ కాదు చెడుకీ మంచికీ ఇదే తేడా! చెడుని ఆపటానికి యెవరైనా చాలు మంచిని అవరోధించటానికి యెవరూ చాలరు

మీ అందరి సహకారం నాకుంటే ఇంతకు ముందు విడుదలైన బూతు రికార్డులను కూడా రద్దు చేయడానికి అవకాశం ఉంటుంది చతుర్విధో పాయాలు నంధించడానికి సంసిద్ధుణ్ణి నేను ఇక మంచి రికార్డుల విడుదల గురించి, నాకు తోచిన సలహాల నిచ్చి నాలుగైదు రికార్డులను విడుదల చేయించాను. చెప్పుకో దగినంతగా అవి అమ్ముడు పోలేదు దీనికి కొంత కారణం ప్రైవేటు రికార్డులు కొనేవారిలో ఆంప్లిఫైయరు వాళ్ళే యెక్కువగా ఉండటం. వాళ్ళకి సంగీత, సాహిత్య మీమాంసకన్నా బూతు మీదనే, గోల మీదనే, ఆసక్తి యెక్కువగా ఉండటం

ప్రశ్న పదేళ్ళ క్రిందటి సంగీతానికీ ఇప్పటి సంగీతానికీ తేడా ఏమిటంటారు ? దాని స్థితి దిగజారిందా, యెగబ్రాకిందా, దానికి కారణాలు యేమిటి ?

జవాబు ఆ నాటి సంగీతం ఈ నాటి సంగీతం కన్నా అన్ని విధాలా మెరుగే ఆ నాటి పాటలలో వరస యెంతో సులభంగా ఉండేది వాద్య గోష్ఠిలో గొడవ ఉండేది కాదు. ఎంతో లలితంగా ఉండేది. ఈ మధ్యనే "స్త్రీ సాహసం" "బాలరాజు" "ప్రేమ"లో పాటలు మళ్ళీ విన్నాను ఎంత హాయిగా ఉన్నవని ఆ తరువాత ఈ నాటి పాటలు వింటే రొదగా ఉంటుంది ఈ నేరానికి సమపాళ్ళలో సంగీత దర్శకులూ, ప్రేక్షక— శ్రోతలూ బాధ్యులు గొడవ గొడవ సంగీతాన్ని ఒకరందిస్తూ ఉంటే మరొకరు ఆనందిస్తూ ఉన్నారు ఈ మాట ఒక తెలుగు సంగీతం గురించే కాదు హిందీ, తమిళ చిత్రాల సంగీతం గురించీ అనవచ్చు ముఖ్యమైన ఉదాహరణ శంకర్— జైకిషన్ పదేళ్ళనాటి అమర సంగీతమూ, ఈ నాటి శబ్దా డంబరమూ. ఇప్పట్లో ఈ పరిస్థితి బాగుపడుతుందనుకోను లలితంగా చేస్తే ప్రజలకు నచ్చుతుందో నచ్చదో అని యెవరి భయం వారిది లక్షలు వెచ్చించే నిర్మాత యెందుకీ దుస్సాహసం, ఉన్న పద్ధతినే అనుసరిద్దామనుకుంటాడు అతని మాట కెదురాడరు సంగీత దర్శకులు ఈ విషవలయం నుంచి బయట పడేదెలాగ ?

ప్రశ్న : మీరు అన్ని భాషల రికార్డులు వింటుంటారు గదా, ఏ భాష చిత్ర సంగీతం ఇప్పట్లో బాగా ఉంటున్నది ?

జవాబు అన్ని భాషల రికార్డులు అంటే హిందీ, తమిళం, తెలుగు, కన్నడం, మళయాళం అయితే, ఇవన్నీ చాలమట్టుకు వింటూ ఉంటాను. ఇప్పట్లో కన్నడ చిత్ర సంగీతం చాలా మెరుగ్గా ఉందని చెప్పుకోవచ్చు. దీనికి చాలా మట్టుకు కారణం మంచి సంగీతాన్ని ఆదరించి అభిమానించ గలిగిన శక్తి కన్నడ ప్రేక్షకులకు ఉండటం, పైగా అసమానమైన ప్రజ్ఞాధురీణులు జి.కె వెంకటేష్, టి జి. లింగప్ప కన్నడ సంగీత దర్శకులవటం ఇంతకీ వారు హిందీ, తెలుగు, తమిళ రంగాలలో లేరా అంటే, ఉన్నారు కాని హిందిలో తమిళంలో ఆ ప్రజ్ఞ కలవారు కూడ శబ్దానికే ప్రాముఖ్యత ఇస్తున్నారు తెలుగులో పెండ్యాల, రాజేశ్వరరావాదులు ఉన్నారు కాని, వారి చిత్రాలు సంవత్సరానికి నాలుగుంటే గొప్ప. కన్నడంలో అలా కాదు. పది చిత్రాలు విడుదలయితే అందులో యెనిమిదింటికి పైన పేర్కొన్న ఇద్దరు సంగీత దర్శకులు. హిందీలో కూడా యెప్పుడూ ఉత్తమ సంగీతమే అందించే సి రామచంద్ర, సలిల్ చౌదరి, మదన్మోహన్ లేకపోలేదు కాని వారి చిత్రాలు తక్కువ. తక్కిన రకం, తక్కువ రకం సంగీతం గల చిత్రాలు యెక్కువ ఇంగ్లీషు రికార్డులంటే నాకంతగా శ్రద్ధ లేదు హిట్ పెరేడ్ ఆందేవ్ గారి నడిగితే అన్ని వివరాలు తెలుస్తాయి. ★



'రాముడూ - భీముడు'లో ఎన్. టి. రామారావు, ఎల్ విజయలక్ష్మి.

# ముఖ్యమంత్రికి చలనచిత్ర పరిశ్రమ సభ్యుల సన్మానం!

మార్చి మూడవ వారంలో ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి మద్రాసు వచ్చినపుడు చలన చిత్ర పరిశ్రమ సభ్యులంతా విజయ గార్డెన్స్‌లో ఆయనను సన్మానించారు ఇంచుమించు 112 మంది నిర్మాతలు కలిసి ముఖ్య మంత్రిని గౌరవించిన ఈ సభకు దర్శకుడు శ్రీ బి ఎన్ రెడ్డి అధ్యక్షత వహించగా, సన్మాన పత్రాన్ని శ్రీ బి నాగిరెడ్డి చదివారు వివిధ సంస్థల తరఫున ముఖ్యమంత్రిని పుష్ప మాలాలంకరణ జరిగిన తరువాత నటుడు శ్రీ యస్. వి రంగారావు చలన చిత్ర సభ్యుల తరఫున ముఖ్య మంత్రికి సమర్పించిన ఒక విజ్ఞప్తిని చదివారు విజ్ఞప్తి పత్రాలను సభాసదులకు కూడా పంచి పెట్టారు

తరువాత ముఖ్యమంత్రి 'సన్మానానికి విజ్ఞప్తి'కి కూడా సమాధానమిస్తూ, "ఆంధ్ర రాజధానిలో తెలుగు సంస్కృతిని తెలుగు వాతావరణాన్ని, కల్పించటానికి గాను సినిమా పరిశ్రమకు సహాయం చేయాలనే కోరిక కలిగింది— ఈ ఏర్పాటు భాషా ద్వేషం మూలమునగాని, ఏ ఒక్కరినో మనసులో ఉంచుకుని జరిగినది గాని, కాదు పరిస్థితులు అలాంటి అభిప్రాయానికి దారితీస్తే సరిదిద్దుకోవచ్చును" అని చెప్పారు. "అంతే కాదు, చలన చిత్ర అభివృద్ధి విషయంలో సలహాలిస్తే వినటానికి తయారుగా ఉన్నాము ఇంకా ఆలోచించటానికి సిద్ధంగా ఉన్నాము పెద్దలు కొందరు అక్కడ కూడా కొంత 'పుష్' చేసి ఈ 'యాక్టివిటీ'కి దోహదం చేస్తే ఎంతో కృతజ్ఞతతో ఉంటామని మనవి చేస్తున్నాం" అని కూడా ఆయన యీ సందర్భంలో విశదీకరించారు

చలన చిత్ర సభ్యుల తరఫున ముఖ్యమంత్రికి శ్రీ యస్ వి రంగారావు చదివి సమర్పించిన విజ్ఞప్తి పత్రాన్ని దిగువ వేస్తున్నాం

శ్రీ ఘంటసాల ప్రార్థనతో ప్రారంభమయిన సభలో శ్రీ బ్రహ్మానందరెడ్డికి స్టూడియో యజమానుల తరఫున శ్రీ బి నాగిరెడ్డి, దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలి తరఫున శ్రీ వి యల్ శ్రీనివాసన్ నటీనటుల తరఫున శ్రీ యన్ టి రామారావు, సినీ 'మ్యూజీషియన్స్' సంఘం తరఫున శ్రీమతి పి లీల, సినీ టెక్నీషియన్ల తరఫున శ్రీ యం లింగమూర్తి, ఆంధ్రా ఫిలిం జర్నలిస్టుల తరఫున శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావు, డబ్బింగ్ ఆర్టిస్టుల పక్షాన శ్రీశ్రీ, డబ్బింగ్ నిర్మాతల సంఘం తరఫున డి యల్ నారాయణ, జూనియర్ టెక్నీషియన్ల తరఫున శ్రీ కె వినాయగం, నేపధ్యగాయకుల సంఘం తరఫున శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు ముఖ్యమంత్రికి పూల మాలలు వేశారు. శ్రీ వినాయగం పుష్పమాలలతో పాటు జాతీయ సమైక్యతకు చిహ్నముగా ఖద్దరు ఉత్తరీయమును కూడా సమర్పించారు.

## 'అవీ - ఇవీ - అన్నీ

ఈ ఘనమైన సన్మాన సభకు ముందు అల్పాహారవిందుకూడా జరిగింది

విజ్ఞప్తి పత్రం యధాతథంగా యిక్కడ ముద్రిస్తున్నాము

## విజ్ఞప్తి పత్రం

అధ్యక్షా!

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులు, గౌరవనీయులు శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారూ! సోదర సోదరీమణులారా!

నేడు చాలసుదినం! ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారు మద్రాసు



'రాముడు - భీముడు'లో జమున, రామారావు.

# అవి - ఇవి - అన్నీ

నగరానికి విచ్చేయడం ఇదే ప్రథమం ! వారికి తెలుగు చలనచిత్ర పరిశ్రమ తరఫున హృదయ పూర్వకంగా స్వాగతం చెబుతున్నాం.

సామాన్యంగా రాజకీయ నాయకులకు సినిమా అంటే ఆసక్తి వుండడం అరుదు కాని శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారికి అలాకాదు వారికి సినిమా పరిశ్రమ అంటే ఎంతో ఆదరాభిమానాలున్నయ్ ఈ పరిశ్రమను అభివృద్ధి చెయ్యాలనే ఆకాంక్షను ఆచరణలో పెట్టడానికి వారు ప్రయత్నిస్తున్నారు అందుకు వారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాం.

బ్రహ్మానంద రెడ్డిగారూ !

హైదరాబాదులో సినిమా పరిశ్రమాభివృద్ధికి ఆంధ్ర ప్రభుత్వం నడుంకట్టిందని విన్నప్పుడు ఆనందంతో పొంగిపోయాం ఇతర రాష్ట్ర ప్రభుత్వాలకు ఆంధ్ర ప్రభుత్వం ఆదర్శమవుతున్నదని గర్వించాం అభివృద్ధి పథకాలు వేసేముందు, సినిమా పరిశ్రమకు ప్రాతినిధ్యం వహించగల పెద్దలను, అనుభవజ్ఞులను పిలిపించి, ప్రభుత్వం సంప్రదిస్తుందని ఆశించాం కాని దురదృష్టవశాత్తు అలా జరగలేదు

మమ్మల్ని సంప్రదించలేదని మేం చిన్నబుచ్చుకోవడం లేదు ఆంధ్ర ప్రభుత్వం చేసిన నిర్ణయాలు వారి ఔదార్యాన్ని సూచిస్తున్నవి కాని, వారు తలపెట్టిన సహాయం అర్హులైన వారికి, నిజంగా అవసరమున్నవారికి లభిస్తున్నదా అనేది సందేహాస్పదం

హైదరాబాదులో తీసిన ప్రతి చిత్రానికి ప్రభుత్వం 50 వేలు ఇస్తామన్నారు యీ సహాయాన్ని వినియోగించుకొనుటకు, ఇక్కడ కొందరు నిర్మాతల వుత్సాహంతో ముందుకు వచ్చారు. హైదరాబాదు సారథి స్టూడియోలో మొట్టమొదటి చిత్రం నిర్మించి, తరువాత 'హైదరాబాదు మూవీస్' అనే పేరుతో సంస్థను స్థాపించి, మరల అక్కడ రెండు చిత్రాలు తీసిన నిర్మాత శ్రీ పి గంగాధరరావు ఆంధ్ర ప్రభుత్వ ప్రకటన చూచి, మరల హైదరాబాదులో చిత్రం నిర్మించాలని అక్కడకు వెళ్ళారు కాని అక్కడ — ఒక్క అగ్రనటుడు అభిమానించి, నటించే నలుగురైదుగురు నిర్మాతలకు తప్ప, తనకు చిత్రం నిర్మించే అవకాశం ఆ స్టూడియోలో లేనందువల్ల, తిరిగి వచ్చి మద్రాసులో చిత్రనిర్మాణం ప్రారంభించాడు. ఆంధ్ర ప్రభుత్వ సహాయం పొందడానికి అతనికంటే అర్హుడు ఎవరు ? అతని స్థితే ఇలా వున్నదని తెలిసి, అనుభవమున్న యితర నిర్మాతలు గూడ కొందరు ఆ ప్రయత్నం విరమించుకున్నారు.

దీనినిబట్టి, ఆంధ్ర ప్రభుత్వం తలపెట్టిన సహాయం, ఒక్క అగ్రనటుడు అభిమానించి, నటించే నలుగురైదుగురు నిర్మాతల వర్గానికే వుపయోగ పడనున్నదేమోనని మా సందేహం ఈ పరిస్థితిని సరిదిద్ది, ప్రభుత్వ సహాయం సద్వినియోగం అయ్యేమార్గాలు ఆలోచించవలసిందని మీకు మనవి చేస్తున్నాం.

తెలుగు సినిమా పరిశ్రమ పుట్టింది ఇక్కడ! ఎందరో కళాతపస్వుల నిరంతర కృషితో, అకుంఠిత దీక్షతో — యీ పరిశ్రమ ఇక్కడ వేళ్ళూనుకొని, శాఖోపశాఖలతో విస్తరిల్లి, ఒక మహావృక్షంగా స్థిరపడింది దీనిని ఒక్కసారి కూకటి వేళ్ళతో పెకలించి మరొకచోట నాటటం సాధ్యంగాని పని. ఒకవేళ ఆవేశపడి, బలవంతంగా పెకలిస్తే అది చచ్చిపోతుందేగాని, ఎవరికీ ఉపయోగపడదు

శ్రీయుతులు నాగిరెడ్డి, రామారావులు హైదరాబాదుకు వచ్చేస్తే జరిగేదేమిటి ? ఇక్కడ ఈ పరిశ్రమలో పని చేసే నటీ నటులు, సాంకేతిక నిపుణులు, దర్శకులూ, సంగీత దర్శకులూ, వాయిద్య నిపుణులు, నేపథ్య గాయకులు, నృత్య దర్శకులు కళా దర్శకులు, ఫొటోగ్రాఫర్లు, మొదలైన వేలాది కుటుంబాల మాట ఏమిటి ? వీరందరి జీవనోపాధికి ఇక్కడ ఎన్నో సౌకర్యాలున్నయ్. ఒక్క తెలుగు సినిమాలలోనే గాక, వీరంతా తమిళ, కన్నడ, మలయాళ, హిందీ చిత్రాలలో గూడా పని చేస్తున్నారు. అవన్నీ వదులుకుని అగ్ర నటులతోపాటు వీరంతా హైదరాబాదుకు వస్తే, ఈనాడు అక్కడ వీరందరికీ జీవనోపాధి చూపించడం సాధ్యమా ?

రెడ్డిగారూ !

మీరు అనుభవజ్ఞులు ! కళాభిమానంతో, సహృదయంతో మీరు తలపెట్టిన ఈ ఉద్యమం మా క్షేమం కోసమే నని మాకు తెలియదా ! — కాని వెంటనే, ఉన్నట్టుండి, మేము హైదరాబాదుకు కదలి రావాలంటె ఇన్ని సాధక బాధకాలున్నయ్ ! సానుభూతితో, సావకాశంగా పరిశీలిస్తే, ఇవి మీకు అర్థం కాని కావు ! వీటన్నిటినీ మరుగు పరచి, మాకు ఆంధ్రాభిమానం లేదనీ, హైదరాబాదులో పరిశ్రమాభివృద్ధికి మేమంతా వ్యతిరేకులమనీ, మా మీద కొందరు స్వార్థపరులు ప్రజలలో దుష్ప్రచారం సాగిస్తున్నారు మేము తీసే చిత్రాలకు జీవనాధారమైన ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలను, అసత్యాలతో, అపనిందలతో విషకలుషితం చేస్తున్నారు. దీనిని అరికట్టి, యథార్థాన్ని ఆంధ్ర ప్రజలకు తెలియజేసి, మాపై కొందరు, ప్రజలలో కలుగజేసిన అపోహలను తొలగజేయు గలరనే విశ్వాసంతో ఆంధ్ర ప్రజా నాయకులైన మీకు సవినయంగా ఈ విషయాలు విన్నవించుకుంటున్నాం.

మరొక్క విషయం !

తన వ్యక్తిగత అనుకూలం కోసం హైదరాబాదు వెళుతున్నానని చెప్పిన "నట సామ్రాట్టు" శ్రీ నాగేశ్వరరావు పోతూ పోతూ 'మద్రాసులో ఆంధ్రులకు గౌరవం లేదు' అని ఒక మాట వేసి పోయాడు.

తమిళులకే మా మీద అట్టి భేదభావముంటే, మేము ఇక్కడ ఉండగలిగే వారమా ? ఈ పరిశ్రమ ఇంత ఉన్నతస్థితికి వచ్చేదా ? అసలు తాను ఇంత వాడయ్యేవాడా ! ఇక్కడ తెలుగు తమిళ భేదాలే లేవు. దీనికి ఎన్నో నిదర్శనాలు చూపగలం !

తమిళ సినిమా రంగంలోనే గాక, అఖిల భారత ఖ్యాతి నార్జించిన శ్రీయుతులు భీమ్‌సింగ్, శ్రీధర్, బి యస్ రెడ్డి, కె వి రెడ్డి, యల్ వి. ప్రసాద్, తాతినేని, బి. ఆర్. పంతులు, ఆదుర్తి, పి. పుల్లయ్య, మొదలైన దర్శకులు, తమిళ రంగంలో ఉత్తమ నటీ నటులుగా పరిగణింప బడి, తమిళులచే ఎంతో ఆదరింప బడుతున్న శ్రీమతులు కన్నాంబ, భానుమతి, అంజలీదేవి, సావిత్రి, దేవిక, జానకి, జమున, శ్రీయుతులు నాగయ్య, రామారావుమొదలైన నటీనటులు, శ్రీమతులు సుశీల, జానకి, జిక్కి, శ్రీయుతులు ఘంటసాల, పి బి. శ్రీనివాస్, ఏ. ఎం. రాజా మొదలైన నేపథ్య గాయకులు, శ్రీయుతులు రాజేశ్వరరావు, ఘంటసాల, చలపతిరావు, రాజా మొదలైన సంగీత దర్శకులు—వీరంతా తెలుగువారు. ఇంకా ఇటువంటి వారు అన్ని శాఖలలో లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. జెమిని, ఏ. వి.



'మైరావణ'లో మిక్కిలినేని, రేలంగి.



"డాక్టర్ చక్రవర్తి" లో నాగేశ్వరరావు.

# అవీ - ఇవీ - అన్నీ

ఏం., పక్షిరాజా, మోడరన్ థియేటర్స్, ఏం పి వి, ఆర్. ఆర్, పిక్చర్స్, పద్మిని పిక్చర్స్, గినస్, విఠలాచార్య, మొదలైన తమిళ, కన్నడ, నిర్మాతలు తెలుగు చిత్రాలు నిర్మిస్తున్నారు ఈ నాడు 'మేము తెలుగు వారమ'ని చెబితే తప్ప తమిళులకు గుర్తురానంత అన్యోన్యంగా, ఒకే కుటుంబంగా ఇక్కడ మేము కలిసి మెలిసి మెలుకుతున్నాం భాషా భేదాల పక్షణ ఏ మాత్రం చూపకుండా మద్రాసు ప్రభుత్వం విశాల హృదయంతో మమ్మల్ని ఆదరిస్తున్నది ఇటువంటి పరిస్థితుల్లో 'తెలుగు వారికి మదరాసులో గౌరవం లేదు' అని బాధ్యతా రహితంగా మన నటసమ్రాట్టు ఒక నిప్పు రవ్వవేసి పోయాడు దానిని మేము ఎలాగో ఆరి పార వేశాం.

భారీ ఎత్తున చిత్రాలు తీసే నిర్మాతలతో పోటీ పడలేక, అడుగుపడి అజ్ఞాతంగా ఉండిపోయిన మేధావులలో, **Creative Genius** లలో, సత్యజిత్ రాయ్ వంటి వాళ్ళని ఒక్కణ్ని బయటకు తీయండి ప్రభుత్వ సహాయం లేకపోతే వాళ్ళు బయటికి రాలేరు బెంగాల్ ప్రభుత్వం ఆదుకొనకపోతే, ప్రపంచ సినిమా రంగంలో భారత జాతి పేరును దేదీప్యమానంగా వెలిగించిన ఒక మహాశిల్పి మనకు దక్కేవాడు గాదు ఆ భిక్ష పెట్టిన బెంగాలు ప్రభుత్వానికి యావద్భారతం రుణపడి ఉన్నది

సత్యజిత్ రాయ్‌లు ఆంధ్ర ప్రదేశంలో గూడ ఉన్నారు. కాని అజ్ఞాతంగా పడి ఉన్నారు వాళ్ళకి



అసలు మన 'నటసమ్రాట్టు' ఇక్కడ నుంచి ఎందుకు వెళ్ళాడో, ఆయనకూ తెలుసు, ఇక్కడి సినిమా ప్రపంచానికీ తెలుసు ఎక్కడున్నా అతను వృద్ధిలోకి వచ్చి, ఇంకా ఎక్కువ కీర్తి, ఎక్కువ ధనం ఆర్జించాలనే మేం సర్వదా కాంక్షిస్తాం !

మరొక్క మనవి !

నేడు తెలుగు చిత్రాల సంఖ్య పెరుగుతున్నదే గాని, స్థాయి తగ్గుతున్నది చిత్రాల సంఖ్యతో పాటు స్థాయికూడా పెంచితేనే ప్రభుత్వ ఆశయం నెరవేరుతుంది అఖిల భారతంలోనూ, అంతర్జాతీయంగానూ ఆంధ్రజాతికి ఖ్యాతితెచ్చే ఉత్తమ చిత్రాలను ప్రోత్సహించండి అద్వితీయ సృజనాత్మక శక్తి కలిగి కూడా, అగ్రశ్రేణి తారలతో చేయూత ఇవ్వండి' మట్టిలో మాణిక్యాలవలె మరుగుపడిన నూతన నటీనటులతో, జాతిని ఉత్తేజ పరచే కథా వస్తువులతో, అపూర్వమైన సంవిధానాలతో, వినూత్న పోకడలతో చిత్రాలు నిర్మించే నిర్మాతలను ప్రోత్సహించండి వారికి ధన సహాయం చెయ్యండి సాంకేతిక సదుపాయాలు కల్పించండి చిత్రాలు తీయించండి — అర్హమైన వాటిని ప్రభుత్వం తరఫున కొనండి ! మీరు వెచ్చించే ప్రజాధనం సార్థక మవుతుంది ! ఆంధ్ర ప్రజ మిమ్మల్ని అభినందిస్తుంది ! ఆంధ్ర కళామతల్లి కృతజ్ఞతతో ఒడలు పులకరించి మిమ్మల్ని ఆశీర్వదిస్తుంది ! !

తమరిని సన్మానించుటకు ఏర్పాటైన ఈ సభలో చెప్పడానికి మనసొప్పని విషయాలు గూడ కొన్ని చెప్పవలసి వచ్చింది అందుకు అన్యథా భావించవలదని ప్రార్థిస్తున్నాం మీరు, మా కష్టసుఖాలు చెప్పుకోదగిన పెద్దలు, కళాభిమానులు విశాల హృదయులు, ప్రజా నాయకులనే పూజ్యభావంతో — మీకు మాపైగల అభిమానాన్ని పురస్కరించుకుని ఈ కాస్త చనువు తీసుకున్నాం

మేము ఎక్కడ ఉన్నా ఆంధ్రులమే ! మీవాళ్ళమే! మమ్మల్ని పరాయి వాళ్ళుగా తోసివేయకండి ! మేమూ సర్వదా వాంఛించేది ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలే ! మాపై ఆంధ్ర ప్రజలలో, ఎవరైనా స్వార్థపరులు అపోహలు కల్పిస్తే, మా తరఫున మీరు, వాటిని తొలగించండి !

మేము ఎక్కడున్నా మీరు మా నాయకులు, మేము మీ అనుచరులం ! మీరు చేసే ప్రజా సేవలోనూ, మేమంతా ఎల్లప్పుడు మీతో ఉండగలమని మళ్ళీ మళ్ళీ మనవిచేస్తూ, మా ఆహ్వానాన్ని మన్నించి, మాకు ఈ అవకాశం ఇచ్చినందుకు మా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనాలు అర్పించుకుంటున్నాం ! ఇట్లు,

తెలుగు చలనచిత్ర పరిశ్రమ సభ్యులు. ★

* * *

తెలుగు మహాజన సమాజ ప్రాథమిక పాఠశాల 'పేరెంట్స్ డే' ఏప్రిలునే మద్రాసులో ట్రిప్లికేను మగాగీ ఎంకల్ హాలులో జరిగింది రేడియో గాయకుడు శ్రీ మల్లంపల్లి ఉమామహేశ్వరరావు అధ్యక్షత వహించారు కార్యదర్శి శ్రీ లక్ష్మీ నారాయణ, కళాశంకర్ ప్రభృతులు ప్రసంగిస్తూ పాఠశాల ప్రాముఖ్యాన్ని కొనియాడారు. పాఠశాల భవన నిర్మాణానికి సహకరించవలసిందని కార్యకర్తలు విజ్ఞప్తి చేశారు బాల బాలికల వినోద ప్రదర్శనంతో కార్యక్రమం ముగిసింది

* * *

త్యాగరాయనగర్‌లోని వాణీ మహల్‌లో ఏప్రిల్ 15 సాయంత్రం కుమారి యుడవల్లి రమ కూచిపూడి నృత్యాలను ప్రదర్శించింది

రంగపూజతో నృత్య కార్యక్రమం ఆరంభమయింది తరువాత 'కృష్ణశబ్దం' అభినయించింది

బాలగోపాల నృత్యం, కృష్ణుని ఒనరం, పాదుకా పట్టాభిషేకం, తిల్లాన, భామాకలాపం, మొదలైన నృత్యాల భంగిమలను కుమారి రమ మనోరంజకంగా ప్రదర్శించింది.

* * *

"శార్వరి వ్రాసిన "చరిత్రహీన" అను 127 పుటల నవల వెల రూపాయి గలది మా కార్యాలయం చేరినది ప్రతులకు పద్మప్రియ పబ్లికేషన్స్, మద్రాస్—33

* * *

'లావణ్య' అను కొత్త మాసపత్రిక కనకమేడల సంపాదకత్వంలో వెలువడుతున్నది మొదటి సంచిక మా కార్యాలయం చేరింది వెల 60 న. పైసలు. ★

# మద్రాస్ సినీమా వార్తలు

## యస్. ఎన్. ఏ. పి. వారి

### బభ్రువాహన



ఎస్. యన్. ఎ. పి వారి 'బభ్రువాహన' ప్రారంభోత్సవ దృశ్యం ఈ ఫొటోలో సి. జగన్మోహనరావు, యన్. త్రివిక్రమరావు, సముద్రాల, యన్ టి. రామారావు, డి. వి. యస్. రాజుగారలను చూడవచ్చును

శ్రీ నేషనల్ ఆర్ట్స్ పిక్చర్స్ వారు "బభ్రువాహన" చిత్రాన్ని పూర్తి చేయదలచి ఏప్రిల్ 17వ తేదీ వాహినీ స్టూడియో, 5వ ఫ్లోర్‌లో ఉదయం 7 గంటలకు అర్జునుడి వేషంలో నున్న యన్ టి రామారావుతో ప్రథమ చిత్రీకరణ చేసి ప్రారంభించారు

తర్వాత చిత్రాంగదతో కలిసి ఒక పాటను కూడా చిత్రీకరణ చేశార,

ఏడు తరాలుగా ఒకే పుత్రవంశంకురంగా వస్తున్న రాజకుటుంబంలో ఆ రాజుకి పుత్రిక జననం జరిగింది కాని మహారాజు పుత్రుడుగానే ప్రకటించి— మగవేషంలో దర్బారులో ఆ రాజ పుత్రికను చూపిస్తూ చెలికత్తెలతో ఉద్యానవనం వగైరాలకు పంపిస్తుంటాడు

ఆ చెలికత్తెను అర్జునుడు కలుసుకుంటాడు ప్రేమగా గౌరిలిస్తుంగి ఒక రోజు రాజదర్బారులో ఆ యువతిని మగవేషంలో చూస్తాడు పైగా మాటల సందర్భంలో వచ్చిన వ్యక్తి అర్జునుడు అని తెలియగానే లేచి వెళ్ళిపోతుంది అర్జునుడు గమనిస్తాడు ఇందులో ఏదో విషయం ఉంది తప్పకుండా ఆ అమ్మాయిని వివాహం చేసుకోవాలని పట్టుదల పడతాడు

ఉద్యాన వనంలో చెలికత్తె కలుస్తుంగి ఆ రాకుమారిని కలుసుకోవాలి ఎలా అయినా ఆ అవకాశం కల్పించ మంటాడు "వీలుపడదు. ఆ రాకుమారుడు వ్రతంలో ఉన్నారం"టుంది "వ్రతంలో ఉన్నది తనుకదా పోనీ నేనే వెళ్తానం"టాడు "ప్రయోజనం లేదంటుంది"

"వారు వచ్చినాసరే— లేదా— నన్ను అక్కడకు తీసుకుపోయినాసరే" అంటాడు అర్జునుడు చేసేది లేక సరే అంటుంది వెళ్లిపోతుంది చెలికత్తెల సలహా కూడా వింటుంది మగవేషంతో అర్జునుడ్ని కలుసుకుంటుంది ఆమెనుకాక మరో కామెను ప్రేమించినట్టు తెలియజేస్తాడు వారి మాటలలో ఆ రాకుమార్తె ప్రవర్తనలో తలపాగా వూడి క్రింద పడుతుంది రహస్యం బయట పడుతుంది ఆమె పేరు చిత్రాంగద.

అర్జునుడికి— చిత్రాంగదకు వివాహానికి ఏర్పాట్లు సాగుతుంటాయి చిత్రాంగద తండ్రి అర్జునుడ్ని ఒక కోరికను కోరుతాడు

ఏడు తరాలబట్టీ వస్తున్న తన వంశ విష యం— ఈ తరంలో జరిగిన రహస్యం తెలియజేస్తూ నా కుమారికి మగశిశువు కలిగినంత వరకు ఇక్కడే ఉండాలని, తనే ఈ రాజ్య వారసుడు అని కూడా చెబుతాడు

అర్జునునికి, చిత్రాంగదకు మహా వైభవంగా వివాహం జరుగుతుంది. కొంత కాలానికి చిత్రాంగద గర్భవతి అవుతుంది అర్జునుడు ప్రయాణమవుతాడు

"శిశు జననం జరుగకుండానే ఏమిటి నాయనా ఈ ప్రయాణం" మామగారు అర్జునుని అడుగుతారు

గర్భంలో ఉన్నది మగశిశువే! మీకు ఆ సందేహం అక్కర్లేదని అర్జునుడు వెళ్లిపోతాడు కొంత కాలానికి చిత్రాంగద ఒక సుముహూర్తాన సూర్య భగవానుని తేజస్సును పరిహాసే మగ శిశువునే ప్రసవిస్తుంది

* * *

పాండవుల అశ్వమేధయాగం— అశ్వాన్ని వదలటం, దాని వెనుక అర్జునుడు వెళ్లడం ఆ అశ్వాన్ని బభ్రువాహనుడు బంధించి తీసుకు వెళ్లి ఈ విషయాన్ని తన తల్లి చిత్రాంగదతో చెప్తాడు ఆమె బాధ పడుతుంది జరిగిన దానికి విచారిస్తుంది.



"దేశద్రోహులు"లో దేవిక, కాంతారావు, ఎన్. టి. రామారావు.

కుమారుడ్ని మందలిస్తుంది. అశ్వాన్ని మీ తండ్రి అర్జునుడికి అప్పగించి అంత పురానికి ఆహ్వానించ మంటుంది— కాని .. వీరుల లక్షణం కాదని— నేను కూడా ఆ అర్జునుని కుమారునినే గనుక నాతో పోరాడి— నన్ను గెలిచి అశ్వాన్ని తీసుకు పోవలసిందే కాని నాఅంతటగా తీసుకుపోయి అశ్వాన్ని తన వశపరచడం జరగని పని అంటాడు

తల్లి మాట జవదాటిన కుమారుడు నాకు ఉన్నాడన్న కీర్తిరానీ ! నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి. వెళ్ళు— అంటుంది

బభ్రువాహనుడు ఆ నింద నాకెందుకని గుర్రాన్ని వశ పరచడానికి వెళ్తాడు తండ్రి దగ్గర అవమాన పడి ఇంటి ముఖం పడతాడు జరిగిన విషయాన్ని తల్లికి తెలియజేసి ఇంత కంటె అవమానం ఏమి జరగాలి అంటూ బాధతో కుమిలిపోతాడు బభ్రు వాహనుడు

చిత్రాంగదే స్వయంగా అర్జునుని గుడారానికి వెళ్తుంది. తనకు కూడా అదే జరుగుతుంది. ఈ విధంగా జరుగుతుందని కలలో కూడా అను కోని చిత్రాంగదకు ఇదంతా విచిత్రంగా ఉం టుంది. ఇంటికి వస్తుంది ఏడుస్తుంది బాధ పడుతుంది కుమిలిపోతుంది

# సినిమా వార్తలు

జరిగిన దానికి విచారించి పని లేదని యుద్ధంలో నన్ను గెలిచి తను అశ్వాన్ని తీసుకు వెళ్లాల్సిందే— అంటూ యుద్ధానికి సిద్ధమవుతాడు బభ్రువాహ నుడు

అశ్వాన్ని బంధించి బభ్రువాహనుడు తీసుకు వచ్చినప్పుడు— బభ్రువాహనునిపై తన తల్లి చిత్రాం గద కోపగించినప్పుడు నాగరాజు కుమార్తె ఉలూచి కూడా చిత్రాంగద మందిరంలోనే ఉంటుంది బభ్రువాహనుని ఎక్కువగా ప్రోత్సహించింది కూడా ఉలూచి

చిత్రాంగద మందిరం సెట్టులోనే ఈ సన్ని వేశం చిత్రీకరించారు ఈ సన్నివేశంలో అర్జును డుగా రామారావు, చిత్రాంగదగా యస్ వరలక్ష్మి, బభ్రువాహనుడుగా చలం, ఉలూచిగా రాజసులో చన పాల్గొన్నారు

వీరుగాక ఇంకా ఈ చిత్రంలో రేలంగి, కాంతా రావు, ముక్కామల, వంగర, పేకేటి, అల్లు రామలింగయ్య, కీ శే సి యస్ ఆర్. వగైరాలు ఉన్నారు

ఈ చిత్రానికి కథ, మాటలు, పాటలు, దర్శ కత్వం * సముద్రాల రామానుజాచార్య, సంగీతం : పామర్తి, ఛాయ: కమల్ బాబు, నృత్యం పసు మర్తి, కళ వాలి అండ్ తోట, కూర్పు హరి నారాయణ, అసోసియేట్ దర్శకత్వం • విజయా రావు, ప్రొడక్షన్ యన్ జార్జి, యస్ చిట్టి బాబు, స్టూడియో, వాహిని, విజయా, నిర్మాత: సి జగన్మోహనరావు

## ఉయ్యాలా-జంపాలా

సినస్ స్టూడియోలో కృష్ణకుమారి, చలం వగైరాలతో ప్రథమ చిత్రీకరణ 'జరిగింది బాలి బాలికల పాఠశాలలో వాసంతి, మీనాకుమారి పంతులమ్మలుగా ఒక పాటను కూడా చిత్రీకరిం చారు

అదొక మెయిల్ రన్నర్ సుబ్బయ్య ఇల్లు. తనకు దెబ్బలు తగిలినందువలన ఇంట్లో మంచం, మీద పడుకుంటాడు సుబ్బయ్య తల్లి బామ్మ వీధి అరుగుమీద అరటిపళ్ళు, బటానీల కొట్టు పెట్టుకొని అమ్ముకుంటుంది.

పోస్టుమాష్టరు కొడుకు కైలాసం ఉత్త

రాలా తీసుకొని సుబ్బయ్య ఇంటికి వచ్చి ఈ పెని చాల కష్టంగా ఉందని అంటూ సుబ్బయ్య కష్ట సుఖాలు అడుగుతూ సుబ్బయ్య కూతురు పార్వతి కోసం చూస్తుంటాడు

"అబ్బాయ్ ! నువు మా అమ్మాయితో సహవాసం చేయడం అంత మంచిది కాదు నాకు కూడా ఇష్టం లే'దంటాడు సుబ్బయ్య కైలాసంతో

సుబ్బయ్యగా చదలవాడ కుటుంబరావు, కైలాసంగా చలం, పార్వతిగా మీనాకుమారి, భామ్మగా లక్ష్మీకాంతమ్మ పాల్గొన్నారు ఇంకా జగ్గయ్య రమణారెడ్డి, వగైరాలు ఉన్నారు

మాటలు పినిసెట్టి శ్రీరామమూర్తి, పాటలు. ఆరుద్ర, సి నారాయణరెడ్డి, కొసరాజు, సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ చౌదరి, నిర్మాత దర్శకుడు లింక్

## 'వివాహబంధం'

భరణీ పిక్చర్స్ 'వివాహ బంధం' నిర్మాత, దర్శకులూ అయిన శ్రీ రామకృష్ణ ఇటీవల ఒక యుగళ గీతాన్ని కూడా చిత్రీకరించారు దీనితో ఈ చిత్రం షూటింగ్ దాదాపు పూర్తి అయినట్లేనని తెలుస్తుంది

"నీటిలోన నింగిలోన నీవే ఉన్నావులే ..
కనులలోన కలలోన కలసి ఉన్నాములే !"

పై పాటను సి నారాయణరెడ్డి వ్రాశారు శ్రీమతి పి భానుమతి, పి బి శ్రీనివాస్ పాడగా యం బి శ్రీనివాస్ కూర్చిన బాణీతో పై పాటను రికార్డు చేయడం జరిగింది సంగీత పర్యవేక్షణ శ్రీమతి పి. భానుమతి

ఈ పాటకు సందర్భం నాయకీ నాయకులు మధుర విహారం (హనీమూన్) నవ వివాహితులు భారతి (భానుమతి), లెక్చరర్ చంద్రశేఖరం (యన్ టి రామారావు), ఈ విహారంలో ఆగ్రా, ఉదయపూర్, జయపూర్, హంపీలాంటి ప్రసిద్ధ చారిత్రక ప్రదేశాలన్నీ కొడైకానల్, తెక్కెడీలాంటి ప్రకృతి రమణీయక ప్రదేశాల్నీ సందర్శిస్తారు.

ఈ పాటను తెక్కెడీలోనే చిత్రీకరించాలని నిర్ణయించుకున్నారు దర్శకుడు శ్రీ రామకృష్ణ ఈ నిర్ణయంలో ఒక విశేషం ఉంది సాహిత్య రీత్యా ఈ పాటను నౌకా విహారంలో చిత్రీకరించడం ఉత్తమం దక్షిణ భారతంలో నౌకా విహారానికి తెక్కెడీ ఎరస్సును మించిన సుందర ప్రదేశం మరొకటి లేదని చెప్పవచ్చు మద్రాసుకు సుమారు 500 మైళ్ళ దూరంలో, తమిళనాడు, మలబారు రాష్ట్రాల సరిహద్దుల్లో, ఎత్తైన పశ్చిమ కనుమల మధ్య ఉన్న ఈ సరస్సు చూచేందుకు ప్రతి రోజూ ప్రపంచ విలాస యాత్రికు లనేక మంది వస్తుంటారు. విచిత్ర మేమిటంటే ప్రకృతి సౌందర్యానికి పేరుపడ్డ ఈ సరస్సు ప్రకృతి సిద్ధమైంది కాదు, పెరియార్ నదికి ఆనకట్ట కట్టడం వల్ల, సుమారు సుమ్పై చదరపు మైళ్ల వైశాల్యంతో ఏర్పడిన సరస్సుది ఈ సరస్సు చుట్టూ, చెట్లని గుట్టల్నీ గానూ, మధ్య, మధ్య ద్వీపాల్లాగానూ, దట్టమైన కీకారణ్యాల్లో కిక్కిరిసి పోయిన ఒడమటి కొండలున్న ఈ కొండలు మీద క్రూర మృగాలు విచ్చల విడిగా తిరుగుతుంటాయి. సరస్సులో నౌకా విహారం చేస్తుంటే, ప్రకృతి మాత ఒడిలో నిర్భీతిగా సంచరిస్తూ సరస్సులో జలకాడే ఏనుగుల తండాలు కన్నుల విందుగా కనిపిస్తాయి దర్శకుడు రామకృష్ణ ఈ సరస్సు సౌందర్యాన్ని, ఏనుగుల గుంపుల్నీ తెరమీదకు తీసుకు రావడంలో కృత కృత్యులయ్యారని తెలుస్తోంది

త్వరలోనే విడుదల కాబోతున్న ఈ చిత్రానికి రచన పిచ్చేశ్వరరావు, పాటలు . సి నారాయణరెడ్డి, ఛాయ : అన్నయ్య, కళ : రాజేంద్ర కుమార్, కూర్పు : ఎం. వి. రాజన్, ఈ చిత్రంలో యన్ టి రామారావు, భానుమతి, కన్నాంబ, నాగయ్య, హేమలత, పద్మనాభం, వాసంతి, ప్రభాకరరెడ్డి, ఏ. వి. సుబ్బారావు, (జూనియర్), డా శివరామ కృష్ణయ్య, వంగర, బొడ్డపాటి మొదలైన నటిస్తున్నారు బాలయ్య, హరనాథ్ లు ఈ చిత్రంలో అతిథి నటులు.



'రాముడు - భీముడు'లో రామారావు, యల్. విజయలక్ష్మి.

## బి. ఏ. ఎస్. "మైరావణ"

బి ఏ. ఎస్ ప్రొడక్షన్సు వారు ఫిబ్రవరిలో ప్రారంభించిన "మైరావణ" చిత్రం పూర్తి కావచ్చింది బి ఏ ఎస్ ప్రొడక్షన్సు అధినేత, నిర్మాత, దర్శకుడు "టింగ్ రంగా" చిత్రం మొదలు యిప్పటివరకు క్రొత్తవారికి నటీనటులకు, సాంకేతిక నిపుణులకు ప్రతి చిత్రంలో ఏదోఒకటి అవకాశమిచ్చే అలవాటుంది. పల్లెటూరిపిల్ల, చెంచులక్ష్మి, భీష్మ మొదలగు బాక్సాఫీసు చిత్రాలు నిర్మించిన శ్రీ సుబ్బారావు ప్రస్తుతం నిర్మిస్తూ, దర్శకత్వం వహిస్తున్న "మైరావణ" చిత్రాన్ని ఈ నెలలోనే విడుదల చేయ నున్నట్లు తెలియజేశారు.

ఈ చిత్రంలో ధూళిపాళ, రేలంగి, కాంతారావు, శోభన్ బాబు, హరనాథ్, రమణారెడ్డి, జగ్గారావు, ఏ వి సుబ్బారావు (జూనియర్), మిక్కిలినేని, రాజనాల, పేకేటి, బాలకృష్ణ, కృష్ణకుమారి, గిరిజ, శారద, అనూరాధ, జె నిర్మల, అన్నపూర్ణ, వాణిశ్రీ మొదలగువారు నటిస్తున్నారు.

కథ — మాటలు : సదాశివబ్రహ్మం, పాటలు : ఆరుద్ర అండ్ సదాశివబ్రహ్మం, సంగీతం : యస్. రాజేశ్వరరావు, ఛాయ . పి దత్తు, కళ : వాలి, కూర్పు : మార్తాండ్, కో—డైరక్టర్ : టి ఎస్. రామారావు, నిర్మాత — దర్శకుడు బి ఏ. సుబ్బారావు

## డా. "చక్రవర్తి"

అన్నపూర్ణా పిక్చర్సు వారి "డా. చక్రవర్తి" చిత్రాన్ని త్వరలో పూర్తిచేసి విడుదల చేయనున్నారు. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి, జానకి, గుమ్మడి, జగ్గయ్య, కృష్ణకుమారి (గెస్టు)., గీతాంజలి, జయంతి, చలం, పద్మనాభం, మురళీకృష్ణ, సంగమేశ్వరరావు మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు ఆత్రేయ, పాటలు : ఆత్రేయ, శ్రీశ్రీ, దాశరథి, ఆరుద్ర, సంగీతం : యస్. రాజేశ్వరరావు, ఛాయ సెల్వరాజ్, కళ : జి వి సుబ్బారావు, నృత్యం వసుమర్తి, దర్శకత్వం ఆదుర్తి సుబ్బారావు, నిర్మాత దుక్కిపాటి మధుసూధనరావు

## "పల్నాటి వీర కథ"

అనురూపా వారు ద్వితీయకానుకగా "పల్నాటి వీరకథ" చిత్రంగా చారిత్రాత్మక కథను నిర్మించనున్నారు ఈ చిత్రంలో బ్రహ్మనాయుడుగా యన్ టి రామారావు, నాయకురాలు నాగమ్మగా శ్రీమతి పి. భానుమతి నటించనున్నారు.

ఈ చిత్రానికి స్క్రిప్టు వర్కు శ్రీ సదాశివబ్రహ్మం నిర్వహిస్తున్నారు కళ : గోఖలే, ఛాయ . పి నాగేశ్వరరావు దర్శకపారధ్యం : జి రామినీడు వహిస్తున్నారు.

ఈ చిత్రానికి నిర్మాతలు టి హనుమంతరావు, డి సూర్యనారాయణ, అండ్ వై లక్ష్మయ్యచౌదరి.

పి. ధర్మారావు,

Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Stree
Madras-1. Phone; 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

